# విజ్ఞప్తి.

భగవంతుని చే నరునకుఁ జెప్పఁబడినదగుట నిది భగవద్గీత యనఁబడెను. యుద్ధసమయమునఁ జెప్పఁబడినది పూర్వగీతయనియు, అశ్వమేధయాగసమయమునఁ జెప్పఁబడినది ఉత్తరగీతయనియు వ్యవహరింపఁ బడుచున్నది. పూర్వ గీతయందు మోహావిష్టుఁడు, ఇతికర్తవ్యతా మూఢుఁడు, జిజ్ఞాసువునగు నరునకు జ్ఞానమార్గ ముపదేశింపఁబడినది. ఉత్తరగీతయందు సంపదావిష్టుఁడు, జిజ్ఞాసువునగు నరునకు నింద్రియములు, మనస్సు లొంగుబాటునకువచ్చుటకుఁగాను బలవదింద్రియనిగ్రహమగు యోగాభ్యాసముఁ జెప్పఁబడినది. ఇట్టి యాధ్యాత్మిక జ్ఞానప్రబోధమున శ్రీభగవానుఁ డచేతనులంనుఁ జేతనోజ్జీవముఁ గల్గించెను. కర్మల భక్తిఁజొనిపి యాభక్తి జ్ఞానమిశ్రమమై ఫలరూపమునుబొందఁ దత్ఫలానుభవమున "అర్జునుఁడు" అనగా ఋజుప్రవర్తనగల నరుఁడు కర్తవ్యపరిపాలనముఁ గావించి యానందమనుభవించుటయే యిందలి శుభపరిణామము; సారాంశము.

సూక్ష్మముగ విమర్శించిచూచిన నీ భగవద్గీతా ప్రభావము భాషచే నిట్టిదని నిరూపించుటకు నెవ్వనికిని సామర్థ్యము లేదనుట సాహసోక్తి కానేరదు. ఇది యొక పరమరహస్యముతోఁ గూడిన సద్గ్రంథము. దీని యందు సమస్త వేదములలోని సారము సూక్ష్మీకరింపఁబడి యున్నది. దీనియందలి భాష యేకొలది యభ్యాసము చేసినవానికైనను సులువుగఁ దెలియఁబడును. కాని ఇందలి యాశయములు మాత్రము చాలగంభీరమైనవగుట నిరంతరము (జీవితపర్యంతము) తెలియఁ గృషిచేసినను నింకను దెలియవలసినది చాలగనున్నట్లు విజ్ఞానులకును ద్యోతకమగుచుండును. ప్రతిదినము మననముఁ జేసినకొలదియు క్రొంగ్రొత్త భావము లుదయించుచునే యుండును. మానవ జీవితమున నడుగడుగునకు నుత్పన్నమగు నతివిషమ సమస్యలకన్నిటికిని నిది పరిష్కార మార్గము చూపును. ఎప్పటికప్పుడే యీ గీతాశాస్త్రము నవీనత్వము నొందుచుండును. ఏకాగ్రచిత్తుఁడై శ్రద్ధాభక్తులతో దీనినే విచారణఁ జేయుచుండిన దీని ప్రతిపదము నందున నేదో

దొక పరమరహస్యము నిండియున్న శ్రైష్ఠ్యమును కలిగిన జ్ఞానమునకుపైన మిగిలి కనబడుచుండును. శ్రీభగవానుని గుణగణములు, ప్రభావము, రహస్యవర్తనము, యదార్థ స్థితి యేవిధముగ నీగీతాశాస్త్రమున విశదీకరింపఁబడినవో ఆ విధముగ మనకు నితర గ్రంథములందు లభ్యమగుట కష్టతరము. సామాన్యముగ నాధ్యాత్మిక గ్రంథముల లోను యేకొంచమో సంసారిక, లోకవిషయములు కలసి యుండును. కాని యీగీతాశాస్త్రమున మాత్రము నూటికి నూరుపాళ్లు భగవంతుని సదుపదేశము లేని వ్యర్థ పదమొక్కటైనను గానరాదు. ఇది పారాయణమునకును అర్థ భావసహితముగఁ దెలిసికొని మననముఁ జేసికొనుట కును యోగ్యమైనది.

తన భక్తులకొఱకే యీ గీతాశాస్త్రము బయలు వెడలినదని భగవంతుఁడు చెప్పుటచే భక్తిశ్రద్ధలుకల్గి ఋజువర్తనుఁడగు ప్రతి మానవునికి దీనియందధికారము కలదు. కాని చెప్పఁబడిన విషయరహస్యము తెలిసికొన లేకపోవుటవలనఁ గొందఱు గీత సన్యాసుల కొఱకే

ఆంధ్రీకరింపుఁడు." అని ప్రోత్సహించిరి. ఇదియును భగవ త్ప్రేరణయేయని భావించి తెనుఁగున తేటగీత సరళమైన వృత్తమని యెంచి భగవద్గీత (పూర్వగీత & ఉత్తరగీత) శ్లోకములు తేటగీత పద్యములుగ మూలమునకు వచ్చు నన్ని యర్థములు పద్యములకు వచ్చునట్లును పారాయణ మునకు ననువగునట్లును,శ్రమపడి సులభశైలిని భగవదను గ్రహమునరచింపఁగల్గితిమి. చిన్నశ్లోకము పొడిగించుటకు పెద్ద శ్లోకము కుదించుటకు తేటగీత వృత్తము తికమక పెట్టినను భాగవతాంధ్రీకరణము వలె తేటగీత భగవద్గీ తయు శ్రీ భగవానుని కృపచే నిర్దుష్టముగ రచించి తెలుగునాఁడున కందీయఁగల్గితిమి. పూర్వగీత మూలము గోరఖ్‌పూర్, గీతాప్రెస్ నాగరలిపి గ్రంథమునుంచియు, ఉత్తరగీతమూలము శ్రీశంకరాచార్యులవారి పరమగురువు లును, మాండూక్యోపనిషత్తులకు కారికారూపమున వ్యాఖ్యాగ్రంథమును రచించినవారును నగు శ్రీ గౌడ పాదాచార్యులవారు భాష్యము వ్రాసినదియు,శ్రీరంగము నందలి శ్రీ వాణీవిలాస ముద్రాక్షరశాలాధికారులు

ముద్రించినదియు నగు ప్రతినుంచియు గ్రహింపఁబడినవి. అనుభవజ్ఞులు, విజ్ఞానవేత్తలువిశేషములఁదెలిపిన ద్వితీయ ముద్రణమున సరిజేసికొందుము.

గీతాసందేశము ననుసరించి మనము చేయువలసిన దేమన ? సర్వమానవులు పరమాత్మని బొందుటకు శాశ్వతసుఖ మనుభవించుటకు త్యాగమే ముఖ్యసాధనము. "అదే విడుపు, మోక్షము, ఆనందము" అని చెప్పఁబడెను కాన "కర్మఫల పరిత్యాగము" అను నగ్నిపుటంబున రూపుమాయునవి స్వార్థముతో గూడినవియైన దొంగతనము, వ్యభిచారము, అబద్ధము, కపటము, మోసము, నిరంకుశత్వము, (జబర్దస్తీ) హింస, అభక్ష్యభోజనము మొదలగు శాస్త్రనిషిద్ధ కర్మలును, స్త్రీ, పుత్ర, ధనాది ప్రియవస్తులాభమునకు, రోగ సంకటనివృత్తికిఁ జేయఁబడు యజ్ఞ, దాన, తప, ఉపాసనాదిస్వార్థపర సకామకర్మలును (లోకోపకారమునకుఁ జేయఁబడు నిట్టి కర్మ స్వార్థరహితమగుట సకామకర్మకాదు) గౌరవము, ప్రతిష్ఠ, గొప్పదనము, స్త్రీ, పుత్ర, ధనా ద్యనిత్య

పదార్ధములు ప్రారబ్ధవశమున నే కొంచెము లభ్య మైనను నవి భగవత్ప్రాప్తికి బాధాకరములని యెంచక వాని పెంపుకొఱకే చేయు తృష్ణాసహిత కర్మలును, తన సుఖము కొఱకు నితరులకుఁగష్టమైనను తనకు హైన్యమైనను గమనించక చేయు యాచించుట, సేవించుట మొదలగు నైచ్యకర్మలును, త్రికరణశుద్ధిగఁ ద్యజించి సంపూర్ణ కర్తవ్య కార్యములనుండి జాగుచేయక ఫలాపేక్షను భగవదర్పితముఁ గావించి దేవతాపూజ, మాతాపితృ గురుజన సేవ, స్వధర్మాచరణముల గృహస్థాశ్రమ నిర్వాహణ గావించుకొనుచు, నెల్ల కోరికల విడిచి పవిత్రయుత ఉత్సాహపూర్వక ధ్యానమున ఫలాపేక్షారహితేశ్వరోపాసనఁ గావించుకొనుచు ఇహలోక పరలోక ఫలభోగములు క్షణభంగురములనియు, భగవద్భక్తికి బాధాకరములనియు నెంచి యే వస్తులాభమునకుగాని, యెట్టి కష్ట సంకటనివారణనకు గాని భగవంతుని ప్రార్థించక మనము నందైననట్టి యిచ్ఛయుంచక మిథ్యాజీవనముకొఱకు భగవంతునియందలి విశుద్ధభక్తికి కలంకముఁ గల్గించక అహం

భావము వదలి సద్గుణదుర్గుణములఁ గల్గు కర్మవాసనలను మనమున హత్తుకొననీయక జలంబుల బాహ్య శరీరశుద్ధిఁ గల్గించునట్లు ఋజుత్వమున మనంబును,జ్ఞానమునబుద్ధియు, విద్యాతపంబుల జీవాత్మ శుద్ధియుఁ గావించుచు రాగ, ద్వేష, కపటాది మనోవికారముల నశింపఁజేసి స్వధర్మ పాలనకుఁ గష్టముల సహించి మనస్సు, ఇంద్రియములు స్వాధీనము నందుంచుకొని అంతఃకరణ సరళత, దుఃఖుల యెడ దయ, భగవంతునియందు విశ్వాసము, నిత్యానిత్యవస్తువివేకము, బ్రహ్మలోక పర్యంత సమస్త పదార్థముల నిరాసక్తి, మమత్వబుద్ధితో వస్తుసంగ్రహాభావము, సంశయనాశనముఁగల్గి మహాత్ములశక్తి తేజంబున పాపతిమిర క్షయంబునొంది ధైర్యము,నిర్భయము,నమ్రత,అహింస, సత్యము,అస్తేయము, బ్రహ్మచర్యము,అపైశునము,లజ్జ, అమానిత్వము, నిష్కపటత, శౌచము, సంతోషము, తితిక్ష, సద్గోష్ఠి, యజ్ఞము (సంయమనము) దానము, (హృదయార్ద్రీభూత త్యాగము) తపము :(స్వధర్మాచరణమునకైన ద్వంద్వసహిష్ణుత) స్వాధ్యాయ, శమ, దమ

వినయ, ఆర్జవ, దయా, శ్రద్ధ, వివేక, వైరాగ్య, ఏకాంతవాస, అపరిగ్రహ, తేజః, క్షమ, అద్రోహ, నిరహంకారత, శాంతి, ప్రసన్నాది సద్గుణముల నలవరచుకొనుటకు నభ్యాసముఁ జేయుచు నెవ్వరికిఁ గష్టముఁ గల్గింపక కర్తృత్వాభిమానము లేక, ప్రియము వలుకుచు నొరుల నిందింపక సత్కారముల కుబలాటపడక, శిథిలమగు శరీరధారణమున నిత్యానందమయ మోక్షసామ్రాజ్య పట్టభద్రుల మగుటకుఁ బ్రయత్నింతము గాక!

"దేహముతో స్వధర్మాచరణముఁ గావించుట కర్మయోగము. దేహాతీతమైన యాత్మజ్ఞానము సాంఖ్యయోగము. దేహము క్షుద్రమైన పైతొడుగు. శిథిల స్వభావము కలది. ఆత్మ అఖండము, వ్యాపకము, అమరత్వము కలది అగుటవలన ఫలత్యాగరూపమున సాంఖ్య, కర్మయోగములకు సామరస్యమును సాధించుటకు స్వధర్మముయొక్క సహజ సరళ మార్గమున సంచరించుచు దేహముయొక్క క్షుద్రత్వ మెఱిఁగి స్వధర్మముకొఱకే దానిని వినియోగించుచు నవసరమైన దానికొఱకే యా

హాని జేయుచు నాత్మయొక్క అఖండత్వము నిరంతరము స్మరించుకొనుచు స్వ పర భేదంబులఁ బెటికివేయుచు నీ మర్త్య దేహముతోనే యమర్త్యత్వమును సాధింతము గాక. "కర్మను మాత్రము తప్పక చేయుము. దాని ఫలము మీఁదమాత్ర మధికార ముంచుకొనకుము." అని గీతా సందేశము. ఇదే సత్వగుణమును చెప్పును. రజోగుణము "కర్మలను స్వీకరించిన ఫలసహితముగనే స్వీకరింపుము" అనును. ఇంక తమోగుణము (రజోగుణముయొక్క జ్యేష్ఠ భ్రాత) ఫలము వదలినప్పుడు కర్మలుచేయుట మాత్రము మనకెందులకు?" అనును. మనము గీతా సందేశమునే పాటించి సత్వగుణవాక్య మాదరించి ఫలితము శ్రీరామ చంద్రార్పితమని కర్మలు చేయుచుందము. చేను పెంచుట మన పని; పంట పండుట దాని పని.

ఆధ్యాత్మిక జ్ఞానానుభవముకల మహాత్ముల వలన నింకను వినుచు మననముఁ గావించుకొనుచు నీ యాధ్యాత్మిక జ్ఞానరసస్రవంతిని మన జీవిత నౌక పయనింపఁ జేయుచుందము గాక. శ్రీరామ నృసింహమూర్తి కవులు.

# సమీక్ష.

శ్రీరామ నృసింహమూర్తి కవికృత తేటగీత భగవద్గీత (పూర్వగీత & ఉత్తరగీత) ప్రతి అచ్చటచ్చట పరిశీలించితిని. వీరిచే రచింపఁబడిన శ్రీమదాంధ్ర భాగవతమునుగూర్చిన నా సమీక్ష పెద్దలంగీకరించుటచే మఱల నీ తేటగీత భగవద్గీతను గూర్చి నాకుఁదోచిన విషయముల నీక్రింద బొందుపరతును. విజ్ఞులు గమనింతురుగాక.

మూలమున కనువాద మెంత సన్నిహితముగనున్నదియు, మూలము గ్రంథస్థమగుటచే విబుధులకు నేను వేఱుగ మనవిచేయనక్కర లేదు. వీరు భాగవతమును కవిత్రయము వారి భారతశైలిలో నిర్దుష్టముగ, సలక్షణముగ నందు తిక్కన శైలివలె పదమధ్యయతులతో రచించి పెద్దల మెప్పువడయుట అందఱకుఁ దెలిసిన విషయమే. కేవల పరిభాషతోఁ గూడిన యాధ్యాత్మికవిషయములు గల భాగవతము భారత శైలిలో రచించుటయున్న సామాన్య విషయముఁగాదు. అది పెద్దలకుఁ దెలియని యదియునుగాదు. అందునను ఈ భగవద్గీత నూటికి నూఱుపాళ్లు వేదాంతమే. దీనిగూడ నదేశైలిలో రచించి

చూపి వీరి యసాధారణ ప్రతిభ వెల్లడించిరి. ఈ తేట గీత పద్యములు "మాటలా? పద్యములా? ఇందు గణ ములు, యతులు నున్నవా ? ఉన్నను నవి సరియైనవి యౌనా?" అను తికమక కవులకును గలుగకపోదు. కొన్ని పాదము లుదాహరణకుఁ జూపుదు. గ్రంథమంతట నటు లనే కలవు పరిశీలింపుఁడు.

అ1 – ప9 నానిమిత్తము తమ జీవనములు విడువ
20 మోల గుమిగొన్న ధార్త్రరాష్ట్రులఁబొడగని
2 – 31 ధర్మసముపేతమైన యుద్ధంబుకంటె
నొండు మేలెద్దియును క్షత్రియునకు లేదు
4 – 50 కర్మములఁగౌశలమ్ము యోగమ్ము సుమ్ము
3 – 35 అన్యధర్మము మిగుల భయావహమ్ము
5 – 13 ఇంచుకేని జేయకయుఁ జేయించకయును
9 – 33 లోకమునుబొందియున్కి- గొల్వుమికఁ నన్ను
11 – 12 ఆ హృషీకేశు కాంతి సమానమునకు
12 – 17 శుభము నశుభంబు విడిచి భక్తిభరితుఁడంబు
14 . 16 నిర్మలమునైనది ఫలంబని వచియింత్రు
17 2 సాత్వికము రాజసము తామసంబటంచు

ఇఁక భగవద్గీతయందలి పూర్వగీత పద్యములుగ చాలమంది రచించి యుండవచ్చుఁగాని తేటగీతలతో శ్లోకమునకుఁ బద్యముగ పూర్వగీత ఉత్తరగీతలు సలక్షణముగ రచించిన గౌరవము వీరికే దక్కినది. ఆధ్యాత్మిక కవులకు భాషాలోపము తదితర కవులకు నాధ్యాత్మికానుభవ లోపము సహజముగ నుండుట యందఱికిఁ దెలిసిన విషయమే. అందునను దాక్షిణాత్యమాతృకల ననుసరించి కుంభకోణమువారు నాగరాక్షరములందు ముద్రించిన భారత గ్రంథమునగాని, ఆంధ్రాక్షరములలో చెన్నపురియందు ముద్రింపఁబడిన భారత గ్రంథమునగాని, కలకత్తాయందు ప్రతాపచంద్రరాయలవారు ముద్రించిన భారత గ్రంథమునగాని యీ యుత్తరగీతా గ్రంథ భాగము కనబడుటలేదు. అందువలన నుత్తరగీత నెవరును నింతవర కాంధ్రీకరించలేదనియే తోఁచుచున్నది.

ఇఁక పూర్వగీత నెందరు పద్యములుగ రచించినను దాని సత్త్వప వారివారి యనుభవమునుబట్టి తగిన గౌరవ మొసఁగుచున్నది. కాళిదాస కృత శాకుంతల నాటక మెందఱాంధ్రీకరించిరో గాంచుఁడు.

1. పరవస్తు వెంకటాచార్యులు 2. కందుకూరి వీరేశలింగము 3. కోరాడ రామచంద్రశాస్త్రి 4. రాయదుర్గం నరసయ్య శాస్త్రి 5. వేదము వెంకటరాయ శాస్త్రి 6. వడ్డాది సుబ్బారాయడు 7. ముదిగొండ మల్లికార్జున కవి 8. గూడ కృష్ణయ్య 9. అంబటిపూడి రామబ్రహ్మము 10. వి. కన్నయ్య 11 కస్తూరి సుబ్బారావు 12. మంత్రిప్రగడ భుజంగరావు 13. సోమరాజు రామానుజరావు 14. రాళ్ళబండి కోటమరాజు 15 కాంచనపల్లి కనకాంబ 16. వెంకట పార్వతీశ్వరకవులు 17. జె. గంగన్న 18 వత్సవాయి వెంకటనీలాద్రిరాజు 19. పంగనామముల రామచంద్రరావు 20. ఎస్. రామకవి 21. వేది కాశీనాథ శాస్త్రి 22. గరిమెళ్ళ వెంకటనరసింహశాస్త్రి. ఇంకను నెందఱో ఆంధ్రీకరించిరి. కాని దేని విలువకును కొఱత రాలేదు. కవిసమర్థత ననుసరించి గౌరవము కల్గుచునే యున్నది. ఆధ్యాత్మిక గ్రంథములు సలక్షణమగు సులభశైలిలో రచించఁగల ప్రతిభకు ప్రాచీన,ఆధునిక యాంధ్ర కవులయందు నీ శ్రీరామ నృసింహమూర్తికవులదే యగ్రతాంబూలమనినను సాహసము కానేరదు.

సాధారణముగ వేదాంత శాస్త్రము వారి వారి జ్ఞానానుభవమునుబట్టి యంతరమేర్పడి భేదాభిప్రాయములకు దారిజూపుట మానవ సహజమైయున్నది. శంకరుఁడు, రామానుజులవంటి మేధావులు కలిసి యొక వేందాంత గ్రంథము రచింపఁ బూనుకొనిన ౩౬ అంకె వలె యెడ పెడ మొగముల గ్రంథరచనకు భంగముకలిగి తీరవలసినదే కాని జరుగుట కవకాశము లేదుకదా ? అట్లుఁగాక యీ శ్రీరామ నృసింహమూర్తి కవులకు భాష, భావము సమానప్రతిపత్తితో నడచుచుండుట వారి భావి భాగ్యోదయమునకు ఉత్తమ గ్రంథ రచనావిధానముల విజ్ఞానార్థుల జ్ఞానాభ్యుదయమునకు కారణమగుచున్నదని వేఱె చెప్పనక్కరలేదు.

ఇట్టి యీ శ్రీరామ నృసింహమూర్తి కవులకు శ్రీ భగవానుఁడాయురారోగ్య భాగ్యములొసంగి యితోఽధిక గ్రంథరచనకు ప్రోత్సాహమొసంగుగాక ! ప్రజలు సహకరింతురుగాక !!

కె. శ్రీరామమూర్తి బి. ఎ.
విద్వాన్, తెలుగు & హిందీ.



"శ్రీరామ నృసింహమూర్తి కవులు"

గంధం శ్రీరామమూర్తి & ఇట్టింకి నరసింహమూర్తి.

# వి ష య సూ చి క.

## ఉత్తరగీత.





# తేటగీత - భగవద్గీత.

శ్రీ రామ నృసింహ మూర్తి కవులు:—

శ్రీకృష్ణపరమాత్మస్తుతి.

శ్రీ కరపాణిపద్మమునఁ గ్రీడికిఁజూపుచు
నాత్మముద్ర నొం
డొ కరసారసమ్మున సమర్థతఁదాల్చుచు
వేత్రితో త్రిముల్
కేకికలాపసంకలిత కేశకలాపముతోడ
నొప్పు లో
కైకగురుండు కృష్ణుఁడు వసించుత
మాహృదయాంతరంబులన్.

శ్రీ వ్యాసభగవానుసస్తుతి.

భారత తైలపూర్ణమయి భాసిలు
జ్ఞానమయప్రదీపమున్
భూరితమోనివృత్తికయి పూని యెవండు
వెలింగఁ జేసె నా
సారసపత్రనేత్రుఁడవు సారసమంచిత
ధీయుతుండవున్
ధీరుఁడవైననిన్నుఁ బ్రణుతింతుము
వ్యాసమునీ! యశోఖనీ!

శ్రీ గీతామాతస్తుతి.

ఉద్వేలంబుగఁ గ్రీడి కేది హరి తా
నుద్బోధఁగావించెఁ గృ
ష్ణద్వైపాయనుఁ జేది భారతకృతిన్
మధ్యంబునన్ గూర్చె న
య్యద్వైతామృతసారవర్షిణి
ప్రకృష్టాష్టాదశాధ్యాయశ్రీ
కృద్విద్యన్ నిను గొల్తు మంబ!
భగవద్గీతా! భవద్వేషిణీ!

కృతజ్ఞత.

రసలుబ్ధాంధ్రమహాజనాదృతికిఁ
బాత్రంబౌనటుల్ రమ్యశ
క్తి సమగ్రాంధ్రమునందు భాగవతమున్
గీతన్ రచింపించి తెం
పెసఁగన్ భారతదేశమంతటను
రాణింపంగ గీర్వాణభా
ష సమీచీనగతిన్ గృతిన్ సలుప
ధార్ష్ట్యంబిమ్ము మా కోపరిభూ!

ఓమ్

శ్రీకృష్ణ పరమాత్మనేనమః

# తెలుగీత - భగవద్గీత (పూర్వగీత)

(స మూ ల ము)

## అ ధ్యా య ము 1.

అర్జున విషాదయోగము.

ధృతరాష్ట్రుడు:—

1 అని నొనర్ప ధర్మక్షేత్రమైనయట్టి
శ్రీ కురుక్షేత్రమందునఁ జేరికొన్న
మామకీనులుఁ బాండుకుమారకులును
ఏమిచేసిరి? సంజయా! యెఱుఁగఁజెపుము.

---

ప్రథమోఽధ్యాయః (అర్జునవిషాదయోగః)

ధృతరాష్ట్ర ఉవాచ:—

1 ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ?

సంజయుఁడు:—

2 రాజు దుర్యోధనుండు సంగ్రామసీమఁ
బన్నఁబడియున్న పాండవబలముఁగలయఁ
గాంచి యాచార్యుఁడగుద్రోణుకడకుఁ జేరి
ఇత్తెఱంగునఁ దా వచియించె నపుడు.

3 చూడు మాచార్య! నీదుశిష్యుఁడును బుద్ధి
మద్వరుఁడునైన ద్రుపదుకుమారు చేతఁ
బన్నఁబడియున్న యట్టి యాపాండుసుతుల
భూరితరమైన సైన్యసముత్కరమును.

4 మొనసి యిట మేటివిలుకాండ్రు పోటరు లని
వడముడికిఁ గవ్వడికి సాటివారగు యుయు
ధానుఁడు విరాటమేదినీజానియున్ మ
హారథుండగు ద్రుపదమహీరమణుఁడు.

---

సఞ్జయ ఉవాచ:—

2 దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా,
ఆచార్యముపసంగమ్య రాజా వచన మబ్రవీత్.

3 పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా.

4 అత్ర శూరా మహేష్వాసాః భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః.

5 కాక మఱి ధృష్టకేతుఁడున్ జేకితానుఁ
డలఘువీర్యుఁడుఁ గాశీధరాధిపతియుఁ
బురుజిదాహ్వయుఁడున్ గుంతిభోజుఁడు నర
పుంగవుండైనయట్టి శైబ్యుండు మఱియు.

6 మహితవిక్రముఁడగు యుధామన్యుఁ డధిక
వీర్యయుతుఁ డుత్తమౌజుఁడు భీషణప్ర
తాపఘనుఁ డభిమన్యుఁడున్ ద్రౌపదేయు
లెల్లవారున్ మహారథు లెంచిచూడ.

7 నాదుసైన్యంబునకు నధినాయకుల్ వి
శిష్టులెవ్వరో మనలోన స్పష్టముగను
ద్విజవతంసమ! వారలఁ దెలిసికొనుము
నీకు సంజ్ఞార్థమై వారినిన్ వచింతు.

---

5 ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః.

6 యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః.

7 అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ!,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే.

8 నీవు భీష్ముఁడుఁ గర్ణుఁడున్ విజయవంతుఁ
డైనకృపుఁడు నశ్వత్థామ యు వికర్ణ
సంజ్ఞకుండును ఘనుఁడగు సౌమదత్తి
యైన భూరిశ్రవుండును నట్లె మఱియు.

9 అన్యులైనపెక్కులు శూరు లాయితపడి
నానిమిత్తము తమజీవనములువిడువ
బహువిధాయుధపాణులున్ భండనక్రి
యావిశారదులై యుండి రందఱిందు.

10 ఆర్యభీష్మాభిరక్షితమైనయట్టి
మనబలం బ దపర్యాప్త మనఘచరిత!
పూని భీమాభిరక్షితమైనయట్టి
వీరిబల మిది పర్యాప్త మారయంగ.

---

8 భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిస్తథైవ చ.

9 అన్యే చ బహవశ్శూరాః మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణాస్సర్వే యుద్ధవిశారదాః.

10 అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్.

11 ఎల్లయయనంబులందు మీ రెల్లవారు
మీదు నిర్ణీతభాగముల్ మీఱకుండ
నప్రమత్తతనున్నవారై కడంకఁ
జేసి భీష్మునె సతము రక్షింతురుగాక.

12 అతనికి ముదంబుఁగూర్చువాఁడై మహాప్ర
తాపుఁడగు కురువృద్ధ పితామహుండు
డంబు మెఱయంగ సింహనాదంబుఁ జేసి
శంఖరాజంబునొత్తె నుచ్ఛ్రుంఖలగతి.

13 అంతశంఖంబులున్ బణ వానకములు
భేరులున్ గోముఖంబులు భీషణమగు
సరణి మ్రోయింపఁగాఁబడె శబ్ద మద్ది
తుములమై తోఁచె సమరాంగణమున నధిప!

---

11 అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః,
భీష్మమేవాభిరక్షంతు భవంత స్సర్వఏవ హి.
12 తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్.
13 తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహసైవాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్.

14 అత్తఱి సితాశ్వరాజసమన్వితమయి
నెగడెడు మహారథంబున నిలిచియున్న
మాధవుండును బాండవమధ్యముండు
దివ్యములగు శంఖంబు లొత్తిరి కడంక.
15 అచ్యుతుఁడు పాంచజన్యంబు నర్జునుండు
దేవదత్తంబు నెత్తియొత్తిరి క్షితీశ!
పౌండ్రమన్మహాశంఖముం బట్టి యొత్తె
నుగ్రతరకర్ముఁడైన వృకోదరుండు.
16 అధిపుఁడు యుధిష్ఠిరుండు పృథాగ్రజుం డ
నంతవిజయంబుఁ బూరించె నకులుఁడు సహ
దేవుఁడు స్వశంఖములను నొత్తిరి సుఘోష
నామకము మణిపుష్పకనామకమును,

---

14 తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః.
15 పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః.
16 అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ.

17 మేటివిలుకాఁడు కాశ్యభూమీధవుండు
నతిబలుండు మహారథుండగు శిఖండి
విరటనృపతి దృష్టద్యుమ్నుఁ డురుయశుండు
సమరమున నోటమెఱుఁగని సాత్యకియును.

18 ద్రుపదుఁడును ద్రౌపదేయులున్ నృపవరేణ్య!
మఱి మహాబాహుఁడగు నభిమన్యుఁడుఁ గడు
సంభ్రమంబున నత్తఱి సర్వగతుల
నంద ఱొత్తిరి వేర్వేఱ చిందములను.

19 భూనభోభాగములు మాఱుమ్రోఁగఁ జేయు
చున్ మహాఘోష మద్ది సంక్షోభ మిడుచు
నెల్లధృతరాష్ట్రపుత్రులహృదయములను
ఒక్కపెట్టున మును నుట్టి ప్రక్కలించె.

---

17 కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః.
18 ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహు శ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్.
19 స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్.

20 పినపఁ బాండుసుతుండు కపిధ్వజుండు
ప్రోలఁ గుమిఁగొన్న ధార్తరాష్ట్రులఁ బొడఁగని
శస్త్రపాత మిర్వంకల జరుగుచుండ
మేలౌని శరాసనంబును మీఁది కెత్తి॥
21 అపుడుకాంచి హృషీకేశు నవనినాథ!
ఇత్తెఱంగగు నుడి వచియించెఁ దాను

అర్జునుఁడు:—

అచ్యుతా! యిప్డు రెండుసైన్యంబులకును
నడిమిభాగంబున న్నిలుప్పు నారథంబు.
22 పోరుతలఁపున నిచ్చోటఁ జేరియున్న
యట్టివీరి న్నిరీక్షించునంతదనుక
ఈరణసముద్యమమున నే నెవరితోడఁ
బెనఁగవలయునో తెలియుదున్ వృష్ణివర్య!

---

20 అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః.
21 హృషీకేశం తదా వాక్య మిదమాహ మహీపతే,

అర్జున ఉవాచ:—

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత!
22 యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్,
కైర్మయా సహయోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే.

23 కుమతియగు ధార్తరాష్ట్రునకున్ బ్రియంబుఁ
జేయఁగోరుచు నీ కురుక్షేత్రమందుఁ
బోరితమ్ముఁ గావింప నెవ్వార లిపుడు
చేరియుండిరొ కన్గొందు వారి నిందు.

సంజయుఁడు—

24 భరతముఖ్య! యీవడువున ఫల్గునుండు
పలుకుటయు హృషీకేశుఁ డప్పలుకులు విని
వాహినుల రెండిటికి మధ్యభాగమందుఁ
దాను మెలపున స్యందనోత్తమము నిల్పి.

25 భీష్ముఁడున్ ద్రోణుఁడాదిగా వీరవరుల
నెల్లరన్ జూపి యిట్లనియెన్ గడంక
నిందుఁ గూడిన యీ కురుబృందములను
కలయఁ జూడుము ఫల్గునా! చలము మెఱయ.

---

23 యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః.

సఞ్జయ ఉవాచ:—

24 ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్.

25 భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్,
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి.

26 అచట నా రెండుసేనలయందునున్న
తాతలన్ దండ్రిలన్ మఱి మాతులులను
పుత్రికులను సోదరులను బౌత్రుల గురు
జనములన్ స్నేహపాత్రులౌ సఖుల మఱియు.
27 అల్లి శ్వశురుల సుహృదుల నగ్రభాగ
మందుఁ బొడఁగాంచెఁ గ్రమత నయ్యర్జునుండు
అట్టు లందు నుపస్థితులైన యా స
మస్తబంధుజనంబులఁ నతఁడుఁ గాంచి.
28 అమితకరుణారసతరంగితాత్ముఁడగుచు
వగపు గదురంగ నిట్లని పలికె హరికిఁ
అర్జునుఁడు—
బోరు సల్పంగ నిచోటఁ జేరియున్న
నీ స్వబంధుజనమ్ము నీక్షించి కృష్ణ!

---

26 తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్,
ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా
27 శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి,
తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూ నవస్థితాన్.
28 కృపయా పరయావిష్టో విషీద న్నిద మబ్రవీత్,
అర్జున ఉవాచ:—
దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్.

29 నాదుగాత్రంబులెల్ల ఖిన్నంబులయ్యె
నాననంబును బరిశుష్యమాణమయ్యె
నాశరీరంబునందు వణంకుఁబుట్టె
గగురుపాటును బొడమెడున్ గమలనాభ!

30 కరమునుండిజాఱుచునుండె గాండివంబు
నాదుచర్మము దహ్యమాన మగుచుండె
నిలిచియుండుట కేనియు నేరకుంటి
నాదుమానస ముండె భ్రాంతంబువోలె.

31 మిగులవిపరీతములగు నిమిత్తములను
కేశవా! పెక్కుటిన్ బరికించుచుంటి
స్వజనమున్ గదనంబున సంహరించి
ఇంచుకేనియు శ్రేయ మూహింపకుంటి.

---

29 సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి,
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే.

30 గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే,
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః.

31 నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ!
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే.

32 అచ్యుతా! నేను మది విజయంబుఁగోర
రాజ్యముంగోర సుఖముఁగోరను నిజంబు
స్వజనముగతింప మాకు రాజ్యమున నేమి?
భోగములనేమి? జీవితంబున నిఁకేమి?

33 వినుము రాజ్యంబు భోగంబులును సుఖములుఁ
గోరఁబడుచుండు నెవ్వరికొఱకు మదిని
వారు వీరుగో ధనములుఁ బ్రాణములును
ద్యాగమొనరించి నిలిచిరి యాహవోర్విఁ.

34 తండ్రు లొజ్జలుఁ గొడుకులుఁ దాత లల్లు
మామలున్ మేనమామలు మనుమలు మఱి
బావమఱదులు వియ్యాలవారు నైన
నఖిలబంధుజనంబులు నిలిచి రిందు.

---

32 న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవింద! కిం భోగై ర్జీవితేన వా.
33 యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ.
34 ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః,
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధిన స్తథా.

35 ననుఁ దునుమ నెంచువారి నైనను గడంగి
వీరినిన్ మధుసూదన! బిల్కుమార్పఁ
గోరఁ ద్రైలోక్యరాజ్యంబుకొఱకు నేని
నింక నీ భూమిమాట వచింపనేల?

36 మాధవా! ధార్తరాష్ట్రుల మట్టుఁబెట్టి
నేమిప్రీతి మాకున్ జనియించు? సకల!
ఆతతాయుల వీరల హతమొనర్ప
నయ్యయొ! పాపమే మమ్ముల నాశ్రయించు.

37 కాన నిట్లర్హులము మేముఁ గాము సూవె
ధార్తరాష్ట్రుల స్వీయబాంధవులఁ జంప
స్వజనమున్ మట్టుఁబెట్టఁ గేశవ! యదెట్టు
లిలపయిన్ మేము సౌఖ్యవంతుల మగుదుము?

---

35 ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే.

36 నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన!
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః.

37 తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ!

38 అమిత లోభోపహతచిత్తులగుచు వీర
లీక్షణమ్మునయందుఁ గులక్షయకృత
దోషములను మిత్రద్రోహదురితములను
గానకుందేని బోనిమ్ము కమలనాభ!

39 ఘనకులక్షయకృతదోషమును దెలిసిన
యట్టి మే మిపు డెట్టులీ యఘమునుండి
మఱలుటకునై యెఱుంగక మసలువార
మో జనార్దన! చెప్పుమీ యూహఁ జేసి.

40 కులముఁ జెడఁగ సనాతనంబులగునట్టి
సకలకులధర్మములును నష్టంబులగును
ధర్మమడుగంటఁ గులమునంతను బరాభ
వించుఁగాదె? యధర్మంబు వేయునేల?

---

38 యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్.

39 కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మా న్నివర్తితుమ్,
కులక్షయ కృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన!

40 కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత.

41 పైకొని యధర్మము కులమున్ బరిభవింపఁ
గులసతుల్ దూషితాత్మ లగుదురు కృష్ణ!
స్త్రీలు దూషితలగుడు వార్ష్ణేయ! యపుడ
సంభవించునుగా వర్ణసంకరంబు?

42 కులమునకును గులఘ్నులకును ఓరాన
నరకమునుగూర్చు వర్ణసంకరము కృష్ణ!
కటకటా! లుప్తపిండోదక క్రియులయి
వీరిపితరులు కూలుదు రౌర! వింటె?

43 ఆరయన్ వర్ణసంకర కారకంబు
లగు కులఘ్నుల యీ పాతకాళిచేత
సతములగు కులధర్మముల్ జాతిధర్మ
ములును కేశవ! యుత్సన్నములగుఁ జూనె.

---

41 అధర్మాభిభవాత్కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః.

42 సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః.

43 దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః.

44 అవని నుత్సన్నకులధర్ము లైనయట్టి
మానవులకును మధుసూదనా! నిరతము
నరకలోకవాసంబు మానకఘటిల్లు
ననుచు వినుచుండుదు మభిజ్ఞజనమువలన.

45 కటకట! యిటుల్ మహాపాతకంబు మేము
చేయగా నాత్మనిశ్చయించితిమి కాదె?
రాజ్యసుఖలోభమునఁ జేసి క్రమముఁదప్పి
కృష్ణ! స్వజనవధకుఁ గడంగితిమి కాన.

46 కేశవ! యశస్త్రు నప్రతిక్రియుని నన్ను
ధార్తరాష్ట్రు లుజ్జ్వలశస్త్రధారు లగుచు
నాహవాంగణమునఁ దెగటార్తు రేని
నరసిచూడ నాకది క్షేమతరమె యగును.

---

44 ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ.

45 అహో బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః.

46 యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్.

సంజయుఁడు :—

47 అని వచించి సంగరరంగమునఁ గిరీటి
స్వాంత ముద్వేగ మొంద విషణ్ణుఁ డగుచు
స్యందనోపరిభాగనిషణ్ణుఁ డయ్యె
సశర మైనచాపంబును జాఱవిడిచి.

## అధ్యాయము 2.

సాంఖ్యయోగము.

1 అత్తెఱంగు కృపావిష్టుఁ డశ్రుపూరి
తాకులాక్షుఁడునై విషాదాభితప్య
మానుఁడగు నాతనిన్ జూచి మధునిషూద
నుండు శ్రీకృష్ణదేవుఁడీ నుడి వచించె.

---

సఞ్జయ ఉవాచ:—

47 ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే రథోపస్థఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసం విగ్నమానసః.

ద్వితీయోఽధ్యాయః (సాఙ్ఖ్యయోగః)

1 తం తథా కృపయాఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంతమిదం వాక్య మువాచ మధుసూదనః.

శ్రీభగవానుఁడు :—

2 స్వర్గసుఖబాహ్య మపయశస్కర మనార్య
జనవిజుష్టము లైన కశ్మల మిది యిపు
డిట్టి విషమపరిస్థితి నెందునుండి
దాపురించెను నీకుఁ బృథాతనూజ!

3 క్రీడి! పొందకుమా నీవు పేడితనము
ననుపపన్నము కాదె? నీయందు నిద్ది
అరినిషూదన! కడు క్షుద్రమైనయట్టి
హృదయ దౌర్బల్యమున్ విసర్జించి లెమ్ము.

అర్జునుఁడు :—

4 ఆహవంబున నెట్లు పూజార్హులైన
యట్టి భీష్ముని ద్రోణుని ననఘమతుల

---

శ్రీ భగవానువాచ:—

2 కుత స్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున!

3 క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!

అర్జున ఉవాచ:—

4 కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!

శితశిలీముఖతతుల పాల్సేయఁగలను ?
రిపునిషూదన ! కైటభారి ! ముకుంద !

5 గురులఁ బూజ్యులఁ జంపక కుడుచుపొంటె
నీజగంబున భైక్షాన్నమేని మేలు
గరిమ గురువులఁజంపి రక్తంబుతోడఁ
గూడు నర్థకామంబుఁ గుడువవలయు.

6 ఎఱుఁగ మేదిలెస్సయొ మాకు నేము వారి
గెలుతుమో కాక వారలే గెలుతురొ మము
నెవరిఁదెగటార్చి జీవించుటే పొసఁగదొ
నిలిచి రా ధృతరాష్ట్రపుత్రులె యెదిర్చి.

---

ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన!

5 గురూనహత్వాహి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే, హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్.

6 నచైతద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యదివా నో జయేయుః, యానేవహత్వా న జిజీవిషామస్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః.

7 కృపణత స్వభావము సెడంగఁ గృష్ణ! నిన్ను
నడిగెదన్ ధర్మసమ్మోహితాత్ముఁడనయి
ఏది మేలానో యదినిశ్చయించి చెపుము
శిష్యుఁడ న్నీకు నన్ను శాసింపు కృపను.

8 అప్రతిద్వంద్వము సమృద్ధమైనరాజ్య
మంచితసురాధిపత్యము నందినైన
నింద్రియమ్ములగాఁరించు నీ వగపును
ఏది బాపునో దాని నూహింపఁ జాల.

సంజయుఁడు :—

9 కృష్ణుతో నిట్లు చెప్పి యరిందముండు
శ్వేతవాహుఁడు క్రీడి కపిధ్వజుండు

---

7 కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః, యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితంబ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్.

8 నహి ప్రపశ్యామి మమాపనుద్యా ద్యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్, అవాప్య భూమావసపత్న మృద్ధం రాజ్యం సురాణామపిచాధిపత్యమ్.

సఞ్జయ ఉవాచ:—

9 ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః,

"సమర మొనరింప నే"నని శౌరితోడ
వెండియుంబల్కి మిన్నకయుండె నంత.

10 రెండుసైన్యంబుల నడుమనుండి మిగుల
వగల దురపిల్లుచున్నయా పార్థుఁ జూచి
బిగ్గఱఁగ హాసియించుచున్ వృష్ణివరుఁడు
కృష్ణుఁడిత్తెఱఁగున వచియించె క్షితిప !

శ్రీభగవానుఁడు :—

11 వగచుచుంటివి వగవంగఁదగనివారి
కై కడున్ బగ్గ మాటల నాడుచుంటి
మృతినిబొందినవారికై బ్రతికియున్న
వారికై కూడ పండితుల్ వగవఁబోరు.

---

న యోత్స్య ఇతి గోవింప ముక్త్వా తూష్ణీం బభూవహ.

10 తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః.

శ్రీ భగవానువాచ:—

11 అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః.

12 నేను మఱి నీవు నీ యవనీపతులును
లేనివారముగా మెప్డైని దొల్లి
ఇంకమీఁదట నేన్ మన మెల్లరమును
బుద్ధినూహింప నుండకపోము సుమ్ము.

13 ఎత్తెఱంగున దేహికి నిత్తనువునఁ
బొసఁగుఁ గౌమార యౌవనంబులు ముదిమియు
నట్లె దేహాంతరప్రాప్తి యగును జువ్వె
అందు ధీరుండు మోహంబుఁ బొందఁ బోఁడు.

14 పాండునందన ! మాత్రలున్ స్పర్శములును
తలఁప శీతోష్ణసుఖదుఃఖదాయకమ్ము
లాగమాపాయయుక్తంబు లస్థిరములుఁ
గావునన్ వీని సైరింపు మీవు పార్థ !

---

12 న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః.
న చైవ న భవిష్యామస్సర్వే వయ మతఃపరమ్.

13 దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాన్తరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి.

14 మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత!

15 దుఃఖములయందు సుఖములందును సముండు
ధీరచిత్తుఁడునైన యే పూరుషు నివి
వ్యథలఁబొందింపఁజాలవో భరతముఖ్య!
ఆతఁ డమృతత్వమునకు సమర్థుఁడగును.

16 లేనిదానికి నునికియే లేదు సూవె?
ఉన్నదాని కభావంబుండఁబోదు
ఈయుభయములయంతంబు ధీయుతులయి
కాంచఁగల్గిరి తత్త్వంబుఁగన్నవారు.

17 వ్యాప్తమయ్యె నెద్దాన నీ యఖిలజగము
నెఱుఁగు మద్దాని నాశరహితముఁగాఁగ
నవ్యయంబగు దీనికి సవ్యసాచి!
నాశనంబు నెవండే నొనర్ప లేఁడు.

---

15 యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ!
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే.

16 నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయో స్తత్త్వదర్శిభిః.

17 అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్,
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి.

18 శాశ్వతుం డప్రమేయుం డనశ్వరుండు
నగు శరీరికిఁ దనువు లియ్యవి విబుధుల
చేత నంతవంతములుగఁ జెప్పఁబడియెఁ
గావునన్ బోరుసల్పుము నీవు పార్థ!

19 ఎవ్వఁ డాత్మను హంతగా నే జనుండు
హతునిగాఁగ నెఱుంగునో యియ్యిరువురుఁ
దెలియనేరనివారె సందియము లేదు
చంపఁ డితఁ డొరు నొరుచేతఁ జంపఁ బడఁడు.

20 పుట్టదొక్కప్పుడేనియు గిట్టఁబోదు
ఆత్మ యిది కాక కాఁగలయదియుఁ గాదు
శాశ్వతంబు పురాణ మజంబు స్థిరము
చంపఁబడుడు దేహంబిది చంపఁబడదు.

---

18 అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత!

19 య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్,
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే.

20 న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వా భవితా
నభూయః, అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో నహన్యతే హన్య
మానే శరీరే.

21 ఎవఁడు "నిత్యంబు నాశరహిత మజంబు
నవ్యయము"నని దీని లో నరసి తెలియుఁ
బార్థ! యా పురుషుం డె ట్లపార్థుఁడగుచు
నెవనిజంపింపఁజేయుఁ దా నెవని జంపు.

22 ఎట్టులు నరుండు చినిగినపుట్టములను
దొలఁగవిడిచి క్రొంగ్రొత్త వల్వలను దాల్చు
నట్లె దేహియు జీర్ణదేహములు విడిచి
నూతనములైన యన్యతనువులఁ దాల్చు.

23 తునుమఁజాల వీ యాత్మఁ గైదువు ల వెల్లఁ
గాల్పలేదు దీనిని బావకంబుఁగూడ
తడుపలేవు తోయంబులున్ దలఁచిచూడ
మఱియు నింకింప నేరదు మారుతంబు.

---

21 వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హన్తి కమ్?

22 వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి.
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ.

23 నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః.

24 అలవి కానిది పార్థ ! యీ యాత్మ నఱుకఁ
గాల్పఁ దడుప నింకింప నిక్కమ్ము సుమ్ము
సర్వగతమును నిత్యంబు స్థాణు వచల
మవ్యయంబు సనాతనమైన దిద్ది.

25 చెప్పఁబడెడి నవ్యక్త మచింత్యము నవి
కార్యమునటంచు నీయాత్మ కాన నీవు
ఇత్తెఱంగున నిద్దాని నెఱిఁగి యూర
కుల్లమున శోకమంద నర్హుఁడవు కావు.

26 అట్లుఁగాక యిద్దాని నిత్యము జనించు
దానిగా నిచ్చలు నశించుదానిగాఁగ
నెంతు వేని నట్లైన ని ట్లీవు శోక
మందఁదగవు మహాభుజా ! డెందమందు.

---

24 అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ,
నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః.

25 అవ్యక్తోఽయమచింత్యోఽయ మవికార్యోఽయముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి.

26 అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో నైనం శోచితు మర్హసి.

27 జన్మమందినదానికిఁ జావు ధ్రువము
చావునొందినదానికి జన్మ ధ్రువము
కాన నీవు పరిహరింపరాని యర్థ
మందు శోకమునొంద నన్హుఁడవిట.

28 ఆది వ్యక్తముకాదు భూతావళులకు
మధ్యకాలము వ్యక్తమై పరఁగుచుండు
నిధనమట్లె వ్యక్తముకాదు నిక్కమరయ
నందులకుఁ బరిదేవన మొందనేల ?

29 అచ్చెరువుపోలె నొకఁడీ యాత్మఁ గాంచు
నచ్చెరువు పోలె నన్యుఁడీ యాత్మఁబలుకు
నచ్చెరువుఁగాఁగ నితరుఁడీ యాత్మను విను
వినియు నీయాత్మ నెఱుఁగఁడు వేఁ డొకండు.

---

27 జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

28 అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా?

29 ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్.

30 దేహియగునాత్మ యిది సర్వదేహములను
నిత్యము నవధ్యమైయుండు నిక్కువంబు
కావున సమస్తభూతసంఘమునుగూర్చి
ఊరకే శోకమొంద నర్హుండవుఁ గావు.

31 కాంచక స్వధర్మమున్ బరికించియైన
నిట్లు బెగడొంద యోగ్యుండ వీవుకావు
ధర్మసముపేతమైన యుద్ధంబుకంటె
నొండు మేలెద్దియును క్షత్రియునకు లేదు.

32 పార్థ! యాదృచ్ఛికముగ సంప్రాప్తమైన
యీదృశంబగు యుద్ధమూహించి చూడ
వివృతమైన స్వర్గద్వార మవుసౌఖ్య
వంతులగు క్షత్రియుల్ దీని బడయుచుండ్రు.

---

30 దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత!
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి.

31 స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్య

32 యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధమీదృశమ్.

33 పాండవా! ధర్మ్యమైన యీ భండనంబు
నీవు కావింపకుందువేనియును దాన
స్వీయధర్మమున్ గీర్తిన్ ద్యజించినైచి
పాతకంబు నొందుదువు పృథాతనూజ!

34 మఱియు భూతసంఘంబులు మానిపోని
నీ యకీర్తిని జాటెడు వేయిగతుల
గరిమ సంభావితుండగు పురుషునకును
మరణమునకంటె యాతనామయ మకీర్తి.

35 తలఁతురు మహారథుల్ నిన్ను దల్లడపడి
భండనమునుండి తొలఁగినవానిగాఁగ
నెవరిమధ్యను బహుమతుండవయి తీవు
వారికడఁ బొందెదవు లాఘవంబు నిపుడు.

---

33 అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి.

34 అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తిర్మరణా దతిరిచ్యతే.

35 భయాద్రణాదుపరతం మన్యన్తే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లా

36 నీ సమర్థతఁ దూఱుచు నీ యహితులు
పలు తెఱంగులుగాఁగ నవాచ్యవాద
ములను వాక్రుచ్చుచుందురు పోడిమి సెడ
నంతకంటెఁ గడున్ దుఃఖమైనదెద్ది ?

37 హతుఁడవైనచో స్వర్గము నందఁగలవు
పృథివి ననుభవింతు సమరవిజయ మంది
అట్లుఁగావున ఫల్గునా ! యాహవమ్ము
సలుపఁగా లెమ్మిఁక కృతనిశ్చయుఁడ వగుచు.

38 పార్థ! సుఖదుఃఖముల జయాపజయములను
మఱియు లాభనష్టముల సమములుఁగాఁగఁ
జేసి యాపైన ననికి సంసిద్ధుఁడ వగు
మిట్లయినఁ బాప మొంద వొక్కించుకేని.

---

36 అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాఽహితాః,
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్.
37 హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్.
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః.
38 సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి.

39 తెల్పఁబడె సాంఖ్యమునను బుద్ధి యిదినీకు
నాలకింపుము యోగమునందుదీని
గుంటువడని యీబుద్ధితోఁ గూడి నీవు
పాయఁగలవుసుమీ కర్మబంధములను.

40 ఇం దుపక్రమనాశ మొక్కింత లేదు
ప్రత్యవాయముఁ గనరాదు పార్థ! వింటె?
క్లేశ మణఁచి యీ ధర్మము లేశమైన
బహుళభయమునునుండి కాపాడుచుండు.

41 అర్జునా! నిశ్చయాత్మకమైన బుద్ధి
యొక్కటేసుమి యీ పృథుయోగమునకు
వ్యవసితులుకానివారికి బహుళశాఖ
ములు ననంతములు నగుచు బుద్ధులుండు.

---

39 ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబన్ధం ప్రహాస్యసి.

40 నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.

41 వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన!
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్.

42 పాండుకాణ్ణందనా! వేదవాదరతులు
నంతకంటె శ్రేష్ఠంబు లేదనెడివారుఁ
గాములున్ స్వర్గసుఖములఁ గాంక్షఁజేయు
వారునై యవివేకు లనారతంబు.

43 జన్మకర్మఫలంబు లొసంగునదియు
వితతభోగమహైశ్వర్యగతినిఁగూర్చి
యమితకర్మముల్ సల్పునట్టైన దీని
బుష్పితమగు వాక్కుఁగ వచింపుదురు సుమ్ము.

44 పార్థ! వింటివె? తద్వచోపహృతచిత్తు
లున్ సతంబు భోగైశ్వర్యలోలురు నగు
వారికి సమాధియందు నిల్వంగఁబోదు
నిశ్చయాత్మకమగుబుద్ధి నిజముఁ దెలియ.

---

42 యా మిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః.

43 కామాత్మానస్స్వర్గపరాః జన్మకర్మఫలప్రదామ్,
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి.

44 భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే.

45 వేదములు పార్థ! త్రైగుణ్యవిషయకమ్ము
లవుట నీవు నిస్త్రైగుణ్యుఁడవును ద్వంద్వ
బాహ్యుఁడవు నాత్మరతివి సత్త్వస్థుఁడవయి
యోగమున్ క్షేమమాసింపకుండు మాత్మ.

46 అంతట న్నిండిన జలాశయంబుఁ గలిగి
యుండ నుదపానమున నర్థ ముండు నెంత
వేత్తయగు బ్రాహ్మణున కెల్ల వేదములఁ బ్ర
యోజనం బంతమాత్రమై యుండుఁ బార్థ!

47 కర్మమునయందె నీ కధికార ముండు
ఫలములందు నొకప్పుడుఁ గలుగ దద్ది
కర్మఫలహేతువవు నీవుఁ గాకు నీకుఁ
గలుగకుండుత సంగ మకర్మయందు.

---

45 త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున!
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

46 యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః.

47 కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సఙ్గోఽస్త్వకర్మణి.

48 అనువుమై సిద్ధ్యసిద్ధులయందు నీవు
సముఁడవగుచును సర్వసంగముల విడిచి
కర్మముల నాచరింపు యోగస్థుఁడవయి
అర్జున ! సమత్వమే యోగ మనఁగఁబడును.

49 కర్మమన్నది బుద్ధియోగంబుకంటె
నెంతయు నికృష్టమ౯గ గమనింపు మదిని
బుద్ధియందునె శరణంబుఁ బొందు మీవు
కృపణముల్ ఫలహేతువుల్ కీడి : వినుము.

50 పార్థ ! పురుషుఁ డిటన్ బుణ్యపాపములను
రెండిటిన్ నేరిమిన్ విసర్జించుచుండుఁ
గావునన్ యోగమునకునై కడఁగు మీవు
కర్మములఁ గౌశలమ్మె యోగమ్మె సుమ్మె.

---

48 యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ!
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే.

49 దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనఞ్జయ!
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః.

50 బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే.
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్.

51 కోవిదుల్ తారు బుద్ధియుక్తులయి కర్మ
జనితమైన ఫలంబును సంత్యజించి
జన్మబంధనిర్ముక్తులై సవ్యసాచి!
పొందుదు రనామయంబగు పుణ్యపదము.

52 అర్జునా! విను మెప్డు నీదైనబుద్ధి
యనువునన్ మోహకశ్మలంబును ద్యజించు
వినఁదగినదానియందును విన్నదాని
యందు నప్పుడె నిర్వేద మందు దీవు.

53 ఫల్గునా! శ్రుతివిప్రతిపన్నమైన
నీదుబుద్ధి య దెప్పుడు నిశ్చలమయి
స్థిరము నై యుండునో పరీక్షించిచూడ
నప్పుడే నీవు యోగంబు నందఁగలవు.

---

51 కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్.

52 యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి,
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ.

53 శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధావచలా బుద్ధి స్తదా యోగమవాప్స్యసి.

అర్జునుఁడు :—

54 వరసమాధిస్థుఁడగు స్థితప్రజ్ఞుఁ డును
ఎట్టిదై లక్షణంబుండు ? నెఱుఁగఁ జెపుము
ఎట్లు మాట్లాడుఁ ? గూర్చుండు ? నెట్లు ? మఱియు
నెట్లు నడచుచుండును ? హృషీకేశ ! యతఁడు.

శ్రీభగవానుఁడు :—

55 ఎప్పుడు మనోగతములగు నెల్ల కామ
ములను విడనాడఁజాలునో పురుషుఁడిందు
నాత్మచే నాత్మయందు నత్యంతతుష్టుఁ
డగుచు నష్టై స్థితప్రజ్ఞుఁ డనఁగఁబడును.

56 దుఃఖముల ననుద్విగ్న చిత్తుండు సుఖము
లందు విగతస్పృహుండునై డెందమందు

---

అర్జున ఉవాచ:—

54 స్థితప్రజ్ఞస్య కా భాషా? సమాధిస్థస్య కేశవ!
స్థితధీః కిం ప్రభాషేత? కిమాసీత వ్రజేత కిమ్?

శ్రీభగవానువాచ:—

55 ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్,
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే.

56 దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః,

రాగము భయంబుఁ గ్రోధంబు వీగిపోవఁ
దనరు వాని స్థితప్రజ్ఞుఁ డనఁగఁ జెల్లు.

57 ఎల్లయెడల స్నేహంబువహింప కెవ్వఁ
డాయయి శుభాశుభంబుల నంది డెంద
మందు రాగమున్ ద్వేషమున్ జెందఁబోఁడో
యతనిప్రజ్ఞ ప్రతిష్ఠిత మగునుజూనె.

58 కచ్ఛపంబు స్వాంగంబులకరణి నెవ్వఁ
డింద్రియార్థంబులందుండి యింద్రియ వ్ర
జంబు నుపసంహరింపఁగాఁజాలు నట్టి
అతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమగును పార్థ!

---

వీతరాగభయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే.

57 యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

58 యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

59 నిరశనుండగు దేహికిన్ విషయములు ర
సంబు దక్క నివృత్తిపదంబుఁ జెందు
రసముఁ గూడ తగన్ బరబ్రహ్మముఁగని
నంతనె నివృత్తిఁ జెందు ను మ్మరసిచూడ.

60 కోవిదుండైనపురుషునకున్ గడుంబ్ర
యత్నమొనరించువానికినైనఁగాని
ఎంతయుమథించుచుండెడు నింద్రియములు
మనమును హరించుచుండెడుఁ బ్రసభగతిని.

61 ఆ సమస్తేంద్రియంబుల నణఁచి వైచి
యుక్తుఁడై మత్పరుండయి యుండవలయు
నెవనికివశంబులై యుండు నింద్రియమ్ము
లతనిప్రజ్ఞ ప్రతిష్ఠితమగును జూవె.

---

59 విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.
60 యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః,
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః.
61 తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

62 విషయములను ధ్యానంబుఁ గావించునట్టి
పురుషునకునందు సంగంబుఁ బొడముచుండు
మఱియు సంగంబువలనఁ గామంబుఁబుట్టుఁ
గామమునఁ గ్రోధ మురవడిఁ గల్గుచుండు.

63 మొనసిక్రోధంబువలన సమ్మోహ మొదవుఁ
బార్థ ! సమ్మోహమున స్మృతిభ్రంశ మగును
ఆ స్మృతిభ్రంశమున బుద్ధి యంతరించు
బుద్ధినాశమ్మునన్ జెడుఁ బూరుషుండు.

64 వినుము పార్థ ! రాగద్వేషవిరహితములు
నాత్మవశ్యములగు నింద్రియములతోడ
విషయములను జరించుచు విమలచిత్తుఁ
డగుచును బ్రసాదభాగ్యంబు నందు నరుఁడు.

---

62 ధ్యాయతో విషయాన్ పుంసస్సఙ్గస్తేషూపజాయతే,
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.

63 క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి.

64 రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి.

65 క్రమత నీతఁడికిన్ బ్రసాదమునఁ జేసి
సర్వదుఃఖములకు హాని సంభవించుఁ
దత్క్షణంబె ప్రసన్నచేతస్కునకును
బుద్ధి సుస్థిరమైయుండుఁ బొసఁగఁ బార్థ!

66 బుద్ధియును భావనయు నుండఁబోవు సుమ్ము
యోగయుక్తుండు కాని యాభాగునకును
భావనాహీనునకు శాంతిపట్టువడదు
సౌఖ్యమెక్కడిదింక నశాంతునకును.

67 ఎవనిడెందము తిరుగాడు నింద్రియముల
ననుసరించి చరించునో యనఘచరిత!
వాయువు జలంబునందు నావంబలె నది
వాని ప్రజ్ఞ హరించును ప్రసభగతిని.

---

65 ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి.

66 నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా,
న చాభావయతశ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖమ్.

67 ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే.
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి.

68 కాన నురుభుజ ! పార్థ ! యెవ్వానియింద్రి
యములు క్రమగతి నింద్రియార్థములనుండి
యెల్ల తెఱఁగుల వెస నిగ్రహింపఁబడునో
యతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమగు నిజమ్ము.

69 ఎల్లభూతంబులకు నిశి యేదియగునో
యందు మేల్కనియుండు సంయమివరుండు
ఎందు మేల్కాంచు భూతంబులెల్ల నదియ
పాండవా ! రేయియగుఁ జూచుచుండు మునికి.

70 స్థిరముఁ బూర్ణము నచలప్రతిష్ఠము నగు
సాగరంబునఁజొచ్చెడు జలములట్లు
లెల్ల కామంబులున్ దగ నెవనిజొచ్చు
వాఁడు శాంతినిగనుఁ గామపరుఁడు కాఁడు.

---

68 తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇంద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

69 యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః.

70 ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్,
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తిమాప్నోతి న కామకామీ.

71 పురుషుఁ డెవ్వఁ డఖిలకామములజయించి
నిర్మముఁడు నిరహంకృతి నిస్పృహుఁడును
అయి చరించుచునుండునో యతఁడె విమల
శాంతిసౌఖ్యమునొందును సంతతంబు.

72 అరయ బ్రహ్మసంబంధినియగు స్థితియిది
మోహమొందఁడు దీనినిబొంది నరుఁడు
దీనియం దంత్యకాలమం దేనినుండి
బ్రహ్మనిర్వాణభాగ్యంబుఁ బడయుఁ జుమ్ము.

———

71 విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః,
నిర్మమో నిరహంకార స్స శాన్తి మధిగచ్ఛతి.

72 ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి.

———

# అధ్యాయము. 3

## కర్మయోగము.

అర్జునుఁడు :—

1 కర్మమునకంటె బుద్ధియోగమది యగ్గ
లంబటంచును గృష్ణ! తలంతువేని
నట్టిచో నన్ను నతిఘోరమైనయట్టి
యిట్టి కర్మమున న్నియోగింతు వేల?

2 అకట! సందిగ్ధమైనవాక్యంబుచేత
మోహపెట్టుచునుంటి నాబుద్ధి నీవు
దేన శ్రేయంబుఁబడయుదు నేను కృష్ణ!
నిశ్చయించి యా యొక్కదానినె వచింపు.

---

తృతీయోఽధ్యాయః. (కర్మయోగః.)

అర్జున ఉవాచ:—

1 జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన!
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ!

2 వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్.

శ్రీభగవానుఁడు :—

3 ఆలకింపు నేనీలోకమందుఁ దొల్లి
ద్వివిధమగు నిష్ఠ వచియించితి ననఘాత్మ!
జ్ఞానయోగంబుచే నల సాంఖ్యులకును
యోగిజనులకుఁ దగుకర్మయోగమునను.

4 కర్మముల యనారంభము కారణమునఁ
బురుషుఁ డిందు నైష్కర్మ్యమున్ బొందలేఁడు
ఎల్లకర్మంబులును సన్యసించినంత
మాత్రమునఁ దాను సిద్ధినిం బడయలేఁడు.

5 క్షణముఁగూడ నొకఁడు నొకానొకండు
నుండఁబోఁడు కర్మలఁ జేయకుండువాఁడు
ప్రకృతిజన్యగుణంబులఁ బట్టువడుచు
నవశులై కర్మముల నెల్ల రాచరింత్రు.

---

శ్రీభగవానువాచ:—

3 లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ!
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్.

4 న కర్మణామనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి.

5 న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః.

6 మాని కర్మేంద్రియంబుల మనసుతోడ
నింద్రియార్థంబులను స్మరియించు నెవ్వఁ
డనఘచరిత! విమూఢాత్ముఁడైనయట్టి
యా నరుండు మిథ్యాచారుఁ డనఁగఁబడును.

7 ఎవ్వఁడు మనంబుచేతన యింద్రియముల
నిగ్రహించి యసక్తుఁడై నేర్పుతోడఁ
గడఁగి కర్మేంద్రియములచేఁ గర్మయోగ
మాచరించునో వైశిష్ట్య మందు నతఁడు.

8 నియతమగుకర్మ సలుపుము నీవు కర్మ
నుజ్జగించుటకంటెఁ జేయుటయె మేలు
పూని కర్మచేయకమానితేని నీకు
దేహయాత్రయుకూడ సిద్ధింపఁబోదు.

---

6 కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే.

7 యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున!
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే.

8 నియతం కురుకర్మ త్వం కర్మజ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః.

9 వింటె ? యజ్ఞార్థమగుకర్మకంటె నన్య
కర్మమున బద్ధమగును లోకంబు పార్థ !
కాన కౌంతేయ ! సర్వసంగములువిడిచి
యాచరింపుము కర్మ యజ్ఞార్థ మీవు.

10 యజ్ఞసహితులఁ బ్రజల నొయ్యన సృజించి
వారికిట్లు ప్రజాపతి పలికెఁ దొల్లి
"దీనికతమున మీరు వృద్ధింబొరయుఁడి
యిష్టకామదుఘంబగు నిదియు మీకు."

11 దేవతలను మన్నింపుఁడీ దీన మీరు
మిమ్ము నా దేవతలును బ్రేమింత్రుగాత
నిచ్చలుఁ బరస్పరంబు మన్నించుకొనుచుఁ
బరమమైన శ్రేయంబును బడయుఁడిట్లు.

---

9 యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః,
తదర్థం కర్మ కౌన్తేయ! ముక్తసఙ్గస్సమాచర.

10 సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్.

11 దేవాన్భావయతాఽనేన తే దేవా భావయన్తు వః,
పరస్పరం భావయన్త శ్శ్రేయః పరమవాప్స్యథ.

12 దేవతలు యజ్ఞకర్మసంభావితులయి
యిష్టములగుభోగంబుల నిత్తు మీకు
వారొసంగినయట్టిదే వారి కిడకె
వండొకండె భుజించుఁ జోరుండువాఁడు.

13 ఎవరు యజ్ఞశిష్టము భుజియించుచుంద్రు
వారు కర్మనిర్ముక్తులై పరఁగుచుందు
రెవరు తమకొఱకయి పచియించుకొంద్రొ
వా రనుభవింత్రు చూ మహాపాపఫలము.

14 అన్నమునను భూతంబు లుదయమునొందుఁ
గలుగునన్నము పర్జన్యువలనఁ బార్థ !
అగును బర్జన్యదేవుండు యజ్ఞమునను
యజ్ఞమున్ గర్మసంభవ మగుచునుండు.

---

12 ఇష్టాన్ భోగాన్ హి వో దేవాః దాస్యన్తే యజ్ఞ భావితాః.
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః.

13 యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుఞ్జతే పాపా యే పచన్త్యాత్మ కారణాత్.

14 అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః.

15 కర్మ బ్రహ్మసంభూతంబుగా నెఱుంగు
మక్షరసముద్భవంబు బ్రహ్మంబుకూడ
నట్లు కాన ప్రతిష్ఠితమయ్యె సతము
సర్వగతము బ్రహ్మమ్ము యజ్ఞంబునందు.

16 ఈక్రియఁ బ్రవర్తితంబైన చక్రము నెవఁ
డనుసరించి వర్తింపఁడో యవనిమీఁద
నెంచిచూడఁ బాపాయుష్కుఁ డింద్రియరతుఁ
డగుచువాఁడు జీవించును వ్యర్థముగను.

17 అనఘ! యెవ్వఁ డాత్మారాముఁడై పరఁగుచుఁ
బొలుపుమీఱంగ నాత్మతృప్తుం డగుచును
ఆత్మయం దాత్మచేఁ బ్రతుష్టాత్ముఁడునయి
యలరువానికి లేదు చేయందగినది.

---

15 కర్మబ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్.

16 ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి.

17 యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే.

18 అతనికిఁ బ్రయోజనము లేదు కృతమువలన
నకృతమున నేని లేదొక్క యర్థ మిందు
సర్వభూతంబులందును సవ్యసాచి !
ఉండ దాతని కొక్క ప్రయోజనంబు.

19 అట్లుకాన ననక్తుఁడ వగుచు సతముఁ
జేయఁదగిన కర్మంబును జేయు మీవు
పార్థ! పురుషుఁ డసక్తుఁడై పరఁగఁ గర్మ
మాచరించుచుఁ బరమంబు నందుచుండు.

20 కర్మచేత నె సంసిద్ధిఁ గనఁగలిగిరి
జనకరాజర్షి ముఖ్యులు జగతియందు
బహువిధంబుల లోకసంగ్రహము నైనఁ
గోరుచున్ గర్మఁ జేయఁదగుదువు నీవు.

---

18 నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన.
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః.

19 తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః.

20 కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసఙ్గ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి.

21 శ్రేష్ఠుఁ డే దేని తా నాచరించుచుండు
నదదియెల్ల నితరజన మాచరించుఁ
బూని యతఁ డెయ్యది ప్రమాణముగ గ్రహించు
ననుసరించు లోకంబు దాని నిటఁ బార్థ!

22 అర్జునా! మూఁడు లోకంబులందుఁ గూడఁ
జేయఁదగినది నాకుఁ గొంచెమును లేదు
పొందఁబడ నదియును లేదు పొందఁదగ్గ
దియును లేదైనఁ గర్మ వర్తింతు నేను.

23 ఏ ననలసుండనై యెప్పుడేని గర్మ
మందు దాన్స వర్తింపకయుందు నేని
అర్జునా! సర్వవిధముల ననుసరింతురు
నాదు మార్గంబు నెల్లమానవులుఁ దవిలి.

---

21 యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

22 న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నాఽనవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి.

23 యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః.

24 ఏను గర్మఁ జేయకయుందు నేని పార్థ!
సకలలోకంబు లపుడె యుత్సన్నములగుఁ
గర్త నగుదును జూవె సంకరమునకును
ప్రజల నెల్లరఁ జెఱచినవాఁడ నగుదు.

25 సక్తులై యవిద్వాంసులు సల్పుచుండ్రు
కవ్వడీ! యెత్తెఱంగునఁ గర్మములను
అట్లె విద్వాంసుఁడు నసక్తుఁడగుచు లోక
సంగ్రహార్థమై కర్మల సల్పవలయు.

26 కర్మసంసక్తులైన యజ్ఞానులకును
బుద్ధిభేదంబుఁ గల్గింపఁబోల దనఘ!
యుక్తుఁడగుచు విద్వాంసుఁ డసక్తిఁ జేసి
చూపు చెల్లకర్మలను బ్రేరేపవలయు.

---

24 ఉత్సీదేయురిమే లోకా నకుర్యాం కర్మ చేదహమ్,
సఙ్కరస్య చ కర్తా స్యా ముపహన్యామిమాః ప్రజాః.

25 సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత!
కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసఙ్గ్రహమ్.

26 న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్,
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్.

27 ఎల్ల తెఱఁగులఁ గర్మంబు లెంచిచూడఁ
ప్రకృతిగుణములచేత సల్పంగఁబడును
అటు నహంకారమూఢాత్ముఁడైనవాఁడు
నేను కర్తనటంచుఁ జింతించుచుండు.

28 క్రమత గుణకర్మసంవిభాగములఁ దత్త్వ
మెఱిఁగినట్టి విజ్ఞాని యూహించిచూడ
గుణములందు వర్తిల్లును గుణములంచు
నెంచి తగులంబుఁగొనక చరించుచుండు.

29 పార్థ! సంసక్తులగుదురు ప్రకృతిగుణ వి
మూఢులై గుణకర్మలఁ మూర్ఖజనులు
కృత్స్నవిదుఁడగుపురుషుఁ డకృత్స్నవిదుల
మందులన్ వారి మందలింపంగరాదు.

---

27 ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే.

28 తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః,
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే.

29 ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు,
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్.

30 కాన నీవు నాధ్యాత్మికమానసమునఁ
గర్మలెల్ల నాయందుఁ ద్యక్తంబుఁజేసి
నిస్పృహామనస్కుఁడవు మఱి నిర్మముఁడవు
నగుచు శోకంబువిడిచి యాహవ మొనర్పు.

31 అర్జునా ! యనువొప్ప నిత్యమ్ము మర్త్యు
లెవరు నామతమిది యనుష్ఠించుచలరు
చుండ్రొ శ్రద్ధాళువులు ననసూయులునగు
వారు కర్మనిర్ముక్తులై పరగుచుంద్రు.

32 ఫల్గునా! యీసడించెడి వారలగుచు
నెవరు నామతమిది యనుష్ఠింపకుండ్రొ
మూఢులును సర్వజ్ఞానమోఘులునగు
వారి నెఱుఁగుము చెడినట్టివారిఁగాఁగ.

---

30 మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః.

31 యే మే మతమిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః,
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః.

32 యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్!
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టా నచేతసః.

33 జ్ఞానియైన నీ ప్రకృతికిన్ దగ్గయట్లు
చేష్టితంబు లవశ్యంబుఁ జేయుచుండు
ననఘ! ప్రకృతిని భూతంబు లనుసరించుఁ
దలఁపఁగా నిగ్రహం బేమి సలుపఁగలదు?

34 ఇంద్రియార్థముౢవిషయమై యింద్రియమ్ము
నకును రాగము ద్వేషమున్ గల్గుచుండు
వానికి వశ్య డగ్గంబుఁగావలవదు సుమి
ఆత్మ కవి మహాశత్రువు లరసిచూడ.

35 శ్రేష్ఠలి స్వనుష్ఠితపరధర్మమ్ముకంటె
నవగుణంబయ్యును స్వధర్మ మదియె మేలు
నెమ్మియి స్వధర్మమున నిధనమ్ము శ్రేయ
మన్యధర్మము మిగుల భయావహంబు.

---

33 సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి?
34 ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ.
35 శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

అర్జునుఁడు :—

36 ఇచ్ఛగింపనివాఁడయ్యు నిందు బల్మి
నియమితుండునుబోలె వార్ష్ణేయ! కృష్ణ!
పూరుషుఁడు దేనిచేత సంప్రేరితుఁడయి
కల్మషపథంబునన్ దిరుగాడుచుండు ?

శ్రీభగవానుఁడు :—

37 సవ్యసాచీ! రజోగుణసంభవమగు
కామ మియ్యది క్రోధంబుగాఁ బరంగు
బహుతరాశనమున్ మహాపాపమునకు
దీనిని న్నీ విట విరోధిగా నెఱుఁగుము.

38 క్రమ్ము ధూమమ్ముచేఁ బావకమ్ము ముఱికి
చేత నద్దమ్ము మఱి మావిచేత గర్భ

---

అర్జున ఉవాచ:—

36 అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ ! బలాదివ నియోజితః.

శ్రీ భగవానువాచ:—

37 కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.

38 ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ,

మెట్టు లావృతమగుచుండు నట్టులే స
మావృతమ్మగుం దాన నియ్యదియుఁ బార్థ !

39 అనలముంబోలె దుష్పూర మగుచుఁ గామ
రూపమై జ్ఞానికి సదా విరోధియైన
దీనిచే నావృతంబు చూ జ్ఞాన మనఘ!
ఇది యెఱుంగుము కౌంతేయ! హృదయమందు.

40 వినుము పార్థ! యింద్రియములు మనసు బుద్ధి
దీనికిన్ జెప్పఁబడు నధిష్ఠానముగను
జ్ఞానమున్గప్పి యిద్ది యివ్వానిచేత
దేహధారి నొక్కమ్మడి మోహపెట్టు.

41 అట్లుకావున పార్థ! నీ వాదియందు
నింద్రియమ్ముల నణఁచి నిస్తులుండవయి

---

యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేదమావృతమ్.

39 ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ.

40 ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్.

41 తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ!

జ్ఞానవిజ్ఞానములను నాశన మొనర్చు
నట్టి యీ పాపకామముం బట్టి గెలువు.
42 ఇంద్రియములు పరంబు లా యింద్రియముల
కంటెఁ బరము మనము దానికంటెఁగూడ
బుద్ధి పరమయియుండు నా బుద్ధికంటె
నాత్మపరమయియుండు నియ్యది తెలియుము.
43 నేర్మిమై నిట్లు బుద్ధికంటెన్ బరముగు
నాత్మనెఱిఁగియు నాత్మచే నాత్మ నణఁచి
ఉసుభుజా! కామరూపము దురవగమము
నైన శత్రువు నిర్జింపుమా బిరాన.

---

పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్.
42 ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః.
43 ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సం స్తభ్యాత్మానమాత్మనా,
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్.

# అధ్యాయము 4.

## జ్ఞాన కర్మసన్యాసయోగము.

శ్రీభగవానుఁడు :—

1 అవ్యయంబగు నీ యోగ మాదిఁ జెప్పఁ
బడియె నాచేతఁ దగ వివస్వంతునకును
మఱి వివస్వంతుఁ డఱిఁగించె మనువునకును
మనువు వచియించె నిక్ష్వాకువునకుఁ బిదప.

2 ఈగతిఁ బరంపరగ లభియించినట్టి
దీని రాజర్షులెల్లరుఁ దెలిసికొనిరి
తద్దయుం బెద్దకాలంబుఁ దరలిపోవ
నాఁడునాటి కీయోగంబు నష్టమయ్యె.

---

చతుర్థోఽధ్యాయః (జ్ఞానకర్మసన్యాసయోగః)

శ్రీభగవానువాచ:—

1 ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్.

2 ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
సకాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప!

3 నాకు నీవు భక్తుండవున్ సఖుఁడ వైతి
కాన నా యీ పురాతనమైన యోగ
మిప్పుడు నయంబున న్నీకుఁ జెప్పియుంటి
నిది రహస్య మత్యుత్తమ మెంచిచూడ.

అర్జునుఁడు :—

4 అచ్యుతా ! యెన్న నీజన్మ మద్యతనము
ప్రాక్తనంబుకదా ? వివస్వంతుజన్మ
మతని కీ యోగ మాది జెప్పితి వనియెడు
దీని నే నెట్టులంగునఁ దెలియఁగలను.

శ్రీభగవానుఁడు :—

5 నాకు నీకును బెక్కుజన్మములు గడిచె
నిందు నర్జున ! లే దింత సందియంబు

---

3 స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్.

అర్జున ఉవాచ:—

4 అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథమేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి.

శ్రీభగవానువాచ:—

5 బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!

వాని నన్నిటి నెఱుఁగుదు నేనుగాని
యెఱుఁగవు పరంతపా! యొకింతేని నీవు.

6 అవ్యయాత్ముఁడ నభవుఁడ నయ్యు మఱియు
సర్వభూతంబులకు నధీశ్వరుఁడ నయ్యు
స్వీయమైన ప్రకృతి నధిష్ఠించి నేన
ఆత్మమాయను సంభవ మగుచునుందు.

7 ఎప్పు డెపుడు ధర్మమునకు ముప్పును గను
నింపఁగ నధర్మమునకును పెంపిదమ్మ
ప్రభవమగుచుందునో యప్డె పాండురాజ
నందన! సృజించుకొందును నన్నె నేను.

8 క్రీడి! విను సాధుజనుల రక్షించుటకును
కేళి మెయి దుష్టజనుల శిక్షించుటకును

---

తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప!

6 అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా.

7 యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.

8 పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్.

విమలమైనధర్మమ్ము స్థాపించుటకును
యుగయుగమ్మున నాకు నే నుద్భవింతు.

9 అర్జునా! యిట్లు నా దివ్యమైనజన్మ
కర్మ నెవఁడు యథార్థమ్ముగా నెఱుంగుఁ
దనువుఁ బాసి పునర్జన్మమును మఱెప్డుఁ
బొందఁబోఁడు సుమీ నన్నుఁ జెందు ధ్రువము.

10 మొనసి రాగభయక్రోధముల జయించి
నన్ను దగ నాశ్రయించి మన్మయులగుచుఁ బు
నీతులై జ్ఞానతపమునన్ బెక్కు రిట్లు
పొలుపుమీఱఁగ మద్భావముం బడసిరి.

11 ఎవ్వ రెట్టులు నన్ను సేవించుచుంద్రొ
యేను వారల నట్లె భజించుచుందు

---

ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

9 జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున!

10 వీతరాగభయక్రోధాః మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః.

11 యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్,

నర్జునా! సర్వవిధముల ననుసరింత్రు
నాదుమార్గంబు నెల్లమానవులుఁ దవిలి.

12 కర్మముల సిద్ధి నిందును గాంక్ష సేయు
వారలగుచు మానవులు దేవతలఁ గొల్తు
కర్మజంబగుసిద్ధి శీఘ్రంబె పార్థ!
కల్గుచుండు మనుష్యలోకంబునందు.

13 ఫల్గునా! గుణకర్మవిభాగమునను
నాల్గువర్ణంబులు సృజించినాఁడ నేను
దానికంతకు గర్త నేనైనఁగాని
నన్నకర్తనుగాఁగ డెందమునఁ దెలియు.

14 "కర్మములు నన్ను నున్ జెనకంగలేవు
కర్మఫలమున నాకుఁ గాంక్షయును లేదు"

---

మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః.

12 కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా.

13 చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః.
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్.

14 న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా,

అని యెవం డెఱింగున నను నెఱుంగు
నతఁడు బంధింపఁబడఁడు కర్మతతిచేత.
15 పూర్వులు నెఱింగి యిట్లు ముముక్షువులయి
సలిపినారలు కర్మ నసక్తులగుచు
నట్లుగాన మున్నుగఁ బూర్వు లాచరించి
నట్టి కర్మనె నీ విప్పు డాచరింపు.
16 "కర్మయెయ్యది? తలఁప నకర్మయెద్ది?"
అని మహాకవులును మోహితాత్ములైరి
అశుభమునుండి ముక్తుఁడ వగుదు దేని
నెఱిఁగి యా కర్మమున్ వచియింతు నీకు.
17 తెలియవలయుఁ గర్మగతిన్ జనుండు
తెలియవలయు వికర్మగతిన్ గడంగి

---

ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే.
15 ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్.
16 కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.
17 కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,

తెలియవలయు నకర్మగతిన్ దిరముగ
గహనమైనది చూ కర్మగతి దలంప.
18 కర్మయందు నకర్మ నకర్మయందుఁ
గర్మ నెవ్వండు తాఁ బొడగాంచుచుండు
మానవులలో నతఁడు బుద్ధిమంతుఁ డతఁడె
యుక్తుఁ డఖిలకర్మములఁ జేయు కృతియగును.
19 ఎవని వగు సమారంభము లెల్లఁ బార్థ !
చెలఁగుఁ గామసంకల్పవర్జితములగుచు
జ్ఞానపావకపరిదగ్ధకర్ముఁడైన
వాని బండితుఁగా బుధుల్ వల్కుచుండ్రు.
20 కర్మ ఫలములయందు సంగంబువిడిచి
సంతతము తృప్తుఁడు న్నిరాశ్రయుఁడు నగుచు

---

అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః.
18 కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్న కర్మకృత్.
19 యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః.
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః.
20 త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః,

మెలపుతోడఁ గర్మంబున మెలఁగుచుండు
వాఁ డొకింతయుఁ జేయనివాఁడె యగును.

21 ఆశలఁ ద్యజించి చిత్తేంద్రియముల నణఁచి
పూన్కి నెల్లపరిగ్రహములను విడిచి
అవలఁ గేవలదైహికమైనకర్మఁ
జేయుచుండియుఁ బాపంబుఁ జెందఁబోఁడు.

22 ద్వంద్వములమించి మత్సరత్వంబు డించి
తుష్టిఁజెందుచుఁ గోరక దొరకుదాన
సముఁడగుచు సిద్ధ్యసిద్ధుల యమివరుండు
కర్మము లొనర్చియున్ దానఁ గట్టువడఁడు.

23 సంగముఁ ద్యజించి ముక్తుఁడై జ్ఞానమందె
స్వాంతము న్నిలకొల్పి యజ్ఞమును శ్రద్ధఁ

---

కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్కరోతి సః.

21 నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్.

22 యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే.

23 గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,

బూని మానక కావించువానిదైన
కర్మయెల్ల సమగ్రముగా నణంగు.

24 బ్రహ్మమే హోత యగ్నియు బ్రహ్మమె యగు
బ్రహ్మమె హవిస్సు నర్పణ బ్రహ్మమునకె
మఱియునున్ బ్రహ్మకర్మసమాధిచేతఁ
బడయఁదగ్గదియున్ గూడ బ్రహ్మమె యగు.

25 పార్థ! యోగులు కొంద ఱుపాసనం బొ
నర్చుచుందురు యజ్ఞమున్ దైవ మనుచు
నపరులగువారు యజ్ఞముల్ యజ్ఞమునని
యనువుమై వేల్చుచుంద్రు బ్రహ్మాగ్నియందు.

26 కొంద ఱట సంయమాగ్నులయందు వేల్చు
చుంద్రు శ్రోత్రాదికములగు నింద్రియములఁ

---

యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే.

24 బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా.

25 దైవమే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి.

26 శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,

బెఱలు శబ్దాదికములగు విషయములను
వెరవునై యింద్రియాగ్నులన్ వేల్చుచుంద్రు.
27 నేర్మిదనర సర్వేంద్రియకర్మములను
బ్రాణకర్మంబులన్ జ్ఞాన భాసితమగు
నాత్మసంయమయోగాగ్నియందు నిందు
హోమ మొనరించుచుందు రన్యులగు మునులు.
28 సవ్యసాచి! యాలించితే? ద్రవ్యయజ్ఞు
లై తపోయజ్ఞులై యోగయజ్ఞులనయి
పూని స్వాధ్యాయయజ్ఞులన్ జ్ఞానయజ్ఞు
లునయి యుంద్రు శితవ్రతుల్ మును లపరులు.
29 యతు లితరులు ప్రాణాపానగతుల నణచి
ప్రాధిమీఱఁ బ్రాణాయామపరులగుచును

---

శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి.
27 సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణిచాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే.
28 ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే,
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః.
29 అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే.

ప్రాణమును వేల్చుచుండు రపానమం ద
పానమున్ బ్రాణమం ద ట్లపరులు వేల్తు.

30 అన్యయోగులు వినియతాహారులగుచుఁ
బ్రాణములయందు వేల్తురు ప్రాణములను
వీర లెల్లరిటన్ యజ్ఞవేత్తలు సుమి
యజ్ఞములఁ గల్మషంబుఁ బోనాడుకొంద్రు.

31 యజ్ఞశిష్టామృతం బిందు నారగించు
వారు గొంతురు సనాతనబ్రహ్మపదము
కురువరేణ్య! యయజ్ఞునకుం దలంపఁ
గలుగ దీ లోకమే నిఁ కెక్కడి దితరము?

32 బహువిధములగు యజ్ఞముల్ బ్రహ్మముఖము
నందు వితతంబులై చెలువారుచుండుఁ

---

ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః.

30 అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి.
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః.

31 యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ!

32 ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే.

గర్మసంజనితంబులుగాఁగ వాని
నెల్లఁ దెలియు ముక్తుఁడ వౌదు వి క్లైటింగి.

33 వైరిసూదన ! వినుము ద్రవ్యమయమైన
యజ్ఞమునకంటె మేల్ జ్ఞానయజ్ఞ మరయ
సర్వమగుకర్మ యఖిలంబు జ్ఞానమందె
పరిసమాప్తిని జెందెడుం బార్థ ! వింటె ?

34 పార్థ ! ప్రణిపాతమునఁ బరిప్రశ్నమునను
సేవఁజేసి యీ జ్ఞానమున్ నీ వెఱుఁగుము
తత్త్వమెుంగన్న జ్ఞానిసత్తములు నీకుఁ
జెలఁగి యీ జ్ఞానము నుపదేశింపఁగలరు.

35 ధీవరేణ్య ! యీ జ్ఞానముఁ దెలిసి నీవు
మోహ మీరీతిఁ గ్రమ్మఱఁ బొందఁ బోవు

---

కర్మజాన్విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే.

33 శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప!
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే.

34 తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.

35 యద్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాణ్డవ !

ఆత్మయందును పిదప నాయందు నఖిల
భూతములఁ గందు వా జ్ఞానమున ధ్రువంబు.

36 పార్థ! వింటివె? సర్వపాపములకంటె
నధికపాపకరుండవైనఁగాని
నిఖిలవృజినార్ణవంబును నిస్తరింపఁ
గలవు జ్ఞానప్లవంబున సులభగతిని.

37 ఎట్లు పార్థ! సమిద్ధాగ్ని యింధనౌఘ
ములను ముట్టి భస్మీకృతముగ నొనర్చు
జ్ఞానవహ్నియు నట్టులె సర్వకర్మ
జాలము నొనర్చెడున్ భస్మసాత్కృతముగ.

38 అరయ జ్ఞానంబుతోడఁ దుల్యంబుఁగాఁ బ
విత్రమైనవి యిందుఁ గన్పింప దెందు

---

యేన భూతా న్యశేషేణ ద్రక్ష్యస్యాత్మ న్యథో మయి.

36 అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి.

37 యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున!
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా.

38 నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,

యోగసంసిద్ధుఁడగుచుఁ గాలోచితముగ
నాత్మరతిఁబొందుజ్ఞాని తనంతఁదాన.

39 శ్రద్ధకలవాఁడు వడయును జ్ఞానము నిటుఁ
దత్పరుఁడు యతేంద్రియుఁడునై తాఁ జెలంగి
జ్ఞానముంబొంది యత్యంత శాంతి సుఖము
నచిరకాలంబునన్ బడయంగలండు.

40 సంశయాత్ముఁడు జాఁఋన్ఁ డశ్రద్ధ ధానుఁ
డైనవాఁ డవశ్యము నాశమందఁగఁలఁడు
ఏ౹ ? యుఁర సంశయాత్మున కిహము లేదు
పరమునున్ లేదు సౌఖ్యలవంబు లేదు.

41 యోగమునఁ జేసి కర్మల నుజ్జగించి
జ్ఞానమున సంశయంబును జక్కడంచి

---

తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి.

39 శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి.

40 అజ్ఞ శ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః.

41 యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసఞ్ఛిన్న సంశయమ్,

ఆత్మవంతుఁడై పరఁగెడునట్టివాని
గర్మతతులు ధనంజయా! కట్టలేవు.
42 కాన నజ్ఞానభవము హృద్గతమునైన
సంశయమ్ము నాత్మజ్ఞానసంజ్ఞికమగు
కటికఁగత్తి సి భిన్నముఁగా నొనర్చి
భవ్యయోగముఁగొను మిమ్ము భరతముఖ్య!

## అధ్యాయము 5.

### కర్మసన్యాసయోగము.

అర్జునుఁడు :-

1 అచ్యుతా! నీవు కర్మసన్యాసము మఱి
యోగమున్ గూడ వాక్రుచ్చుచుంటి విట్లు
శ్రేయమెయ్యదియగునో యీ రెంటిలో సు
నిశ్చితంబగు నొక్కదానినె వచింపు.

---

ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనఞ్జయ!
42 తస్మా దజ్ఞానసమ్భూతం హృత్‌స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!

పఞ్చమోఽధ్యాయః (కర్మసన్యాసయోగః)

అర్జున ఉవాచ:-

1 సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి.
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్.

శ్రీభగవానుఁడు :—

2 కర్మసన్న్యాసమును మఱి కర్మయోగ
మర్జునా ! రెండుఁగూడ శ్రేయస్కరములె
కర్మముల సన్న్యసించుటకంటె నొప్పుఁ
గడు విశిష్టతఁ గర్మయోగంబు దలఁప.

3 ఎవఁడు ద్వేషింపకుండుఁ గాంక్షింపకుండు
నిత్యసన్న్యాసిఁగా వానిసిన్ దెలియుము
అలఘువీర్య ! ద్వంద్వాతీతుఁడైనవాఁడు
బంధములనుండి ముక్తిని బడయుఁ జుమ్ము.

4 సాంఖ్యయోగములను బృథక్సరణి జడులు
చెప్పుచుందురు పండితుల్ సెప్ప రట్టు
లొక్కదాని నెన్నఁగఁగూడియుండియు నరుఁ
డుభయఫలములు మానక యొందుచుండు.

---

శ్రీభగవానువాచ:—

2 సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే.
3 జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి,
నిర్ద్వన్ద్వో హి మహాబాహో! సుఖం బన్ధాత్ప్రముచ్యతే.
4 సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః,
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్.

5 అమర సాంఖ్యులు వడయు స్థానమును దారుఁ
బడయుదురు యోగయుతులైన వారు పార్థ!
ఒకటిగా నిట్లు సాంఖ్యంబు యోగమును నె
వండు కనుచుండునో కను వాఁడు వాఁడె.

6 అనఘ! యోగము లేక సన్న్యాసముఁ దగఁ
బడయఁ గష్టతరం బౌను పార్థ! వింటె?
ఆరయన్ యోగసంయుక్తుఁడైనమౌని
అచిరకాలమునందు బ్రహ్మమును బొందు.

7 అతివిశుద్ధాత్ముఁడున్ యోగగతియుతుండు
నిర్జితమనస్కుఁడున్ జితేంద్రియుఁడు నగుచు
నఖిల భూతాత్మభూతాత్ముఁడైనమౌని
కర్మఁ జేయుచున్ లిప్తుండు కాకయుండు.

---

5 యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాఙ్ఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి.
6 సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తుమయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి.
7 యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే.

8 ఇంచుకేనిఁ గర్మను జేయ నే నటంచుఁ
దత్త్వవిదుఁడు యుక్తుండయి తలఁచుచుండుఁ
గనుచు వినుచుఁ దాకుచు మూరుకొనుచుఁ దినుచుఁ
జనుచు నూర్చుచుఁ గూరుకుఁ గొనుచు మఱియు.

9 వాకొనుచు విసర్జించుచుఁ గైకొనుచును
దెఱచుచున్ గనుమూయు చింద్రియము లెల్ల
నింద్రియార్థంబులందు వర్తిల్లు ననుచు
ధారణముఁ జేయుచుండు యథాతథముగ.

10 బ్రహ్మమందు నెక్కొల్పి కర్మంబు లెల్ల
సంగముఁ ద్యజించి యెవ్వండు సల్పుచుండు
వాఁడు లిప్తుండు కాఁడు పాపములచేత
నంబువులచేతఁ బద్మపత్రంబువోలె.

---

8 నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్.

9 ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్.

10 బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా.

11 వాఙ్మనఃకాయగతుల( గేవలము నైన
యింద్రియమ్ములచేత యోగిజనము లిందు
సంగము( ద్యజించి కర్మముల్ సల్పుచుందు
రాత్మసంశుద్ధికొఱకునై యనఘచరిత!

12 యోగరతుండు కర్మఫలము నుజ్జగించి
నిష్ఠతో( జిరమైన శాంతిం బడయును
ఫలసమాసక్తుండై కామపరత( దాను
బద్ధుండగు నయుక్తుండు ధ్రువమ్ము నమ్ము.

13 సర్వకర్మముల్ మనమున సన్యసించి
తా సుఖం బుండు దేహి స్వతంత్రుడగుచు(
దెలిసి తొమ్మిదిద్వారముల్ గలపురమున
నించుకేని జేయకయుం జేయింపకయును.

---

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియైరపి,
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వా౽౽త్మశుద్ధయే.
యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే.
సర్వకర్మాణి మనసా సన్న్యస్యా౽౽స్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్.

14 కర్తృతయుఁ గర్మములును లోకంబునకును
లేశమేనియుఁ బ్రభువు కల్పింపఁబోఁడు
కర్మఫలయోగమేనియుఁ గల్గఁజేయఁ
డెన్నఁగా స్వభావమె ప్రవర్తిల్లుచుండు.

15 పార్థ! యేయొక్కనికిని బాపమునుగాని
సుకృతమునుగాని కూర్పండు చూ విభుండు
జ్ఞాన మజ్ఞానగతిచేత సంవృతమగు
మిపుడు మోహంబుఁజెందు జంతువులు దాన.

16 అనఘచరిత! యాత్మజ్ఞానమునను జేసి
యెవరి యజ్ఞాన మది హరియింపఁబడునో
దీప్తమై వారిజ్ఞాన మాదిత్యుపగిది
నెలమి నా పరముం బ్రకాశింపఁజేయు.

---

14 న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.

15 నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః.

16 జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.

17 చెలఁగి తద్బుద్ధులున్ దదాత్ములును దత్ప
రాయణులును దన్నిష్ఠులునై పరగుచు
జ్ఞాన నిర్ధూత కల్మషులై నయతులు
వేడ్కఁబొందుదు రపునరావృత్తిపదము.

18 అలఘువిద్యావినయభూతికలితుఁడైన
ద్విజునియందు మొదవునందు గజమునందు
శ్వానమునయందు నట్టి శ్వపాకునందుఁ
బండితుల్ సమదర్శులై పరగుచుంద్రు.

19 సామ్యమందు నెవ్వరిమానసంబు పరఁగు
నిందు వారిచే సృష్టిజయింపఁబడియె
బ్రహ్మము సమంబు మఱి దోషవర్జితముగుఁ
గాన వారు బ్రహ్మమునందుఁ గలిసియుంద్రు.

---

17 తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః.

18 విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పణ్డితా స్సమదర్శినః.

19 ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః.

20 ప్రియమునుంబొంది హృదిని హర్షింపరాదు
అప్రియంబున నుద్వేగమందరాదు
స్థిరమతియు నసమ్మూఢుఁడై పరగునట్టి
బ్రహ్మవిదుఁడు సనాతన బ్రహ్మముఁగను.

21 సులభగతిని బాహ్యస్పర్శముల నసక్త
చిత్తుఁడగుపూరుషుం డాత్మసిద్ధిఁబడయు
బ్రహ్మయోగయుక్తాత్ముఁడై వాఁడు క్రమత
నక్షయంబైన సౌఖ్యంబు నందఁగలఁడు.

22 పార్థ! వింటె? యేభోగముల్ స్పర్శజములొ
యెన్న నవి యెల్లనున్ దుఃఖహేతువులగుఁ
బూని యాద్యంతవంతములైనవాని
యందు బుధుఁడు రమింపండు పొందుఁగల్గి.

---

20 న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నో ద్విజేత్ప్రాప్య చాప్రియం,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః.

21 బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే.

22 యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ! న తేషు రమతే బుధః.

23 అను వెఱింగి దేహత్యాగమునకుమున్న
మొనసి యుండె కామక్రోధజనితమైన
జవము నెవ్వఁడు సైరింపఁజాలియుండు
నతఁడె యుక్తుండు సుఖియు నౌ నా నరుండె.

24 లోసుఖంబును లోరతి లో వెలుంగుఁ
గలిగి యెవ్వాఁడు నిచ్చ ప ర్తిలుచునుండు
బ్రహ్మభూతుఁడై బ్రహ్మనిర్వాణపదము
నమ్మహాయోగి తాఁ బడయంగలండు.

25 పాపము లడంగ ద్వైధభావంబు లుడుగ
సకలభూతహితోత్సుకుల్ సంయతాత్మ
లగుచు ఋషిసత్తముల్ నిశ్చయంబుగాఁగ
బ్రహ్మనిర్వాణరూపలాభంబుఁగంద్రు.

---

23 శక్నోతీహైవ య స్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః.

24 యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతి రేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి.

25 లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితేరతాః.

26 పాండుతనయ! కామక్రోధవర్జితులును
యతమనస్కులు సంవిదితాత్ములునగు
యతివరేణ్యులకున్ నిశ్చయంబుగాఁగ
నంతటఁ బ్రహ్మనిర్వాణమగుచునుండు.

27 బాహ్యసంస్పర్శముల బహిర్భాగముననె
యాఁచి భ్రూమధ్యభాగంబునందుఁజూడ్కి
నలిపి నాసికాభ్యంతరచారులైన
ప్రాణము నపానముఁ సమపఱ్కి నునిచి.

28 వినియతేంద్రియచిత్తధీవిభ్రముండు
వ్యపగతేచ్ఛాభయక్రోధుఁ డాత్మరతుఁడు
మౌని మోక్షపరాయణుఁ డౌ నెవండు
వాఁ డజస్రము ముక్తుఁడౌ భరతముఖ్య!

---

26 కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్.

27 స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ.

28 యతేన్ద్రియ మనోబుద్ధి ర్మని ర్మోక్షపరాయణః,
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః.

29 యజ్ఞతపములకున్ భోక్తయైనవాని
నఖిలలోకమహేశ్వరుండైనవాని
నిఖిలభూతసుహృత్తయి నెగడువాని
నన్ను నెఱిఁగి శాంతింబొందు నరుఁడు పార్థ!

---

## అధ్యాయము 6.

### ఆత్మసంయమయోగము.

శ్రీభగవానుఁడు :—

1 కర్మఫలముఁ గొంచెముఁ గోరకయె యెవండు
చేయఁదగినకర్మంబును జేయుచుండు
నతఁడె సన్యాసి యోగియు నాతఁడే ని
రగ్నిగాఁ డాతఁడు మఱి గాఁ డక్రియుండు.

---

29 భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్.
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి.

---

షష్ఠోఽధ్యాయః. (ఆత్మసంయమయోగః)

శ్రీభగవానువాచ :—

1 అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాఽక్రియః.

## 6. ఆత్మసంయమయోగము

2 దేనిసన్న్యాసమనియంద్రు దానినే తె
లియుము యోగంబుగా నాకలించి పార్థ!
ఎల్లసంకల్పముల సన్న్యసింపకుండ
యోగికానేరఁ డెవఁడేనియు న్నిజంబు.

3 అనఘ! యోగారురుక్షువైనట్టి మునికిఁ
గర్మకారణముగఁ బలుకంగఁబడును
అరసిచూడ యోగారూఢుఁడైనవాని
కే శమము కారణముగ వచింపఁబడును.

4 తా నెపుడు పూని యింద్రియార్థంబులందుఁ
గర్మములయందు సక్తుండు కాకయుండు
నపుడె సర్వసంకల్పసన్న్యాసియగుచు
నెంచఁబడును యోగారూఢుఁడంచుఁ బార్థ!

---

2 యం సన్న్యాసమితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ!
న హ్యసన్న్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన.
3 ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే.
4 యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
సర్వసఙ్కల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే.

5 ఆత్మనుద్ధరింపంబగు నాత్మచేత
నాత్మనాశము నెపుడుఁ జేయఁగరాదు
ఆత్మకున్ బంధు వెన్నంగ నాత్మయెయగు
నాత్మకున్ వైరియున్ గూడ నాత్మయెయగు.

6 ఎవ్వఁ డాత్మచే నాత్మన్ జయించి వైచు
నతనియాత్మకుఁ దగుబంధు వాత్మయె సుమి
ఆత్మయె యనాత్ముఁడగువాని కరియుఁబోలె
వర్తిలుచునుండు శత్రుభావంబునందు.

7 క్రమత శీతోష్ణసౌఖ్య దుఃఖములయందు
నట్లె మానావమానంబులందుఁ గూడ
సముఁడు నిర్జితాత్ముండుఁ బ్రశాంతుఁడునగు
నతనిలోఁ బరమాత్మసమాహితుఁడగు.

---

5 ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః.

6 బన్ధురాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్.

7 జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః.

## 6. ఆత్మసంయమయోగము

8 జ్ఞానవిజ్ఞానతృప్తాత్ముఁడై నవాఁడు
నిత్యకూటస్థుఁడున్ జితేంద్రియుఁడు సద్గు
ణాంచితుఁడు సమలోష్టాశ్మకాంచనుండు
యుక్తుఁ డని వచింపంబడుచుండుఁ బార్థ !

9 సుహృదులందు మిత్రులయందు నహితజనుల
యం దుదాసీనులందు మధ్యస్థులందు
నల్లె ద్వేష్యులందున్ బంధులందు సాధు
లందుఁ బాపులందు సముండు పొందు ఘనత.

10 నియతచిత్తాత్ముఁ డేకాకి నిర్గతస్పృ
హుండు శాంతుఁడు నపరిగ్రహుండునగుచు
సంతతంబు రహఃప్రదేశస్థితుఁడయి
యోగి యాత్మను గూర్పనౌ యోగమందు.

---

8 జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః.

9 సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబన్ధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే.

10 యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః.

11 అతివిశుద్ధప్రదేశంబునందు మిగుల
నేర్మి నాత్యున్నతము నాతినీచమును స్థి
రంబుఁ జేలాజినకుశోత్తరంబునైన
ఆసనంబును దనకునై యమరిచికొని.

12 అందు డెంద మేకాగ్రతన్ బొందుపఱచి
యవల వినియతచిత్తేంద్రియక్రియుఁడయి
ఆసనమునందు నుపవిష్టుఁ డగుచు యోగ
మాత్మసంసిద్ధికై పూననౌఁ గడంక.

13 అచలము సమంబుఁగాఁగఁ గాయంబు శిరము
గ్రీవయున్ దాల్చుచుఁ స్థిరభావుఁడగుచు
స్వీయనాసికాగ్రమును వీక్షించుచుండి
యోర్మినైై దిక్కులన్ జూడకుండఁగ నగు.

---

11 శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్.

12 తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుఞ్జ్యా ద్యోగమాత్మవిశుద్ధయే.

13 సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్.

14 బ్రహ్మచారివ్రతంబునఁ బరగుచుండి
వ్యపగతభయుండుఁ గడుఁ బ్రశాంతాత్ముఁడునయి
మనసునణఁచి మచ్చిత్తుండు మత్పరుఁడును
నగుచు యోగయుక్తుండు కానగును పార్థ !

15 నియతమానసుఁడై యోగి నిరత మిట్లు
పూని యాత్మను యుక్తంబుఁగానొనర్చి
మత్పరంబును నిర్వాణమహితము నగు
శాంతిసౌఖ్యంబుఁబడయంగఁ జాలు ననఘ !

16 అమితభోజికి నిట యోగ మనువుఁబడదు
నియతి భుజియింపనట్టివానికిని లేదు
అతితరంబుగ నిద్రాళువైనవాని
కేని మేల్కొనువానికినేని లేదు.

---

14 ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః.

15 యుంజన్నేవం సదాఽత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి.

16 నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః,
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున !

17 అరయ సముచితాహారవిహారునకును
కర్మలం దగుచేష్టలు కల్గువాని
కుచితనిద్రావబోధ సంయుక్తునకును
దుఃఖహరమగు యోగంబు దొరకు సుమ్ము.

18 వినియతంబగుచున్ లెస్స మన మ దెప్పు
డాత్మయందే వ్యవస్థితమగుచునుండు
నిఖిలకామంబులందును నిస్స్పృహుఁడయి
యప్పుడే యోగసంయుక్తుఁ డనఁగఁబడును.

19 అచలమగుచు నివాతస్థమైనదీప
మలరు నేరీతి నదియె యుదాహరణము
యతమనస్కుఁడు యోగంబునందు నాత్మఁ
గూర్చువాఁడునౌ యోగికిన్ గురువరేణ్య !.

---

**17** యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా.

**18** యదా వినియతం చిత్త మాత్మన్యేవాఽవతిష్ఠతే,
నిఃస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా.

**19** యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః.

# 6. ఆత్మసంయమయోగము

20 క్రమముతోడుతఁ బార్థ ! డెంద మది యెందు
యోగసేవానిరుద్ధమై యుపరమించు
నాత్మచేతన తగనాత్మ నాత్మయందుఁ
జూచుచున్ సంతతంబు తుష్టుఁడగు నెందు.

21 బుద్ధి గ్రాహ్య మతీంద్రియంబునుదలంచి
చూడ నాత్యంతికంబునౌ సుఖము నెందు
నెఱుఁగుఁ దత్త్వంబునందుండి యెందు లెస్స
నున్నవాఁడయి చలియింపకుండుఁ బార్థ !.

22 దేనిబొంది తతోధికమైనయట్టి
దానిగా నన్యలాభంబుఁ దలఁపకుండు
దేనియందున్నవాఁడయి తా నపార
దుఃఖముననైన సంచాలితుండు కాఁడో.

---

20 యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి.

21 సుఖ మాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్,
వేత్తి యత్ర న చైవాఽయం స్థిత శ్చలతి తత్త్వతః.

22 యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే.

23 ఓజ దుఃఖసంయోగవియోగమైన
దానినిన్ నీవు యోగంబుఁగా నెఱుఁగుము
తా ననిర్విణ్ణచేతస్కుఁడై నగుండు
నిశ్చయమున నా యోగము న్నెఱపవలయు.

24 తెలిసి సంకల్పసంభవంబులగు నెల్ల
కామములను నిశ్శేషముఁగాఁ ద్యజించి
పూని యింద్రియగ్రామముఁ మానసంబు
చేతనే నియమించి నిశ్చింతుఁడగుచు.

25 ధృతిని గ్రహియింపఁబడ్డ బుద్ధి మెలమెల్లఁ
జిత్తము నుపరతంబుగాఁ జేయవలయు
మానసము నట్టు లాత్మసంస్థముగఁ జేసి
యొక్క యింతయుఁ జింతింపకుండఁగనగు,

---

23 తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా.

24 సఙ్కల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః,
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమంతతః.

25 శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చింతయేత్.

26 అస్థిరం బతిచంచలమైన చిత్త
ముడుగ కెందెందు సారెకు వెడలుచుండు
దీని నందందునుండి శక్తి నియమించి
యాత్మయందె వశంబుఁ జేయంగవలయు.

27 పార్థ! శాంతరజస్కుఁడున్ బ్రహ్మభూతుఁ
డును గడుం బ్రశాంతమనస్కుఁడు ననఘుండు
నైన యీ యోగి నుత్తమ మనుపమంబు
నైన సుఖముఁ జేరుకొనుఁ దనంతఁదాను.

28 తాల్మినై సంతత మపాస్తకల్మషుఁడయి
యాత్మ నీరీతి యోగమునందుఁగూర్చి
యతి సులభగతిఁ దాను బ్రహ్మాత్మకమగు
నక్షయసుఖంబునుం బడయంగలండు.

---

26 యతో యతో నిస్సరతి మనశ్చఞ్చల మస్థిరమ్,
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్.

27 ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్.

28 యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే.

29 అఖిలభూతములం దాత్మ నఖిలభూత
ములను దగ నాత్మయందు నెవ్వ గనుచుండు
నర్జునా! యోగసంయోజితాత్ముఁడు యతి
తా సమగ్రముగన్ సమదర్శనుఁడయి.

30 ఎవఁడు నన్నెల్లచోఁ గమకించిచూచు
చుండు నాయందు నెల్లనుజూచుచుండు
నేను వాని కెప్పుడు నశియింపఁబోను
వాఁడును ధనంజయా! నశింపఁడు నాకు.

31 అఖిలభూతగణస్థుఁడనైన నన్ను
నేకతన్ గొన్నవాఁడయి యెవఁడుగొల్చు
నన్నిగతుల మెలంగువాఁడయ్యు యోగి!
వాఁడు నాయందు వర్తిలువాఁడె యగును.

---

29 సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.
30 యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.
31 సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే.

32 వినుము పార్థ! యాత్మౌపమ్యమును గ్రహించి
యెల్లయెడల సమంబుగా నే నరుండు
సుఖముఁగాని దుఃఖముఁగాని చూచుచుండుఁ
బరమయోగిగాఁ దలఁపంగఁ బడును వాఁడు.

అర్జునుఁడు :—

33 క్రమత నే యోగ మిది నీవు సమతఁజేసి
నాకు నిప్పుడు మధుసూదనా! నుడివితో
కడుఁగడుం జంచలంబౌటఁ గానకుంటి
దీనికిన్ స్థిరమైనస్థితిన్ మహాత్మ!

34 అకట! చంచలమున్ బలీయంబు దృఢము
కరము గారించునదియును గాదె? మనము
అచ్యుతా! తన్మనోనిగ్రహమ్ము మారు
తమ్మునకుఁబోలె నతిదుష్కరమ్ము సుమ్ము.

---

32 ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః.

అర్జున ఉవాచ :—

33 యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన!
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్.

34 చఞ్చలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.

శ్రీభగవానుఁడు :—

35 నిగ్రహింపంగ నలవికానిదియు మిగులఁ
జంచలము నగున్ మనము సంశయము లేదు
క్రమయుతాభ్యాసమునను వైరాగ్యమునను
నేర్మి గ్రహియింపఁబడును కుంతీతనూజ !

36 సంయతాత్ముఁడుకాని వాచంయమికిని
యోగము దురాపమనుచు నా యోచన సుమి
యత్నమొనరించు వశ్యాత్ముఁడైనవాని
కలవియగుఁ బొంద యోగ ముపాయమునను.

అర్జునుఁడు :—

37 వృష్ణివర్య ! శ్రద్ధాపర్యుపేతుఁడయ్యు
నయతి తా యోగవిభ్రంశితాత్ముఁడగుచు

---

శ్రీభగవానువాచ :—

35 అసంశయం మహాబాహో ! మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ ! వైరాగ్యేణ చ గృహ్యతే.

36 అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః.

అర్జున ఉవాచ :—

37 అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,

యోగసంసిద్ధిఁ బడయక యేగతిని న
నంతరము నొందునో యది నాకుఁ జెపుము.
38 అప్రతిష్ఠుఁడు మఱియు బ్రహ్మపథమందు
మూఢుఁడునయి ఛిన్నాభ్రముంబోలె నాతఁ
డుభయవిభ్రష్టుఁడగుచు నో యురుభుజా ! న
శింపఁడుకదయ్యా ! యది వచియింపు నాకు.
39 అనఘ ! కృష్ణ ! నా యీ సంశయము న శేష
ముగ నివారింప నర్హుఁడవగుదు వీవు
తెలిసి యీ సంశయమును ఛేదించువాఁడు
కలుగఁబోఁ డెందు నేని నీకంటె నొరుఁడు
శ్రీభగవానుఁడు :—
40 ఫల్గునా ! విను యోగవిభ్రష్టునకును
జెందదు వినాశనం బెందు నందు నేని

---

అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ ! గచ్ఛతి ?
38 కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి.
39 ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః,
త్వదన్య స్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే.
శ్రీభగవానువాచ:—
40 పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,

నేర్మిఁ బరికింపఁ గల్యాణకర్మకారుఁ
డొక్కరుండేని దుర్గతి నొందఁబోఁడు.

41 పుణ్యకర్ములు నివసించు భువనములను
బొంది శాశ్వతహాయనంబులు వసించి
యంత శ్రీమంతులున్ శుద్ధిమంతులునగు
వారియింటఁ బుట్టున్ యోగవర్జితుండు.

42 అట్లుకాదేని ధీమంతులైనయట్టి
యోగులకులంబునందె తా నుదితుఁడగును
ఈ దృశంబగుజన్మ మి దెంచిచూడఁ
గవ్వడీ! దుర్లభంబు లోకంబునందు.

43 దేహి యా జన్మమునఁ బౌర్వదైహికమగు
బుద్ధిసంయోగమును దాని బొందుచుండుఁ

---

న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి.

41 ప్రాప్య పుణ్యకృతాన్ లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః.
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.

42 అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్.

43 తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,

బిదపఁ గ్రిమ్మఱు సంసిద్ధివిషయ మతఁడు
జతనము సొనర్చుచుండు నిస్సంశయముగ.

44 ఫల్గున ! యతండు తొంటియభ్యాసముననె
యవశత హరింపఁబడు సంశయంబులేదు
యోగము నెఱుంగఁదలఁచిన యోగి మెలఁగు
నను వెఱింగి శబ్దబ్రహ్మ మధిగమించి.

45 తీవ్రయత్నమునన్ బ్రయత్నించుచుండి
యతి సుపరిశుద్ధకల్మషుఁడగుచుఁ బెక్కు
పుట్టువులయందు సంసిద్ధిఁబొంది పిదపఁ
బడయుఁ బార్థ ! యలభ్యమౌ పరమగతిని.

46 తాపసులకంటె నధికుఁ డెంతయును యోగి
జ్ఞానవంతులకంటెను ఘనుఁడు యోగి

---

యతతేచ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన !

44 పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే.

45 ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్.

46 తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,

మేటికర్ములకన్నను మిన్న యోగి
కావునన్ నీవు యోగివికమ్ము పార్థ !
47 ఎల్ల యోగులలోఁగూడ నేనెవండు
మద్గతంబగు నంతరాత్మను గడంక
మించ శ్రద్ధాళువై భజియించు నన్ను
నే నతని యుక్తతమునిగా నెంచుచుందు.

## అధ్యాయము 7.

### జ్ఞానవిజ్ఞానయోగము.

శ్రీభగవానుఁడు :—

1 పార్థ! నాయందు డెందంబుఁ బాదుకొల్పి
యోగయుక్తుండవు మదాశ్రయుండవగుచు
నవల నిస్సంశయముగ సమగ్రుఁడనగు
నను నెటులెఱుంగుదో దాని విను తెలిపెద.

---

కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున !
47 యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.

సప్తమోఽధ్యాయః. (జ్ఞానవిజ్ఞానయోగః)

శ్రీభగవానువాచ:—

1 మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుఞ్జన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు.

2 నే నశేషంబుగా సవిజ్ఞానమైన
జ్ఞానమును దీని వచియింతుఁ బూని నీకు
నలఘువిక్రమ ! యిద్దాని దెలిసితేని
దెలియఁగాఁదగ్గ దన్య మెద్దియుఁగలుగదు.

3 వేనవేలుమనుష్యులలో నొకండు
సిద్ధికొఱకునై యత్నంబుఁ జేయుచుండు
యత్న మొనరించుసిద్ధులయం దెవండొ
యొక్కరుఁడు నన్ను దాఁ దెలియు న్నిజముగ.

4 వసుధయున్ జల మనలంబు వాయువున్ గ
గనము మనము బుద్ధియు నహంకారము నని
నాప్రకృతియివి పార్థ ! భిన్నయయియుండు
నెనిమిది తెఱంగులను బరికించిచూడ.

---

2 జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్యమవశిష్యతే.

3 మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః.

4 భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ,
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.

5 అపర యనఁబడు నిది యిత్తో న్యయగునాదు
ప్రకృతినిన్ జీవభూతను పరనుగాఁగఁ
దెలియుమా ఫల్గునా ! నీవు దీనిచేత
నీ జగ మ్మఖిలమ్ము ధరింపఁబడెడు.

6 నిశ్చయంబుగ నెఱుఁగుము నీవు సర్వ
భూతములకు నివ్వియె హేతుభూతములని
ఎల్ల జగమునకు న్నేన యెంచిచూడఁ
బ్రభవ మగుదు నా తెఱఁగునన్ బ్రళయమగుదు.

7 అర్జునా ! విను నా కంటె నన్యమైన
కారణం బించుకేనియుఁ గలుగ దెందు
భువన మిది యెల్ల నాయందుఁ బ్రోతమయ్యె
సూత్రమునయందు నల మణి స్తోమమువలె.

---

5 అపరేయమిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం,
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్.

6 ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా.

7 మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ!
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.

8 అంబువులయందు నేను రసంబ నగుదు
సూర్యచంద్రులయందున జ్యోతి నగుదు
సర్వవేదాలఁ బ్రణవమన్ శబ్దమను న
భంబునం దేను నరులలోఁ బౌరుషమను.

9 పుణ్యమగుగంధమును నేను పుడమియందు
జ్వలనమందున నైతిఁ దేజంబు నే న
శేషభూతంబులందు నే జీవనమును
ఫల్గున! తపస్వులందుఁ దపంబు నేను.

10 భూతసంఘాతమునకు సనాతనమగు
బీజమునుగాఁగఁ దెలియుమీ విజయ! నన్ను
బుద్ధిమంతులయందలి బుద్ధినేను
విమలతేజస్వులందుఁ దేజమును నేను.

---

8 రసోఽహమప్సు కౌన్తేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః,
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.

9 పుణ్యో గన్ధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు.

10 బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనం
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్.

11 ఫల్గునా ! కామరాగ వివర్జితమగు
బలమునై తిని జూ బలవంతులందు
నఖిలభూతంబులందు ధర్మావిరుద్ధ
మైన కామంబ నర్జునా ! నేన యైతి.

12 క్రిమత సాత్వికములు రాజసములుఁ దామ
సములు ననెడుభావములు మజ్జనితములుగ
నెఱుఁగుమా పార్థ ! వానియం దేను లేను
అవియు నాయందు లేవు వాస్తవ మెఱుంగ.

13 అణఁగి సర్వజగమ్మును గుణమయంబు
లైన యీ భావములచేత ననవరతముఁ
దాను సమ్మోహితంబయి వీనికంటెఁ
బరునిగా నన్ను నాద్యు నవ్యయు నెఱుఁగదు.

---

11 బలం బలవతాం చాహం కామరాగవివర్జితం,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ !

12 యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి.

13 త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదం జగత్,
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్.

14 దేవసంబంధినియు మఱి త్రిగుణమయియు
నైన నామాయ యిద్ది దురత్యయమ్ము
ఎవరు నన్ను సదా భజియించుచుంద్రొ
వారె యీ మాయను దరించువా రగుదురు.

15 మాయఁ జేసి జ్ఞానం బెల్ల మట్టువడఁగ
నాసురంబగుభావంబు నాశ్రయించి
దుష్కృతపరుల్ విమూఢబుద్ధులునయి నను
గొలువకుంద్రు నరాధముల్ తెలియు మిట్లు.

16 ఆర్తుఁడు మఱి జిజ్ఞాసు వర్థార్థి జ్ఞాని
యనఁగనొప్పెడు సుకృతాత్ములైనయట్టి
నలు తెఱంగుల జనములున్ భక్తితో ను
పాసనముఁ జేయుచుందురు పార్థ! నన్ను.

---

14 దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే.

15 న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః.
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః.

16 చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!

17 వారిలో నిత్యయుక్తుం డపారభక్తి
యుతుఁడు నగు జ్ఞాని యొకఁడె సర్వోత్తముండు
జ్ఞానవంతున కత్యంత మేను బ్రియుఁడ
నోదు నాకు నెంతయు బ్రియుం డో నతఁడును.

18 వీరలందఱుఁగూడ నుదారులె సుమి
జ్ఞానియన్న నాత్మయయని నేను దలఁతు
నతఁడు యుక్తాత్ముఁడై మహోన్నతగతినగు
నన్ను బొందినవాఁడగున్ సన్నుతముగ.

19 వాసుదేవుండె తలఁప సర్వంబటంచు
జ్ఞానవంతుఁడు తాఁ బెక్కు జన్మములకు
నంతమందున ననుబొందు నర్జునా ! సు
దుర్లభుండగు నమ్మహాత్ముండు వింటె ?

---

17 తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః.

18 ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతం,
ఆస్థిత స్స హి యుక్తాత్మా మామేవానుత్తమాంగతిమ్.

19 బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః.

20 భ్రమకులోగి యాయాయి కామములచేత
హృతవివేకులు స్వప్రకృతీరితులయి
డంబుమీఱఁ దత్తన్నియమంబులొంది
తా రుపాసించుచుం డన్యదైవతముల.

21 ఎవఁడెవఁడు భక్తుఁ డే యే తనువును శ్రద్ధ
యొదదలిర్పఁగ నర్చింప నిచ్ఛగించు
నతనికతని కచంచలమైనయట్టి
శ్రద్ధనే కలిగింతు సంశయము లేదు.

22 ఆతఁ డాశ్రద్ధతోఁగూడినట్టిఁడగుచు
మురిపమునఁ దదారాధనముం బొనర్చఁ
బిదప నాతఁడు నాచేత విహితములగు
హితములైన కామంబులనెల్లఁ బొందు.

---

20 కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః,
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా.
21 యోయోయాంయాం తనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్.
22 స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధనమీహతే.
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్.

23 అల్పమేధస్కు లగువారి కాఫలంబు
తలఁచిచూడఁగ నాశవంతమ్ము సుమ్ము
దేవతోపాసకులుగంద్రు దేవతలను
నాదుభక్తులుగందురు నన్నె పార్థ!

24 ఫల్గునా! బుద్ధిహీను లవ్యక్తుఁడనగు
నన్నుదలఁతు రెడందలన్ వ్యక్తునిగను
అవ్యయంబు నత్యుత్తమమైననాదు
పరమభావంబుఁ దెలియనివార లగుచు.

25 అఖిలమునకును యోగమాయాసమావృ
తుండనగు నే నొకింత వ్యక్తుండఁగాను
మూఢమగు లోక మిది యుభవుండ నవ్య
యుండనగు నన్ను దెలియ లేకుంమఁ జుమ్ము.

---

23 అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసాం,
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి.

24 అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః,
పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్.

25 నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్.

26 ఫల్గునా! సమతీతము౯ వర్తమాన
ములు భవిష్యములైనట్టి భూతములను
నే నెఱుంగుదు నన్నింటి నిశ్చయముగ
నేయొకండేని నన్ను దా నెఱుఁగ లేఁడు.

27 వినుము పార్థ! యిచ్ఛాద్వేషజనితమైన
ద్వంద్వమోహంబుచేత భూతంబులెల్ల
మొగిని సంసారమందు సమ్మోహమును స
తంబుఁ బొందుచునుండు నింతయు నిజంబు.

28 కవ్వడీ! వినుమీ పుణ్యకర్ములైన
యే జనుల పాతకము నశియించిపోవు
ద్వంద్వమోహనిర్ముక్తులైవారు నన్ను
పాసనముఁ జేయుదురు దృఢవ్రతులగుచును.

---

26 వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున!
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన.

27 ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత!
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప!

28 యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణాం,
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః.

29 క్రమగతిన్ జరామరణమోక్షంబునకయి
యెవరు న న్నాశ్రయించి యత్నించుచుంద్రో
వారు తెలియుదు రరసి యా బ్రహ్మమున్ స
మగ్రమైన యధ్యాత్మకర్మమునుగూడ.

30 సాధిభూతాధిదైవాధియజ్ఞుఁడనగు
నన్నెఱుంగుదు రెవ్వారు సన్నుతముగ
వారు యుక్తచేతస్కులై ప్రౌఢిమై ప్ర
యాణకాలమందును దెలియంగలారు.

——

29 జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్.
30 సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః.

——

# అధ్యాయము 8.

## అక్షర బ్రహ్మయోగము.

అర్జునుఁడు :—

1 వాసుదేవ ! నీయన్న యా బ్రహ్మమెద్ది?
మఱియు నధ్యాత్మమెద్ది? కర్మంబదెద్ది?
ఏది యధిభూతమని వచియింపఁబడు? మ
ఱేది యధిదైవమనుచు భాషింపఁబడును?

2 అచ్యుతా? యిట నీ దేహమందు నెట్టు
లుండు నధియజ్ఞుఁ? డాతఁ డెవ్వండు? చెపుమ
సంయములచేతను బ్రయాణసమయమందు
నెట్లుజ్ఞేయుండ వయ్యెద వీవు? కృష్ణ!

---

అష్టమోఽధ్యాయః (అక్షరబ్రహ్మయోగః)

అర్జున ఉవాచ:—

1 కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ!
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే.

2 అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన!
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః.

శ్రీభగవానుఁడు :—

3 అక్షరము పరమంబు బ్రహ్మ మ్మనఁబడు
భావ మధ్యాత్మమనియుఁ జెప్పంగఁ బడును
ఫల్గునా! భూతభావోద్భవకరమగు వి
సర్గమె వచింపఁబడుఁ గర్మసంజ్ఞితమయి.

4 అనఘ! క్షరభావ మధిభూత మనఁగబడును
తలఁపఁబడుఁ బూరుషుం డధిదైవతముగ
దేహభృద్వర! పార్థ! యీ దేహమందు
నేనె యధియజ్ఞుఁడ నటంచు నెఱుఁగుమీవు.

5 అంతకాలమునందు నీయకొని నన్నె
తలఁచుచుఁ గళేబరంబుఁ ద్యక్తమ్ముఁ జేసి
పయనమొనరించు నెవఁడు మద్భావము నతఁ
డొందు నర్జున! లేదిందు సందియంబు.

---

శ్రీభగవా నువాచ:—

3 అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః.

4 అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతం,
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర!.

5 అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః.

6 పురుషుఁ డింక నేయేభావమును దలఁచుచు
నంతకాలమునందు దేహంబు విడుచుఁ
బాండవా! సదాతద్భావభావితుఁడయి
యనువుఁగాఁగ నా యా భావమును బడయును.

7 కాన సర్వకాలములందు మాన కీవు
నను ననుసరించి స్మరియింపు మని సలుపుము
మనము బుద్ధియు నా యందుఁ జొనిపితేని
బొందెదవు నన్నె యిట లేదు సందియంబు.

8 క్రమయుతాభ్యాసయోగయుక్తము ననన్య
గామియునగు చిత్తంబున నేమ మడర
ధ్యానమును సల్పుచు ధనంజయా! జనుండు
పడయుచుండును దివ్యుని బరమపురుషు.

---

6 యంయం వాపి స్మరన్ భావం త్యజ త్యన్తే కళేబరం,
తం తమేవైతి కౌన్తేయ! సదా తద్భావభావితః.

7 తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్యస్యసంశయః.

8 అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థాఽనుచిన్తయన్.

9 కవిఁ బురాణు శాసకుఁడయి క్రాలువాని
నణువుకంటెను సూక్ష్ముని నఖిలమునకు
ధాత నవిచింత్యరూపుని దమముకంటెఁ
బరుని రవివర్ణు స్మరియించువాఁ డగుచును.

10 స్థిరతరంబగుమనము భక్తియును యోగ
శక్తియును దాలిచి ప్రయాణసమయమందు
బొమలనడుమఁ బ్రాణంబును బొందుపఱచి
పరమపురుషుని దివ్యునిం బడయుచుండు.

11 నిగమవిదు లక్షరముఁగ దేనిన్ వచింత్రు
దేనిజొత్తురు రాగమున్ మాని యతులు
తాల్తు రెబ్రహ్మచర్యంబు నెద్దాని గోరి
యా పదముఁ జెప్పుదున్ సంగ్రహముగ నీకు.

---

9 కవిం పురాణ మనుశాసితార మణో రణీయాంస మనుస్మరేద్యః,
సర్వస్య ధాతార మచిన్త్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్.

10 ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ స తం పరం పురుష
ముపైతి దివ్యమ్.

11 యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సఙ్గ్రహేణ ప్రవక్ష్యే.

12 ఎల్లద్వారంబుల న్నిరోధించి హృదయ
మందున మనంబు నరికట్టి పొందుమీఱ
మూర్ధమునయందుఁ దనప్రాణమును నిలిపియు
యోగధారణగతుఁడయి యుండి యోగి.

13 అంత "ఓమ్" అని పరఁగు నేకాక్షరమగు
బ్రహ్మమున్ వ్యాహరించుచు భక్తి నను స్మ
రించుచున్ మేను విడుచుచు నే నరుండు
పయన మొనరించు వాఁ డొందుఁ బరమగతిని.

14 అర్జున! యనన్యచేతస్కుఁడగుచు సతత
మెవఁడు పాయక నను స్మరియించుచుండు
యోగవంతుఁడు మఱి నిత్యయుక్తుఁడునగు
నతనికిం గడు సులభుండ నగుదు నేను.

---

12 సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్.

13 ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్.
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్.

14 అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః.

15 పరమమైన సంసిద్ధిని బడసినట్టి
జ్ఞానఘనులు మహాత్ములు నన్ను బొంది
సకలదుఃఖాలయమ్ము నశాశ్వతమ్ము
నగు పునర్జన్మమును బడయరు ధ్రువమ్ము.

16 అర్జునా! బ్రహ్మలోకపర్యంతమగు జ
గంబు లివి పునరావృత్తికలితములగు
నన్ను బొందినచోఁ బృథానందన! యిఁక
కలుగఁబోదు పునర్జన్మ తెలియు మిట్లు.

17 యుగసహస్రపర్యంతమై యుండుఁ బగలు
బ్రహ్మకు సహస్రయుగముల పరిమితమయి
యుండు రాత్రియు నని తెలియుదురు పార్థ!
విస్తరముగ నహోరాత్రవిదులు జనులు.

---

15 మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం,
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః.

16 ఆబ్రహ్మ భువనాల్లోకాః పున రావర్తినోఽర్జున!
మాముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే.

17 సహస్ర యుగపర్యన్త మహర్య ద్బ్రహ్మణోవిదుః,
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్ర విదో జనాః.

18 అర్జునా ! యుష్పతిలు నహరాగమంబు
నందు నవ్యక్తముననుండి వ్యక్తు లెల్ల
మఱిడి క్రమమున రాత్ర్యాగమంబునందు
నణఁగు నవ్యక్తసంజ్ఞికమైన యందె.

19 క్రమముతోడ నా యీ భూతసముదయంబె
పుట్టి పుట్టి విలీనమై పోవు రాత్రి
యాగమంబున మఱి యహరాగమమునఁ
బ్రభవమగుచుండు నెండియున్ బార్థ ! వింటె ?

20 పరముఁడున్ దదన్యుండు నవ్యక్తుఁడు మది
నరయ నవ్యక్తమునకంటె నాద్యతముఁడు
సర్వభూతంబులున్ వినాశంబునొందు
చున్నను వినాశమొందక యుండు నతఁడు.

---

18 అవ్యక్తా ద్వ్యక్తయస్సర్వాః ప్రభవన్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవాఽవ్యక్త సంజ్ఞకే.

19 భూతగ్రామ స్సఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవ త్యహరాగమే.

20 పరస్తస్మాత్తు భావోఽన్యో వ్యక్తోఽవ్యక్తా త్సనాతనః,
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి.

21 ఆతఁ డవ్యక్తుఁ డక్షరుఁ డనఁగబడును
పరమగతిగాఁగ నాతని బలుకుచుంద్రు
దేనినింబొంది మఱి నివర్తింపకుంద్రో
యది పరమమైన నాధామ మని తెలియుము.

22 ఎవనిలోనుండు భూతము లెవనిచేత
వ్యాప్తమైయుండునో యీ సమస్తజగము
నా పరమపూరుషుఁ డనన్యమైనభక్తిఁ
బడయఁగా శక్యుఁడగుజుమ్ము భరతముఖ్య!

23 యోగు లేకాలమున మృతినొందువార
లై యనావృత్తి నావృత్తి నందుచుంద్రో
యిప్పు డా కాలమును వచియించువాఁడ
స్పష్టముగ దాని నాలింపు పాండుతనయ!

---

21 అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిం,
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ.

22 పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా,
యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్.

23 యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ!

24 అగ్నియును జ్యోతియు నహంబు నల్లె శుక్ల
మాఱుమాసములగు నుత్తరాయణంబుఁ
బార్థ ! యీ కాలమందునఁ బ్రస్థితులయి
బ్రహ్మమును జేరుదురు జనుల్ బ్రహ్మవిదులు.

25 కిరీడి ! ధూమము రాత్రియుఁ గృష్ణపక్ష
మాఱుమాసములగుదక్షిణాయనంబు
నందుఁ జాంద్రమసజ్యోతి నంది యోగి
వెండియు నివృత్తి నిం బొందుచుండుఁ జూవె.

26 ఈ జగమ్మున కీ శుక్లకృష్ణగతులు
రెండునున్ శాశ్వతంబులై యుండుఁ జూవె
ఒక్కదాన ననావృత్తి నొంచెడున్ మ
ఱొక్కటన్ వెండి యావృత్తి నొందుచుండు.

---

24 అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణం,
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః.

25 ధూమో రాత్రిస్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనం,
తత్ర చాన్ద్రమసంజ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే.

26 శుక్లకృష్ణే గతీహ్యేతే జగత శ్శాశ్వతేమతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః.

27 ఫల్గునా! యోగి యీ రెండుపద్ధతులను
దగ నెఱుంగుచు మోహ మందం డొకప్డుఁ
గాన యోగయుక్తుండవు కమ్ము లెమ్ము
సర్వకాలంబులందును సమ్మతిమెయి.

28 వేదయజ్ఞతపోదానవిధులయందుఁ
గ్రీడి! యే పుణ్యఫలము నిర్దిష్టమయ్యెఁ
దా నధిగమించు నా సమస్తంబు నెఱిఁగి
పరము నాద్యమ్ము నగుగతిన్ బడయు యోగి.

---

27 నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున!

28 వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టం,
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీపరం స్థానముపైతిచాద్యమ్.

# అధ్యాయము 9.

## రాజవిద్యారాజగుహ్యయోగము.

శ్రీభగవానుఁడు :—

1 అర్జునా! యనసూయుఁడవైన నీకు
నేను గుహ్యతమంబు విజ్ఞానయుతము
నైన యీ జ్ఞానముఁ దెలియంబలుకుదు
నశుభముక్తుఁడ వగుదు వియ్యది యెఱింగి.

2 క్రమత నిది రాజవిద్యయు రాజగుహ్య
మూర్జితమ్ముఁ బవిత్ర మత్యుత్తమంబు
మఱియుఁ బ్రత్యక్షఫలము ధర్మంబనులము
నవ్యయమ్మును సులభసాధ్యమ్ము నగును.

---

నవమోఽధ్యాయః. (రాజవిద్యా రాజగుహ్యయోగః)

శ్రీభగవానువాచ:—

1 ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

2 రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమం,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్.

3 అరినిషూదన ! యీ ధర్మమం దలక్ష్య
భావము వహించి శ్రద్ధచూపని పురుషులు
చేరకయ నన్ను మృత్యు సంసారఘోర
పథమునందు నివృత్తులై వర్తిలుదురు.

4 అఖిలమైన యీ విశ్వ మవ్యక్తమూర్తి
నైన నాచే నభివ్యాప్తమై పరంగు
సర్వభూతజాలమ్ము మత్థమ్ము సుమ్ము
నే నవస్థితుండనుగాను వానియందు.

5 అర్జునా ! భూతములును నాయందు లేవు
ఐశ్వరంబగు నాయోగ మరసిచూడు
పార్థ ! నాయాత్మ యిది భూతభావనమయి
భూతములఁ దాల్చు మఱి కాదు భూతగతము.

---

3 అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప!
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని.

4 మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా,
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః.

5 న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరం,
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః.

6 అన్నిచోట్లఁ జరించు మహత్తరమగు
వాయు వెట్లుండు సతము నభస్థితమయి
యట్లె ఫల్గున ! సర్వంబులైన భూత
ములును నాయందుఁ గలవని తెలిసికొనుము.

7 సరిగఁ గల్పక్షయంబునన్ సకలభూత
ములును నాయందుఁ బ్రకృతిన్ బొందుచుండు
నర్జునా ! వానినెల్లఁ గల్పాదియందు
వెండియు న్నే విసర్జించుచుండుదుఁ జుమి.

8 స్వీయమగు ప్రకృతి నవలంబించి యించి
ప్రకృతివశమున నవశమైపరఁగునట్టి
యీ సమస్తభూతగణంబు నేనుఁ బూని
సారెసారెకు సృష్టిని సలుపుచుందు.

---

6 యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ.

7 సర్వభూతాని కౌన్తేయ! ప్రకృతిం యాన్తి మామికాం,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్.

8 ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్.

9 కోర కా కర్మలం దస క్తుండ నగుచు
నే నుదాసీనుభంగి నాసీనుఁడనయి
యుండుటం జేసి యా కర్మలుద్భవడిని
నన్ను బంధింపఁజాల వెన్నండుఁగాని.

10 అర్జునా ! సచరాచరమగు జగమును
ప్రకృతి యధ్యక్షుఁడనగు నావలనఁ గనును
ఈ నిమిత్తము చేతనే యెల్లజగము
సర్వవిధములఁ జేష్టల సల్పుచుండు.

11 అఖిలభూతమహేశ్వరమైన నాదు
పరమభావంబుఁ దెలియనివారలగుచు
మానుషంబగు దేహమున్ బూనినట్టి
నన్ను మూఢు లవజ్ఞ నొనర్చుచుందురు.

---

9 న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ!
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు.

10 మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం,
హేతునాఽనేన కౌన్తేయ! జగద్విపరివర్తతే.

11 అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,
పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్.

12 వితథములగు నాశలు నల్లి విఫలములగు
కర్మలున్ వ్యర్థమైనట్టి జ్ఞానము విప
రీత చిత్తముఁ గల్గి వర్తింతురివారు
రాక్షసాసుర మోహన ప్రకృతి నొంది.

13 దేవసంబంధినిఁ బ్రకృతిన్ మహాత్మ
లనువుమై నాశ్రయించి న న్నవ్యయునిగ
భూతముల కాదిఁగాఁగ నేర్పున నెఱింగి
నన్ను గొల్తు రనన్య మనస్కులగుచు.

14 సతముఁ బొగడుచు నను దృఢవ్రతులగుచును
నన్ను గూర్చి యత్నించుచు నన్ను భక్తి
మ్రొక్కుచు న్నిత్యయోగసంయుక్తులగుచు
నన్ను నెక్కాలము నుపాసనం బొనర్తు.

---

12 మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః.

13 మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్.

14 సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః,
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే.

15 భేదమున నభేదమ్మునఁ బెక్కుగతుల
విశ్వతోముఖుఁడనగుచు వెలయు నన్ను
జ్ఞానయజ్ఞంబుచేత లెస్సగ యజించు
వారలై పరులొనరింత్రుపాసనంబు.

16 నేను క్రతువను యజ్ఞంబు నేనయగుదు
స్వధయు నేనౌదు మఱియు నౌషధము నేన
నేను మంత్రంబు నాజ్యంబు నేనె యగుదు
నేనె యగ్నిని హుతమును నేనె చూవె.

17 ఈ జగంబునకున్ దండ్రి నేనయగుదుఁ
దల్లినిన్ ధాత నల్లె పితామహుఁడను
వేద్యమును నేన నేనె పవిత్రమును బ్ర
ణవము నేన ఋక్సామయజువులు నేన.

---

15 జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్.

16 అహం క్రతురహం యజ్ఞః స్వధాఽహమహమౌషధం,
మన్త్రోఽహమహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్.

17 పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్రమోఙ్కార ఋక్సామ యజురేవచ.

18 గతియు భర్తయుఁ బ్రభువును గర్మసాక్షి
మఱి నివాసంబు శరణంబు నెఱి సుహృత్తుఁ
బ్రభవముఁ బ్రళయంబుఁ దావలముఁ బెన్ని
దాన మవ్యయ బీజంబు నేన యగుదు.

19 నేనె తాపముఁగల్పింతు నిఖిలమునకు
నిగ్రహింతు విసర్జింతు నేనె వృష్టి
నమృతమును మఱి మృత్యువు నగుదు నేన
సవ్యసాచీ! వినుము సత్తసత్తు నేన.

20 మొనసి త్రైవిద్యులున్ సోమపులు గతాఘు
లై నను యజించి స్వర్గతి నభిలషింత్రు
పుణ్యమగు స్వర్గలోకంబుఁ బొందివారు
దివ్య దేవభోగంబు లందెదరు దివిని.

---

18 గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయస్స్థానం నిదానం బీజమవ్యయమ్.

19 తపా మ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ,
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున!

20 త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం
ప్రార్థయన్తే, తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోక మశ్నన్తి
దివ్యాన్ దివి దేవభోగాన్.

21 అలఘునాకలోకంబువా రనుభవించి
పుణ్యము గతింప నరలోకమునను జొత్తు
రిట్లు వేదధర్మము లాశ్రయించి భోగ
కాములై గతాగతములఁ గాంచుచుంద్రు.

22 ఏజను లనన్యులై స్మరియించుచు నను
బర్యుపాసన మొనరించువా రగుదురో
అర్జునా! నిత్య మభియుక్తులైనవారి
యోగమున్ క్షేమము వహించుచుందు నేను.

23 ఎవరు శ్రద్ధాసమన్వితులవుచు నన్య
దేవతల గాఢమైన భక్తిన్ యజింత్రో
అవిధిపూర్వకముగ ననయంబుఁ బార్థ!
వారు నన్ను యజించినవా రగుదురు.

---

21 తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి,
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే.

22 అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

23 యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః,
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్.

24 అర్జునా ! నేనె యీ సర్వయజ్ఞములకు
భోక్తనగుదుఁ దలంపఁ బ్రభువు నగుదును
తా రెఱుంగరు నను యథార్థంబుఁగాఁగఁ
గావునన్ భ్రష్టులగుదురు కాదె ? వారు.
25 తారు దేవవ్రతుల్ దేవతలను జేరు
దురు మఱియు నట్టులె పితృవ్రతుల్ పితరుల
భూతములఁ గొల్చువా రట్లె భూతములను
జేరుదురు నన్ను నన్ను యజించువారు.
26 ఎలమిఁ బత్రంబుఁ బుష్పంబు ఫలము జలము
భక్తి నెవ్వాఁడు నాకు నర్పణముఁ జేయు
వినియతాత్ముఁడై భక్తి నర్పించినట్టి
దాని నేను భుజింతుఁ బృథాతనూజ !.

---

24 అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానన్తి తత్త్వేనాఽతశ్చ్యవన్తి తే.
25 యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః,
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపిమామ్.
26 పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.

27 ఏదిసేయుదు భుజియింతు వేది మఱియు
నేదివేల్తు వొసంగుదు వేది నిష్ఠ
నేతపం బాచరింతు కుంతీతనూజ!
దాని నెల్లఁ గావింపు మదర్పణంబు.

28 సలిపి యిట్లు శుభాశుభఫలములైన
కర్మ బంధనములనుండి కాంతు ముక్తి
నవల సన్న్యాసయోగయుక్తాత్ముఁడవు వి
ముక్తుఁడవునయి నన్నును బొందఁగలవు.

29 సర్వభూతంబులందును సముఁడ నేను
ద్వేష్యుఁడును లేఁడు మఱి నాకుఁ బ్రియుఁడు లేఁడ
ఎవరు భక్తి ననున్ భజింయింత్రువార
లుంద్రు నాయందు వారియం దుందు నేను.

27 యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్.

28 శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి.

29 సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి నప్రియః
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

30 అతిదురాచారదూషితుఁడయ్యు భక్తి
నితరమునువీడి నను భజియించు నేని
వాని సాధువుఁగాఁ దలంపంగఁ జెల్లు
నతఁడు సమ్యగ్వినిశ్చయుఁ డయ్యెఁగాదె ?

31 వాఁడు ధర్మాత్ముఁడగు నతిత్వరితగతిని
శాశ్వతంబయి యొప్పారు శాంతిఁబడయు
దీనిలెస్సగఁదెలియు కౌంతేయ ! నాదు
భక్తుఁ డేమాత్రమును నశింపండు సుమ్మి.

32 పాండురాజతనూభవా ! పాపజన్మ
కలితులును మఱి స్త్రీలు వైశ్యులును శూద్రు
లధికతరమగుభక్తి నన్నాశ్రయించి
పడయఁగల్గుదు రొద్దికఁ బరమగతిని.

---

30 అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః.

31 క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి.

32 మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాం గతిమ్.

33 పార్థ! యింక పుణ్యతములగు బ్రాహ్మణులను
భక్తులైన రాజర్షులఁ బలుకవలెనె
యస్థిరమ్ము నసౌఖ్యంబునైనయిట్టి
లోకమును బొందియున్కఁ గొల్వు మింక నన్ను

34 మన్మనస్కత నాకు నమస్కరింపు
నన్ను భజియింపు యజియింపు నన్ను బార్థ!
యుక్తముగ నాత్మ నీరీతి నొనరిచి నను
నందఁగల్గుదు మత్పరాయణుఁడ వగుచు.

---

33 కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్.

34 మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః,

# అధ్యాయము 10.

## విభూతి యోగము.

శ్రీభగవానుఁడు :—

1 ఘనభుజా! పాండునందనా! క్రమ్మఱంగఁ
బరమమైన నావాక్య మేర్పడఁగ వినుము
హితమునున్ గోరి ప్రీతిపరీతుఁడవయి
యెనయు నీకు దీనిన్ వచియించువాఁడ.

2 సురవిజ్ఞానమ్ములున్ మహర్షులును నాదు
ప్రభవము నెఱుంగలేరు రవంతయేని
సురగణంబులకున్ మహర్షులకుఁగూడ
నన్ని తెఱఁగుల నావి నేనాదుఁ గాదె?

---

దశమోఽధ్యాయః (విభూతియోగః)

శ్రీభగవానుఁడు :—

1 భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా.

2 న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః,
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః.

3 ఎవఁ డనాది నజున్ భువనేశు దివ్యుఁ
గాఁగ నన్నును దా నెఱుఁగంగలాఁడొ
యతఁ డసమ్మోహుఁడై మర్త్యులందుఁ బరఁగి
పొలుపుమై సర్వపాపవిముక్తుఁ డగును.

4 బుద్ధి జ్ఞాన మసమ్మోహమును బడపడి
క్షమయు సత్యంబు నట్టులె దమము శమము
ఫల్గున! సుఖంబు దుఃఖంబు భవ మభావ
మాపయిఁ దలంచిచూడ భయం బభయము.

5 మఱియు నట్లె యహింస సమతయుఁ దుష్టి
తపము దానంబునున్ యశ మపయశంబు
భూతకోటులకున్ బృథగ్భూతములగు
భావములు సంభవించు నావలననె సుమి.

---

3 యో మా మజ మనాదిం చ వేత్తి లోక మహేశ్వరం,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే.

4 బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః,
సుఖం దుఃఖం భవో భావో భయం చాభయమేవ చ.

5 అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః,
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః.

6 ఈ ప్రజల్ లోకమునవార లెవరివారో
పొసఁగ నా సప్తమునులుఁ బూర్వులు నలువురు
మనువులును నిక్క మారయన్ మానసోద్భ
వులును మద్భావులును జుమీ యలఘుచరిత !.
7 ఎవఁడు వాస్తవికముగ నా యీ విభూతి
నాత్మయోగంబునున్ దెలియంగలండొ
కవ్వడీ ! యవికంపయోగంబుచేత
నతఁడు యుక్తుఁడగుఁ సంశయంబులేదు.
8 అఖిలమునకును బ్రభవంబ నగుదు నేను
ఎల్లయు న్నావలననె వర్తిల్లుచుండు
నని తలంచుచు భావసమన్వితులయి
నను భజింతురు విబుధు లనారతంబు.

---

6 మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః.
7 ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః.
8 అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః.

9 నాపయిన్ జిత్తముంచి ప్రాణములుకూడ
సారిది నాయందుఁ జొనిపి యొండొరులు బోధఁ
జేసికొనుచు నిత్యము నన్ను జెప్పికొనుచు
మిగుల మోదించుచుంద్రు రమించుచుంద్రు.

10 అనవరతయోగసంయుక్తు లగుచు మిగులఁ
బ్రీతి మద్భజనంబుఁగావించునట్టి
జనులకున్ బుద్ధియోగ మొసంగుచుందుఁ
జేరుకొందురు నన్ను నద్వారు దాన.

11 వారికిన్ గనికరముఁ జూపంగ నెంచి
నాశనం బొనరింతు నజ్ఞానసంభ
వంబగుతమంబు నాత్మభావస్థుఁడనయి
భాసమానమహా జ్ఞానదీపంబుచేత.

---

9 మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్,
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ.

10 తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే.

11 తేషామేవానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

అర్జునుఁడు :—

12 తగఁ బరబ్రహ్మమవు పరంధామమవును
పరమపావనుఁడవునీవు వాసుదేవ !
దివ్యుఁగా నజుఁగా నాదిదేవుఁగాఁగ
స్థిరునిగా విభుఁగా మఱి పురుషుఁగాఁగ.

13 నిను వచించిరి సర్వఋషులును సురర్షి
యైన యట్టినారదుఁడును నట్లె పూని
యసితుఁడుఁ దేవలుండును వ్యాసుఁడు నిఁక
నీవె స్వయముగ నాకు వచింపుచుంటి.

14 నన్నుఁ గూర్చి నీచెప్పినయదియెల్ల
సత్యముగనె భావింతు నాస్వాంతమందు
దేవతలును దానవులును దెలియలేరు
త్వత్ప్రభావంబు నో భగవత్స్వరూప !.

---

అర్జున ఉవాచ :—

12 పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్.

13 ఆహుస్త్వా మృషయస్సర్వే దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే.

14 సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ !
న హి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః.

15 ఆత్మచే నాత్మనీవు స్వయంబుఁగాను
తెలియుదువు పురుషోత్తమా ! లలితచరిత !
భూతభావన ! భూతేశ ! భూతరూప !
దివ్యపురుష ! జగత్పతీ ! దేవదేవ !

16 ఏ విభూతులచేత నీ వీ సమస్త
లోకములను వ్యాపించి పొల్పుమెయినుందొ
తెలుప నర్హుఁడవౌదు నా దివ్యములయి
పొలుచు నాత్మవిభూతులఁ బూర్ణమగును.

17 నేను యోగివరా ! యెట్లు నిన్ను సతత
మాత్మఁజింతించుచున్ దెలియంగలాఁడఁ
బూన్కిఁ దనర నే యే భావముల నధీశ !
చింతనీయుఁడ వగుదు నాచేత నీవు?

---

15 స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ !
భూతభావన! భూతేశ! దేవదేవ ! జగత్పతే !

16 వక్తుమర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి.

17 కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచి న్తయన్,
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా.

18 ఓ జనార్దన ! తగ నాత్మయోగమున్ వి
భూతినిన్ గూడ విస్తరంబుగను నాకు
వెండి వచియింపు లేదు తృప్తియు భవద్వ
చోఽమృతము వినుచుండెడు నట్టినాకు.
శ్రీభగవానుఁడు:—
19 అయయొ ! యాలింపు నీకు దివ్యంబులగుచుఁ
బరఁగు నాత్మవిభూతులన్ బాండురాజ
తనయ ! వచియించువాఁడఁ బ్రాధాన్యమునను
నావిభూతి విస్తృతికి నంతంబు లేదు.
20 అఖిలభూతాశయస్థుఁడనైన యేన
యాత్మ నగుదు గుడాకేశ ! యరసిచూడ
నాది నే నౌదు నేన మధ్యంబ నౌదు
నవల భూతంబులకు నేన యంత మగుదు.

---

18 విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన !
భూయఃకథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్.
శ్రీభగవానువాచ:—
19 హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యంతో విస్తరస్య మే.
20 అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ.

21 చూడ నాదిత్యులందు విష్ణువును నేను
జ్యోతులం దంశుమాలి సూర్యుఁడను నేను
యూథిగ మరీచి నేను మరుత్తులందు
శశిని నేను నక్షత్రపుంజంబునందు.

22 వేదములయందు నే సామవేద మౌదు
వాసవుఁడనౌదు నేను దేవతలయందు
నింద్రియములందున మనంబు నే నగుదును
భూతములయందు నౌదు నే చేతనమును.

23 రుద్రులందున నే శంకరుండ నౌదు
యక్షరక్షస్సులందు నే నర్థపతిని
పావకుఁడ నౌదుఁ బార్థ! నే వసువులందుఁ
బర్వతములందు నే మేరుపర్వతమను.

---

21 ఆదిత్యానామహం విష్ణు ర్జ్యోతిషాం రవిరంశుమాన్,
మరీచి ర్మరుతామస్మి నక్షత్రాణా మహం శశీ.

22 వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః,
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా.

23 రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం,
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణా మహమ్.

24 అల పురోధలలో ముఖ్యుఁడగు బృహస్ప
తినిగ నన్నును మదియందుఁ దెలియు పార్థ !
స్కందుఁడను నేను సేనానులందు మఱియు
సరసులందున నే నౌదు సాగరమను.

25 భృగువు నే నౌదు నల మహర్షి గణమందు
నగుదు వాక్కులయందు నే నేకాక్షరమను
యజ్ఞములయందు నే జపయజ్ఞ మవుదు
స్థావరంబులలో హిమశైల మేను.

26 సర్వవృక్షంబులందు నశ్వత్థ మేను
క్రిమత దేవర్షులందు నారదుఁడ నేను
తలఁపఁ జిత్రరథుండ గంధర్వులందు
నఖిలసిద్ధులలోఁ గపిలాఖ్యమునిని.

---

24 పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ ! బృహస్పతిం,
సేనానీనా మహం స్కంద స్సరసామస్మి సాగరః.

25 మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరం,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః.

26 అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః,
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః.

27 అశ్వములలోన నమృతజన్యమయిపరఁగు
నట్టి యుచ్చైశ్శ్రవమ్ము నే నౌదుఁ బార్థ!
గజములందు నైరావతగజము నేను
నరపతిని నేను ఫల్గునా! నరులయందు.

28 ఆయుధంబులయందు వజ్రాయుధమను
ధేనువులయందు నల కామధేను వేను
ప్రజనయితనై నయట్టి దర్పకుఁడ నేను
వాసుకిని నేను సర్వసర్పములయందు.

29 నాగములలో ననంతుఁడ నా బరఁగుదు
వరుణుఁడను నేను సలిలదేవతలయందు
వినుము నే నర్యముఁడనౌదుఁ బితరులందు
యమనశీలురయందు నే యముఁడనౌదు.

---

27 ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవం,
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్.

28 ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్,
ప్రజనశ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః.

29 అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహం,
పితౄణా మర్యమాచాస్మి యమస్సంయమతా మహమ్.

30 తలఁపనేను ప్రహ్లాదుఁడ దైత్యులందుఁ
గాల మేను వృద్ధిక్షయకారులందు
మృగపతిని నేను ఫల్గునా ! మృగములందు
వైనతేయుఁడ నే నౌదుఁ బక్షులందు.

31 పావనముఁ జేయువానిలోఁ బవన మేను
రామభద్రుఁడ నేను శస్త్రిధరులందు
మకరమగుదు ఝషంబులమధ్య నేను
నదులమధ్యను నేను జాహ్నవి నగుదును.

32 సవ్యసాచి ! వింటే ? యెల్ల సర్గములకు
నాది యంతంబు మఱియు మధ్యంబు నేను
విద్యలం దెల్ల నధ్యాత్మవిద్య నేన
వాద మేన వాదించెడు వారిలోన.

---

30 ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహం,
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్.

31 పవనః పవతామస్మి రామ శ్శస్త్రభృతా మహం,
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ.

32 సర్గాణా మాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున!
అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్.

33 అక్షరములం దకారంబ నౌదు నేను
ద్వంద్వ మేను సమాసబృందంబునందు
నక్షయంబగు కాలంబ నౌదు నేను
తలఁప నే విశ్వతోముఖధాత నౌదు.

34 అఖిలహారమగు మృత్యువు నౌదు నేను
భావులందుఁ దలంప నుద్భవము నేను
శ్రీయుఁ గీర్తియు వాక్కును స్మృతియు మేధ
ధృతియు క్షమయును నేనౌదు స్త్రీలలోన.

35 సామములలోన నే బృహత్సామ మౌదు
నరయ ఛందములందు గాయత్రి నేను
మార్గశీర్షమ నౌదు నే మాసములను
ఋతువులందున నే వసంతర్తు వగుదు.

---

33 అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ,
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః.

34 మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతాం,
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా.

35 బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహం,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః.

36 ఛలము సల్పువారి దగు జూజమ్మ నేను
అమలతేజము తేజస్వులందు నేను
జయము నే నౌదు మఱి వ్యవసాయమౌదు
సత్త్వవంతులయందలి సత్త్వ మేను.

37 వాసుదేవుఁడ నే వృష్ణివరులలోనఁ
బాండవులలోపల ధనంజయుండ నేను
మునులయందున నే వ్యాసముని నగుదును
కవులలోఁ గవియైన భార్గవుఁడ నేను.

38 దమనకారులలోఁగల దండ మేను
నే జిగీషుజనంబుల నీతి నౌదు
గుహ్యములలోని మౌనం బగుదును నేను
జ్ఞానవంతులలోఁగల జ్ఞాన మేను.

---

36 ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహం,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్.

37 వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనామప్యహం వ్యాసః కవీనా ముశనాకవిః.

38 దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతాం,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్.

39 సర్వభూతంబులకును బీజమగు నేది
యదియుఁగూడ నర్జున! నేన యగుదుఁ జూవె
చరము నచరంబునగు భూతజాలమందు
నేను లేకుండనున్నది కానరాదు.

40 అరినిషూదన! నాదు దివ్యంబులగు వి
భూతులకు నంతమన్నది పోల్ప లేదు
అరసి యేతద్విభూతి విస్తరము నీకుఁ
దెలిపినాఁడను నేను సోద్దేశముగను.

41 శ్రీవిభూతియుతంబు నూర్జితము నగుచు
సత్త్వ మెయ్యె దెయ్యది యిటఁ జక్కనొప్పు
సవ్యసాచి! మత్తేజోంశసంభవముగ
నెఱుఁగుమా దాని దాని నీహృదయమందు.

---

39 యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున!
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్.

40 నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప!
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా.

41 యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా,
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్.

42 అయిననుం బెక్కు దెలిసినయట్టిదీన
నీకుఁ బని యేమియుండుఁ గుంతీతనూజ !
ఈ జగంబుసమస్తంబు నేను ముట్టి
ప్రౌఢి నేకాంశముననున్నవాఁడఁ జుమ్మి.

---

## అ ధ్యా య ము 11.

### విశ్వరూప దర్శన యోగము.

అర్జునుఁడు .—

1 మదనుకంపార్థమై పరమంబు గుహ్య
మును మ అధ్యాత్మసంజ్ఞితంబునయి పరఁగు
నే వచన మిష్టు నీచే వచింపఁబడియె
దాన నా మోహమిద్ది విధ్వస్తమయ్యె.

---

42 అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున!
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్.

---

ఏకాదశోఽధ్యాయః (విశ్వరూపదర్శనయోగః)

అర్జున ఉవాచ :—

1 మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ.

2 భూతముల యుద్భవ వినాశములను నేను
విస్తరంబుగ నీచేత విన్నవాఁడ
నవ్యయంబై తనర్చు మాహాత్మ్యకమును
నలినపత్రాక్ష ! వింటి నీవలన నిపుడు.

3 ఆత్మఁగూరిచి పరమేశ్వరా ! యిదెట్టు
లెత్తెఱంగున నీవు వచించినావొ
యైశ్వరమగు నీ యా రూప మరసిచూడఁ
గోరెదన్ బురుషోత్తమా ! కోర్కెతీర.

4 దాని నేను సందర్శింపఁ దగుదునంచుఁ
దలఁతువేనియు నో ప్రభూ ! తడయకిపుడు
చూపు మవ్యయమగు నాత్మరూప మీవు
నాకు యోగేశ్వరా ! సర్వలోకవంద్య !.

---

2 భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్యమపి చావ్యయమ్.
3 ఏవమేతద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర!
ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ !
4 మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్.

శ్రీభగవానుఁడు :—

5 శతవిధంబులు మఱి సహస్రవిధములును
వివిధవర్ణాకృతుల్ బహువిధములునగు
నాదు దివ్యరూపంబులన్ ఫల్గునా! క
డంకమై చూడు మిప్పుడు శంకలేక.

6 భరతముఖ్య! యాదిత్యుల వసువుల నల
రుద్రులన్ మఱి యశ్వి మరుద్గణముల
నట్టులె యదృష్టపూర్వంబులైనయట్టి
బహువిధాశ్చర్యములగు రూపములఁ జూడు

7 ఇప్పుడింక నేకస్థమై యిందుఁ దోఁచు
చరము నచరంబునగు సర్వజగమును మఱి
యితర మేయ్యదిచూడ వాంఛింతొ యదియు
నాశరీరంబునన్ గుడాకేశ! చూడు.

---

శ్రీభగవానువాచ :—

5 పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ,

6 పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుతస్తథా,
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత!

7 ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం,
మమ దేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి.

8 స్వీయమైన యీ చక్షువుచేత నన్ను
నీవు చూడ శక్తుండవు కావు చూనె
దివ్యచక్షువు నొసఁగెద దీనఁ గాంచు
మైశ్వరంబగు నాయోగ మరసి నీవు.

సంజయుఁడు :—

9 అని యిటుల్ వచియించి యనంతరంబు
దండిమై మహాయోగేశ్వరుండగు హరి
పరమ మైశ్వర్యమునగు రూపంబు నపుడు
చూపెఁ బార్థునకున్ గురుక్షోణినాథ !

10 తత్స్వరూపమనేకవక్త్రనయనకలి
తంబు మఱి యనేకాద్భుత దర్శనంబు
నైక దివ్యాభరణశోభనం బుదగ్ర
దివ్యనైకోద్యతాయుధదీపితంబు.

---

8 న తు మాం శక్యసే ద్రష్టు మనేనై వ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్.

సఞ్జయ ఉవాచ :—

9 ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్.

10 అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనం,
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్.

11 దివ్యమాల్యాంబరధరంబు దివ్యచంద
నానులేపనకలిత మనంత మఖిల
బహువిధాశ్చర్యమయము దివ్యంబు ఘనము
విశ్వతోముఖమున్ బహువిస్తృతంబు.

12 ఒక్కపెట్టున వేయిసూర్యుల యపార
దీప్తి యాకాశమున నుప్పతిల్లు నేని
నా హృషీకేశుకాంతిసమూహమునకు
సామ్యముంబొంద నొక్కింత చాలియుండు.

13 పలుదెఱంగులుగాఁ బ్రవిభక్త మయ్యు
నందు నేకస్థమైయున్న యఖిలజగము
దేవదేవునిదైన యా దేహమందు
నపుడు పొడఁగాంచె వెఱగున నర్జునుండు.

---

11 దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనం,
సర్వాశ్చర్య మయం దేవ మనన్తం విశ్వతోముఖమ్.

12 దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా,
యది భాస్సదృశీ సా స్యా ద్భాసస్తస్య మహాత్మనః.

13 తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవ దేవస్య శరీరే పాండవస్తదా.

14 హృష్టరోముండు విస్మయావిష్టుఁడునయి
యరా ధనంజయుఁ డంతట నధికభక్తి
మూర్ధమున మ్రొక్కి దేవదేవునకు నిట్లు
మోడ్పుదోయిలితో నయంబునను బల్కె.

అర్జునుఁడు :—

15 దేవ! కనుచుంటి నీమేన దేవతలను
సర్వములగుభూతవిశేషసంఘములను
అజుని బ్రహ్మ నీశున్ గమలాసనస్థు
నెల్లఋషుల దివ్యోరగబృందములను.

---

14 తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత.

అర్జున ఉవాచ:—

15 పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాంస్తథా భూత విశేష
సఙ్ఘాన్, బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వా
నురగాంశ్చ దివ్యాన్.

16 నిను ననేకబాహూదరనేత్రవక్త్రు
నెల్లెడ ననంతరూపు వీక్షించుచుంటి
నీకు నాది మధ్యాంతముల్ నేను జూడఁ
జాలకుంటి విశ్వేశ! విశ్వస్వరూప !

17 చక్రిని గదాధరున్ బ్రోల్లసత్కిరీటు
సర్వతో దీప్తిమంతుఁ దేజస్సమూహు
నంతటన్ దుర్నిరీక్ష్యు దీప్తానలార్క-
కాంతియుతు నప్రమేయునిన్ గాంచుచుంటి.

18 పరమమున్ జ్ఞేయమైన యక్షరమ వీవ
ఈవ పరమనిధానమ వీ జగమున

---

16 అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామిత్వాం సర్వతోఽనన్త రూపం, నాన్తం న మధ్యం న పునస్తవాదిం పశ్యామివిశ్వేశ్వర! విశ్వరూప!

17 కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతోదీప్తిమన్తం, పశ్యామిత్వాం దుర్నిరీక్ష్యం సమన్తాద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్.

18 త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరంనిధానం,

ననవరతధర్మగోప్త వవ్యయుఁడవున్ స
నాతనపురుషుఁడవునంచు నామతంబు.

19 ఆదిమధ్యాంతరహితు ననంతభుజు న
నంతవీర్యుని శశిసూర్యనయనగలితు
దీప్తపావకవక్త్రు స్వతేజమున జ
గంబునెల్లఁదపించు నిన్ గాంచుచుంటి.

20 భూనభంబులయంతరంబును సమస్త
దిక్కులు న్నిండియుంటివి నీ వొక్కరుఁడవె
భయదమైన యీ నీస్వరూపంబుచేత
వ్యథితమయ్యెను లోకత్రియము మహాత్మ!

21 చొచ్చుచుండెను నిన్ను నీ సురగణములు
కేలు మోగిచి భీతిఁ గొంద ఱగ్గించుచుండ్రి

---

త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే.

19 అనాదిమధ్యాన్తమనన్తవీర్యమనన్తబాహుం శశిసూర్యనేత్రం,
పశ్యామిత్వాందీప్తహుతాశవక్త్రంస్వతేజసావిశ్వమిదంతపన్తమ్.

20 ద్యావాపృథివ్యోరిదమన్తరంహివ్యాప్తంత్వయైకేనదిశశ్చసర్వాః,
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రంతవేదం లోకత్రయం ప్రవ్యథితం
మహాత్మన్.

21 అమీ హి త్వాంసురసఙ్ఘావిశన్తి కేచిద్భీతాఃప్రాఞ్జలయోగృణన్తి,

స్వస్తి యని మహర్షులు సిద్ధసంఘములును
పుష్కలంబగు స్తుతుల నిన్ బొగడుచుండె.

22 దేవ! రుద్రులు సాధ్యు లాదిత్యులు వసు
వులును విశ్వు లశ్వులు నూష్మపులు మరుత్తు
లసురగంధర్వ యక్షసిద్ధాదిగణము
లెల్ల వెఱగున నిన్ను వీక్షించుచుండ్రి.

23 వ్యధితులము మహాభుజ! బహువక్త్రనేత్ర
ము బహుబాహూరుకరపాదమున్ బహూద
రంబును బహుదంష్ట్రాకరాళంబునైన
నీదురూపుఁగాంచి జగముల్ నేనుగూడ.

24 భాస్వరు ననేకవర్ణు నభ్రంలిహాగ్రు
వ్యాత్తవక్త్రు విశాలవిస్ఫారనేత్రు

---

స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసఙ్ఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః.

22 రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ,
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే.

23 రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో! బహుబాహూ
రుపాదమ్, బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః
ప్రవ్యథితాస్తథాఽహమ్.

24 నభస్స్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం,

నిన్నుఁగని సవ్యథుండనై నేను బడయఁ
జాలకుంటిని ధృతి నేని శాంతినేని.

25 కఠినదంష్ట్రాకరాళముల్ కాలవహ్ని
తులితములునగు నీముఖంబులనుగని య
చెంతిలిన్ దిగ్భ్రమ సుఖంబుఁ జెందకుంటిఁ
గనికరింపు దేవేశ ! జగన్నివాస !

26 వీరె ధృతరాష్ట్రసుతు లెల్లవారుఁగూడ
నవని పాలకసంఘసమభ్యుపేతు
లగుచు భీష్ముండు ద్రోణుఁడీ యర్కసుతుఁడు
నటులె మా వారలగు యోధభటులతోడ.

---

దృష్ట్వాహి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విన్దామి శమం
చ విష్ణో!

25 దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని,
దిశో న జానే న లభేచ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస!

26 అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావని
పాలసఙ్ఘైః, భీష్మద్రోణ సూతపుత్ర స్తథాఽసౌ సహాస్మదీయైరపి
యోధముఖ్యైః.

27 ప్రకటదంష్ట్రికరాళముల్ భయదములగు
నీముఖంబులఁజొచ్చుచుండిరి బిరాన
జిక్కికొని పండ్లలో నుగ్గుఁజేయఁబడిన
తలలఁ జూపట్టుచుండ్రి కొందఱు మహాత్మ!

28 పెక్కులైన నదీజలవేగముల్ స
ముద్రమున్ జొచ్చు నెట్లభిముఖములగుచు
నట్లె జ్వలియించుచుండు నీయాస్యములఁ బ్ర
విష్టులగుచుండ్రి నరలోక వీరులెల్ల.

29 ఎట్లు మండుచునుండు వహ్నిన్ మిడతలు
సరభసంబుగఁ జొచ్చు నాశంబునకయి
యట్టులె వినాశమునకునై యఖిలలోక
ములును జొచ్చెడు నీవక్త్రములను గృష్ణ!

---

27 వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాన్తరేషు సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః.

28 యథా నదీనాం బహవోఽమ్బువేగాః సముద్రమేవాభిముఖా
ద్రవన్తి, తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి.

29 యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశన్తి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః.

30 ప్రజ్వలద్వక్త్రముల మ్రింగువాఁడ వగుచు
నెల్లలోకంబులం జప్పరించుచుంటి
జగమునంతను నింపి తేజములచే త్వ
దీయదీప్తుల్ ప్రతప్తంబుఁ జేయుచుండె.

31 ఎఱుఁగఁజెప్పు ముగ్రరూపుఁడ వెవఁడవీవు
నీకు జోహార్లు నను గరుణింపు దేవ !
తెలియఁగోరెద నిను నాద్య దేవదేవుఁ
దెలియ లేకుంటిఁ ద్వత్ప్రవృత్తిన్ మహాత్మ !

---

30 లేలిహ్యసే గ్రసమానస్సమన్తా ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః, తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో.

31. ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద, విజ్ఞాతు మిచ్ఛామి భవన్తమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్.

శ్రీభగవానుఁడు :—

32 లోకసంక్షయకరుఁడఁ గాలుఁడను నేఁబ్ర
వృత్తుఁడఁ లోకసంహారవృత్తికినయి
ప్రత్యనీకస్థులగు యోధవర్యులెల్ల
పాండవా! నీవు లేకయె యుండఁబోరు.

33 కావునన్ లెమ్ము సత్కీర్తిఁగనుము నీవు
అరులగెల్చి రాజ్యమి దెల్ల ననుభవింపు
వారు నాచేతఁదొలుతనే ప్రహతులైరి
అర్జున! నిమిత్తమాత్రుఁడ వగుము నీవు.

---

శ్రీభగవానువాచ:—

32 కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః, ఋతేఽపి త్వాం నభవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః.

33 తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ జిత్వాశత్రూన్ భుఙ్క్ష్వరాజ్యం సమృద్ధమ్, మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.

34 ద్రోణునిన్ భీష్ముని జయద్రథు నల కర్ణు
నోలి నట్టులె యన్యుల యోధవరులఁ
గసిమసంగు మన్నిహతులఁ గలతపడకు
పోరుము జయింతు వాహవభూమి రిపుల.

సంజయుఁడు :—

35 కేశవుని యీ వచన మాలకించి క్రీడి
వణఁకుగదిరిన మేనితోఁ బ్రాంజలియయి
వెండియుఁ మ్రొక్కి భీతభీతుండగుచును.
ఎలుగు రాల్పడ నల్లన నిట్టులనియె.

---

34 ద్రోణఞ్చ భీష్మఞ్చ జయద్రథఞ్చ కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్, మయా హతాంస్త్వం జహిమావ్యథిష్ఠాయుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్.

సఞ్జయ ఉవాచ :—

35 ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ, నమస్కృత్వా భూయ ఏవాహకృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య.

అర్జునుఁడు :—

36 ఇది హృషీకేశ ! యుక్తమ యీ జగము ప్ర
హృష్ట మనురక్తమును ద్వత్ప్రవృత్తి నయ్యె
రక్కసులు భీతమతులైరి దిక్కులదరె
మ్రొక్కుచుండె సిద్ధవితానము లతిభక్తి.

37 అతిగరిష్ఠుఁడవున్ బ్రహ్మ కాది కర్త
వైన నీకేల మ్రొక్కరు ? పూని వార
లచ్యుత ! జగన్నివాస ! యనంతరూప !
అగుదు వీ వీశ ! సదసత్పరాక్షరమవు.

38 మొదటి దేవుఁడవు పురాణపూరుషుఁడవు
నీవె పరమనిధానమ వీ జగమున

---

అర్జున ఉవాచ:—

36 స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వేనమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః.

37 కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాది
కర్త్రే, అనన్త! దేవేశ! జగన్నివాస! త్వమక్షరం సదసత్తత్ప
రంయత్.

38 త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరంనిధానమ్,

కీవె వేత్తవు వేద్యంబ వీవె పరమ
ధామ మీవ నీచేత వ్యాప్తంబు జగము.

39 వాయువు యముండు నగ్నియు వరుణుఁడు శశి
యును బ్రజాపతి బ్రపితామహుఁడవు నీవ
విశ్వరూప! నీకివె వేనవేల్ జొహార్లు
మఱియు మఱియును నీకు నమస్కృతులివె.

40 ముందునున్ వెన్క నీకివే వందనమ్ము
లంతటన్ సర్వరూప! జోహార్లు నీకు
విను మనంతవీర్యామిత విక్రముఁడవు
పొంచితివి సర్వ మగుట సర్వుఁడవు నీవు.

41 నీదుమహిమముఁ దెలియని నేను సఖుఁడ
వని తలఁచి ప్రమాదముననో ప్రణయముననో

---

వేత్తాసి వేద్యఞ్చ పరఞ్చ ధామ త్వయా తతం విశ్వమనన్తరూప!

39 వాయుర్యమోఽగ్నిర్వరుణ శ్శశాఙ్కః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ, నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమోనమస్తే.

40 నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ, అనన్తవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.

41 సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హేకృష్ణ! హేయాదవ!

'ఓయి కృష్ణ ! యో యాదవ ! యో సఖ !' యని
పలికియున్నాఁడ నెయ్యది ప్రసభగతిని.

42 మును విహారశయ్యాసనభోజనముల
నొంటిఁగాఁగాని పల్వురయొద్దఁగాని
గేలిసేయఁగ నేయసత్కృతి సలిపితి
నదిక్షమింపవేఁడెద నిన్ను నప్రమేయ.

43 ఈ చరాచరజగమున కీవ తండ్రి
వర యఁబూజ్యుండవు గరిష్ఠగురుఁడవగుదు
మూఁడుజగముల నీకు సముండు లేఁడు
మఱి యధికుఁడున్నె ? యప్రతిమప్రభావ !

---

హే సఖేతి!, అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదా
త్ప్రణయేనవాపి.

42 యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు,
ఏకోఽథవాప్యచ్యుత! తత్సమక్షం తత్ క్షామయే త్వా మహమ
ప్రమేయమ్.

43 పితాపి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్,
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమ
ప్రభావ!

44 కాన సాగిలి మ్రొక్కి జగత్ప్రయేశు
సేవ్య నిన్ను బ్రసన్నుఁగాఁ జేసికొందుఁ
గొడుకునున్ దండ్రి సఖుని సఖుండు ప్రియుని
బ్రియుఁడువలె సైఁపఁదగుదు నిశ్చయము దేవ!

45 కని యెఱుంగని రూపంబుఁ గని తనిసితిఁ
బ్రవ్యథితమయ్యె నామది భయముకతనఁ
జూపుమా దేవ! నాకు నా రూపమె తగఁ
గనికరింపు దేవేశ! జగన్నివాస!

46 చక్రిని గదాధరున్ సమంచత్కిరీటు
నిన్ను నట్టులె వీక్షింప నేఁ దలఁచెద

---

44 తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్, పితేవ పుత్రస్య సఖేవసఖ్యుః ప్రియః ప్రియా యార్హసి దేవ! సోఢుమ్.

45 అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే, తదేవ మే దర్శయ! దేవ రూపం ప్రసీద దేవేశ! జగన్నివాస!

46 కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ,

వరచతుర్భుజయుక్తరూపంబుతోనె
వెలయుము సహస్రభుజ ! ఘనవిశ్వరూప !

శ్రీభగవానుఁడు :—

47 ఆత్మయోగంబుచేతఁ ద్వదన్యుఁడు మును
చూడనిది యనంతంబుఁ దేజోమయంబు
నాద్యమున్ విశ్వము పరంబునైనరూప
మిద్దిచూపించితిఁ బ్రసన్నహృదయుఁడనయి

48 క్రమత వేద యజ్ఞాధ్యయనముల దాన
ములఁ గ్రియల నుగ్రతరతపంబులనుగాని
ఎన్నఁగాఁ ద్వదన్యునిచేత నిట్టి నేను
గన నశక్యుఁడఁజూ నృలోకంబునందు.

---

తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే.

శ్రీభగవానువాచ :—

47 మయా ప్రసన్నేన తవార్జునేదం రూపంపరం దర్శిత మాత్మ యోగాత్, తేజోమయం విశ్వమనన్తమాద్యం యన్మేత్వదన్యేన న దృష్ట పూర్వమ్.

48 న వేదయజ్ఞాధ్యయనైర్న దానైర్నచక్రియాభి ర్నతపోభిరుగ్రైః, ఏవంరూప శ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వద న్యేనకురుప్రవీర!

49 ఇట్టి యీ ఘోరరూప మీక్షించి యెడఁద
వ్యథవలదు నీకు మూఢభావమునువలదు
భీతితొలఁగంగఁ బ్రీతిపరీతుఁడవయి
యిదిగొ నాదైన యా రూప మీవుఁ జూడు.

సంజయుఁడు :—

50 వాసుదేవుండు క్రీడికిఁ బలికియిట్లు
స్వీయమైనరూపంబుఁ జూపించె మఱల
వెండియు మహాత్ముఁడైన కృష్ణుండు భీతు
నర్జునుని నూఱడించె సౌమ్యతనుఁడగుచు.

---

49 మా తే వ్యథా మా చ విమూఢ భావో దృష్ట్వా రూపంఘోర
మీదృ జ్మ మేదమ్, వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ
మే రూపమిదం ప్రపశ్య.

సఞ్జయ ఉవాచ :—

50 ఇత్యర్జునం వాసుదేవ స్త థోక్త్వా స్వకం రూపం దర్శయామాస
భూయః, ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పునస్సౌ
మ్యవపు ర్మహాత్మా.

ఆర్జునుఁడు :—

51 జగదధీశ! జనార్దనా! సౌమ్యమైన
నీదు మానుషరూపమున్ దీనిఁగాంచి
మగుడ నేనిప్పుడు ప్రశాంతమానసుఁడను
ప్రకృతభావంబుఁజెందినవాఁడనైతి.

శ్రీభగవానుఁడు :—

52 కనఁగనేరికి శక్యముకాని యే మ
దీయరూపంబు వీక్షించితి విపుడీవు
నిత్య మారూపమున్ గనన్ దేవతలును
కోరుచుందురు నిక్కము కురువరేణ్య!

53 ఎట్లు నన్నును నీవు వీక్షించి తట్లు
ఫల్గునా! వేదములచేఁ దపంబుచేత

---

అర్జున ఉవాచ :—

51 దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః.

శ్రీభగవానువాచ:—

52 సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః.

53 నాహం వేదైర్నతపసా న దానేన న చేజ్యయా,

దానమున యజ్ఞమునఁ జూడఁ దగ్గవాఁడఁ
గాను జు మ్మిట్టివాఁడనౌ నేను నిజము.

54 అర్జునా! వింటివె? యనన్యమైనభక్తి
భావముకతంబునను యిట్టివాఁడనైన
నేను వాస్తవికంబుగన్ దెలియఁ జూడఁ
జొరఁగ శక్యుండ నగుదును జూ ధ్రువంబు.

55 నా నిమిత్తమై కర్మ లొనర్చుచుండి
ఫల్గునా! మత్పరుండు మద్భక్తుఁ డఖిల
సంగవర్జితుఁడున్ భూతసమితిని గత
వైరుఁడై యెవ్వఁ డుండు న న్బడయు వాఁడు.

---

---

శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా.

54 భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!

55 మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ!

---

# అధ్యాయము 12.

## భక్తియోగము.

అర్జునుఁడు :—

1 భక్తు లెవ్వరు సతతంబు యుక్తులగుచు
నిట్లు నిన్ను నుపాసింతు రెవ్వ రక్ష
రమగు నవ్యక్తమున్ గొల్తు రిమత వారి
లో నెవరు యోగవిత్తములో నుడువుము.

శ్రీభగవానుఁడు :—

2 నిలిపి నాయందు డెందమున్ నిత్యయుక్తు
లవుచు నన్ను నుపాసింతు రెవరు సతత
మధికమగు శ్రద్ధతోఁ గూడినట్టివారె
తలఁప నామతమున యుక్తతములు పార్థ!

---

ద్వాదశోఽధ్యాయః (భక్తియోగః)

అర్జున ఉవాచ :—

1 ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః?

శ్రీభగవానువాచ:—

2 మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః.

3 తివిరి యెవ రక్షరం బనిర్దేశ్యము మఱి
సర్వగతము కూటస్థ మచలము ధ్రువము
నైన యవ్యక్తముం బర్యుపాసనంబు
నంచితంబుగ బుద్ధిఁ గావించుచుంద్రొ.

4 ఇంద్రియగ్రామమును నిగ్రహించి నైచి
యన్నియెడలను సమబుద్ధులై మెలఁగుచు
సర్వభూతహితంబునన్ సక్తులగుచు
వారు పదపడి నన్నునే పడయుచుంద్రు.

5 తలఁప నవ్యక్తసక్తచేతస్కులైన
యట్టివారలకుం గ్లేశ మధికతరము
దేహవంతు లవ్యక్తగతిన్ భరపడి
బహుళకష్టంబుచేతను బడయఁగలరు.

---

3 యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే.
సర్వత్రగ మచిన్త్యఞ్చ కూటస్థ మచలం ధ్రువమ్.

4 సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః.

5 క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్త చేతసామ్,
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే.

6 సర్వకర్మముల్ నాయందు సన్యసించి
సంతతము మత్పరాయణస్వాంతులగుచుఁ
గడఁగి యెవ్వ రనన్యయోగంబుచేత
నన్ను ధ్యానించుచు నుపాసనం బొనర్తు.

7 పార్థ! వినుము మదర్పిత స్వాంతులైన
వారి నే నుద్ధరించెడి వాఁడ నగుదు
మృత్యురూపసంసారవారినిధి నుండి
యచిరకాలంబునందు నెయ్యంబు గదుర.

8 పార్థ! నాయందు డెందంబుఁ బాదుకొల్పు
బుద్ధియున్ గూడ నాయందుఁ బొందుఁబరపు
మవల నివసింపఁగలవు నాయందె ధ్రువము
ఇందు నొక్కించుకయు లేదు సందియంబు.

---

6 యే తు సర్వాణి కర్మాణి మయి సన్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే.
7 తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్.
8 మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః.

9 మానసమును నాయందు సమాహితం బొ
నర్పఁగాఁ జాలవేని ధనంజయ ! విను
క్రమముతోడి యభ్యాసయోగంబుచేత
నీవు నన్నును బడయంగ నిచ్ఛగింపు.

10 అర్జునా ! విను మట్టి యభ్యాసమందు
నీ వశక్తుఁడవగుదు వేనిన్ గడంగి
కమ్ము మత్కర్మ పరుఁడవు కర్మములను
నాకునై చేసి సిద్ధిఁబొందఁగఁగలవు.

11 అదియుఁ జేయ నశక్తుఁడ వగుదు వేని
అర్జునా ! నీవు మద్యోగ మాశ్రయించి
యవల వినియతచిత్తుఁడవై పరఁగుచు
నఖిలకర్మపరిత్యాగ మాచరింపు.

---

9 అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ!

10 అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి.

11 అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః,
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్.

12 అభ్యాసంబునకంటె శ్రేయమగుజ్ఞాన
మర్జునా ! జ్ఞానమునకంటె ధ్యానమెచ్చు
ధ్యానమునకంటెఁగూడ శ్రేయంబు కర్మ
ఫలపరిత్యాగ మద్దానఁ గలుగుశాంతి.

13 సర్వభూతంబులందు ద్వేషంబులేక
మైత్రి కరుణయుఁ గల్గి నిర్మమతఁ బరఁగి
యుల్లమందు నహంకార ముజ్జగించి
తుల్యసుఖదుఃఖుఁడు క్షమాయుతుండునగుచు.

14 నిచ్చ సంతుష్టుఁడున్ దృఢనిశ్చయుండు
సంయతాత్ముఁడుఁ బృథుయోగసంయుతుండుఁ
బొసఁగ మత్సమర్పితమనోబుద్ధియై త
నర్చు మద్భక్తుఁడగువాఁడు నాకుఁ బ్రియుఁడు.

---

12 శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్.

13 అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖసుఖః క్షమీ.

14 సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్సమే ప్రియః.

15 కలఁగ డెవ్వనికతన లోకం బెవండు
కలతఁజెందఁడు తాను లోకంబుకతన
మోదఖేదభయోద్వేగముక్తుఁడెవఁడు
వాఁడె చూ నాకుఁ బ్రియుఁడైనవాఁడు పార్థ!

16 దక్షుఁడు గతవ్యథుం డనపేక్షుఁడు శుచి
మఱి యుదాసీనుఁడునయి నేమంబుతోడ
నెల్లయారంభములఁ ద్యజియించి నాదు
భక్తుఁడగు నెవ్వఁడు ప్రియుండు వాఁడునాకు.

17 ఎవఁడు హర్షింపకుండు ద్వేషింపకుండుఁ
జింతిలకయుండు మఱి యపేక్షింపకుండు
శుభము నశుభంబు విడిచి భక్తిభరితుఁడయి
యుండు నాతఁడు నాకుఁ బ్రియుండు సూవె.

---

15 యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః.

16 అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః.

17 యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి,
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః.

18 సముఁడు మిత్రునియం దల శత్రునందు
సముఁడు నట్లె మానావమానములయందు
సముఁడు శీతోష్ణసౌఖ్య దుఃఖములయందు
సంగవర్జితుఁడున్ సాధుసత్త్వుండు.

19 నిందయందును బ్రస్తుతియందు సముఁడు
హాని యేదేనిదొరకినదానితోనఁ
దుష్టిఁగాంచువాఁడు వనికేతుఁడు స్థిరమతి
యునగుభక్తజనుండు ప్రియుండు నాకు.

20 ధర్మ్య మమృతంబునైన యిద్దాని బూని
యెవ్వరు యథోక్తముగ నుపాసింత్రో వారు
శ్రద్ధధానులు మత్పరస్వాంతులున్ మ
దీయభక్తులు నాకు నెంతేని బ్రియులు.

---

18 సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః.

19 తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియోనరః.

20 యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మేప్రియాః.

## అధ్యాయము 13.

క్షేత్ర, క్షేత్రజ్ఞ, విభాగ యోగము.

శ్రీభగవానుఁడు :—

1 తెలియుమిా శరీరంబు కుంతీతనూజ !
క్షేత్రమనినిశ్చయించి వచింపఁబడియె
దీని నెవ్వఁ డెఱుంగునో వానినిన్ వ
చింత్రు క్షేత్రజ్ఞుఁడని తద్విశేషవిదులు.

2 అఖిలములగు క్షేత్రమ్ములయందుఁగూడఁ
గవ్వడీ ! నన్ను క్షేత్రజ్ఞుఁగాఁ దెలియుము
సదమలమగు క్షేత్రక్షేత్రవిదులదైన
జ్ఞానమే జ్ఞానమనియును నామతంబు.

---

త్రయోదశోఽధ్యాయః. (క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగః)

శ్రీభగవానువాచ:—

1 ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభిధీయతే,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః.

2 క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ.

3 ఏది ? యా క్షేత్రమెట్టిది ? యే వికార
ములుగలట్టిద ? యెందుండికలిగె ? నెట్లు ?
వాఁడు నెవఁ డే ప్రభావఁబువాఁడో ? తత్స
కలము మొత్తంబుమీఁద నావలన వినుము.

4 పెక్కువిధముల ఋషులచే వివిధములగు
శ్రుతివితానమ్ములఁ విస్పష్టతములు మఱి
ప్రకటహేతుమంతంబులౌ బ్రహ్మసూత్ర
పదముల సుగీతమైనది యది తలంప.

5 తలఁచిచూడ మహాభూతములును మఱి య
హంకృతియు నిట్లె బుద్ధి యవ్యక్త మవల
షల్గునా ! యింద్రియంబులు పదియు నొకటి
క్రమముతోడుత నింద్రియార్థంబు లైదు.

---

3 తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చయత్.
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు.

4 ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః.

5 మహాభూతా న్యహఙ్కారో బుద్ధిరవ్యక్తమేవ చ,
ఇన్ద్రియాణి దశైకఞ్చ పఞ్చ చేన్ద్రియగోచరాః.

6 సొరిది నిచ్ఛయు ద్వేషంబు సుఖము దుఃఖ
మునిఁక సంఘాత మట్లె చేతనయు ధృతియుఁ
జెలఁగి సవికారమైన యీ క్షేత్రమిట్టు
లర్జునా ! సంగ్రహముగ నుదాహృతంబు.

7 మానగ్రస్తుఁడు కామి దంభంబు లేమి
హింసఁ జేయమి క్షాంతియు ఋజుగతియును
క్రమత నాచార్యసముపాసనమును శౌచ
నియతి స్థైర్యంబు నాత్మవినిగ్రహంబు.

8 ఇంద్రియార్థంబులందును దృఢవిరక్తి
యవలఁ దలపోయఁగా ననహంకృతియును
జన్మమందు మృత్యువునందు జరను వ్యాధు
లం గడున్ దుఃఖదోషంబులం గనుటయు.

---

6 ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనా ధృతిః,
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్.

7 అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవం,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః.

8 ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్.

9 భోగములయందు నాసక్తిఁ బూనకుని
దారపుత్రగృహాదులన్ దగులువడమి
యిష్టము లనిష్టముల్ సంభవించినతఱి
నిరతమున్ సమచిత్తుఁడై పరఁగుటయును.

10 క్రమత నాయం దనన్యయోగమునఁ జేసి
వ్యభిచరింపక యుండెడు నట్టిభక్తి
పావనవివిక్త దేశసంసేవితయును
జనసమూహమునందుఁ బ్రసక్తి లేమి.

11 నిశ్చలాధ్యాత్మికజ్ఞాన నిత్యతయును
తాత్త్వికజ్ఞానరూపార్థదర్శనంబు
నిదియె జ్ఞానమటంచు వచింపఁబడును
దీనికంటె నన్యంబ దజ్ఞానముగును.

---

9 అసక్తి రనభిష్వఙ్గః పుత్త్రదారగృహాదిషు,
నిత్యఞ్చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు.

10 మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్త దేశసేవిత్వ మరతి ర్జనసంసది.

11 అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనం,
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽ న్యథా.

12 జ్ఞేయమెయ్యదియో దాని జెప్పెద విను
తా నమృతమొందుఁ బురుషుండు దీని దెలిసి
మత్పర మనాదియైనబ్రహ్మంబు సత్తుఁ
గా మఱి యసత్తుఁగాఁగఁ బల్కంగఁబడదు.

13 అంతటన్ బాణిపాదసమన్వితంబు
నంతట న్నేత్రశీర్షముఖాభ్యుపేత
మంతటన్ గూడ శ్రుతిమంతమగుచునద్ది
యెల్లనున్ లోకమున నావరించియుండు.

14 పార్థ! సర్వేంద్రియగుణావభాసము సక
లేంద్రియవివర్జితంబునై యొసగునదియుఁ
దగ నసక్తము సర్వముఁ దాల్చునదియు
గుణవిరహితంబు గుణములన్ గుడుచునదియు.

---

12 జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే.

13 సర్వతఃపాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖం,
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి.

14 సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితం,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ.

15 భూతముల వెలిలోపలన్ బొదలునదియు
స్థావరము జంగమంబునై తనరునదియుఁ
బూని సూక్ష్మతన్ దెలియంగరానియదియు
నంతికస్థమున్ దూరస్థమైనయదియు.

16 ప్రథితభూతంబులం దవిభక్తమయ్యుఁ
బాండవ! విభక్తమైనయట్లుండునదియు
నఖిలభూతంబులన్ దాల్చునది గ్రసించు
నది సృజించునదియును జ్ఞేయం బదియగు.

17 తమముకంటెఁ బరంబయి తనరునద్ది
జ్యోతులకు జ్యోతియని చెప్పుచుంద్రు బుధులు
జ్ఞానముఁ మఱి జ్ఞేయంబు జ్ఞానగమ్య
మెల్లహృత్సీమలం దధిష్ఠించియుండు.

---

15 బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవ చ,
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్.

16 అవిభక్తఞ్చ భూతేషు విభక్త మివ చ స్థితం,
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ.

17 జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య నిష్ఠితమ్.

18 ఇట్లు క్షేత్రంబు జ్ఞానంబు నట్లె జ్ఞేయ
మర్జునా ! చెప్పఁబడె సంగ్రహముగ నీకు
దీని మద్భక్తుఁడగువాఁడు తా నెఱింగి
కొన్న మద్భావమున కుపపన్నుఁడగును.

19 కురువతంసమ ! ప్రకృతిని బురుషుఁగూడ
నుభయుల ననాదులుగఁ దెలియుము కడంక
వికృతులగుణంబులన్ గూడ విశదఫణితి
ప్రకృతిసంభవములుగ నేర్పడఁ దెలియుము.

20 కార్యకారణకర్తృత్వకారణముగఁ
బ్రకృతి తత్ జ్ఞులచే వచింపఁగఁబడును
కిరీడి ! విను సుఖదుఃఖభోక్తృత్వమందుఁ
గారణముగఁ జెప్పఁబడుఁ బూరుషుండు.

---

18 ఇతి క్షేత్రం తథాజ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే.

19 ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్.

20 కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే.
పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే.

21 అనుభవించును బ్రకృతిస్థుఁడై పురుషుఁడు
ప్రకృతిజములగు గుణములఁ బార్థ! వింటె?
సర్వవిధసదసద్యోనిజన్మలందు
హేతువగుఁజూవె గుణసంగ మాతనికిని.

22 క్రమమునన్ ఫల్గునా! యుపద్రష్టయు నను
మంత భర్తయు భోక్తయు మఱి మహేశ్వ
రుండుఁ బరమాత్మయనియుఁ బరుఁడగు పురుషుఁ
డీ శరీరమునన్ వచియింపఁబడును.

23 కనఁగఁ బురుషుని బ్రకృతిని గుణయుతముగ
నిత్తెఱంగునఁ గౌంతేయ! యెవ్వఁ డెఱుఁగు
నెల్లవిధములఁ జెలఁగి వర్ధిల్లునట్టి
వాఁడె యయ్యు జనింపండు వాఁడు మగుడ.

---

21 పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు.

22 ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః.

23 య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే.

24 ఆత్మ నీక్షింతురి కొందఱు ధ్యానమునను
అన్యులగువారు కాం త్రాత్మ నాత్మచేతఁ
గాంతు రితరులు సాంఖ్యయోగంబుచేతఁ
గర్మయోగంబుచేఁ బరుల్ గాంచుచుంద్రు.

25 ఇట్లుఁదెలియని వారలై యితరజనులు
పర్యుపాసింతు రన్యుల వలనను విని
కవ్వడీ! వారలుంగూడ క్రిమముతోడ
శ్రుతిపరాయణులై మిత్తి నతితరింత్రు.

26 స్థావరమొ జంగమమొ యగు జంతు వెంత
స్వల్ప పరిమితికల దేది జననమొందు
మదిఁ దెలియుము క్షేత్రక్షేత్రవిదులదైన
యట్టి సంయోగముననె యదంచుఁ బార్థ!

---

24 ధ్యానేనాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా,
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే.

25 అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః.

26 యావ త్సఞ్జాయతే కిఞ్చి త్సత్త్వం స్థావరజఙ్గమం,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ!

27 సర్వభూతంబులందును సమముగాఁగ
నుండు చయ్యవి నశియించుచుండఁ దా న
శింపకుండెడు పరమేశు నే జనుండు
కాంచుచుండునొ యాతండె కాంచువాఁడు.

28 అంతట న్నిండియుండినయట్టివాని
సముని నీశ్వరుఁ జూచుచున్ జనుఁ డొకఁడు
నాత్మచే నాత్మహింసఁ జేయఁ దలఁపఁడు
పరమమగుగతి నాపైని బడయు నతఁడు.

29 కర్మములనెల్ల సర్వప్రకారములుగఁ
బ్రకృతిచేతన సల్పంగఁబడినవాని
గాఁగ నాత్మ నకర్తనుగాఁగ నెవఁడు
చూచుచుండునొ యాతండె చూచువాఁడు.

---

27 సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం,
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి.

28 సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం,
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్.

29 ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి.

30 జనుఁడు భూతపృథగ్భావమును గడంగి
యెప్పు డేకస్థముగ సమీక్షించుచుండు
దానఁ జేసియు మిగుల విస్తారమైన
బ్రహ్మభావంబునప్పుడు పడయఁగలఁడు.

31 అవ్యయుఁడు పరమాత్ముఁ డనాదియగుట
నిర్గుణుఁడునౌటఁ జేసి కౌంతేయ! నిక్క-
మరసిచూడ శరీరస్థుఁడయ్యు నతఁడు
కర్తయునుగాఁడు లిప్తుఁడున్ గాఁడు కాదె?

32 సర్వగతమయ్యు నెట్లు సౌక్ష్మ్యంబుకతన
నాకసం బుపలిప్తంబుఁ గాకయుండు
నట్లె యంతటనున్నదియయ్యు నాత్మ
యనుపలిప్తమైయుండు దేహంబునందు.

---

30 యదా భూతపృథగ్భావ మేకస్థమనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా.

31 అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాఽయమవ్యయః,
శరీరస్థోఽపి కౌన్తేయ! న కరోతి న లిప్యతే.

32 యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే.

33 ఎట్లు సూర్యుఁ డీ లోకము నెల్ల నొక్క-
రుఁడు ప్రకాశంబుఁ జేయు నర్జున! సమస్త
మైనక్షేత్రమున్ క్షేత్రియు నట్లె తాను
చేవమీఱఁ బ్రకాశింపఁ జేయుచుండు.

34 విశదగతిని క్షేత్ర క్షేత్రవిదుల యంత
రంబు నెవ్వరు జ్ఞాన నేత్రమునఁ గందు
రొనసి; భూతప్రకృతి మోక్షమును దెలియుదు
రందురు వార లుత్కృష్టమైనగతిని.

---

33 యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోకమిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత!
34 క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాన్తి తే పరమ్.

# అధ్యాయము 14.

## గుణత్రయ విభాగ యోగము.

శ్రీభగవానుఁడు:—

1 మౌను లెల్లరుఁగూడ నెద్దాని నెఱిఁగి
పడసి రిందుండి ముక్తులై పరమగతిని
జ్ఞానములలో మహోత్తమమైనయదియుఁ
బరమమునగు జ్ఞానముఁ జెప్పువాఁడ మగుడ.

2 అమలమైన యీ జ్ఞానము నాశ్రయించి
మత్సమానధర్మత్వముం బడయువారు
సృష్టియందేనియున్ జనియింపఁబోరు
వ్యథనుబొందరు ప్రళయంబునందుఁ గూడ.

---

చతుర్దశోఽధ్యాయః (గుణత్రయ విభాగయోగః)

శ్రీభగవానువాచ :—

1 పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమం,
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధి మితో గతాః.

2 ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః,
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ.

3 అల మహద్రూపమైన బ్రహ్మంబునాదు
యోనియగు నందు గర్భంబు నుంతునేను
దానినుండియె సర్వభూతంబులకును
సంభవం బగు భరతవంశప్రదీప !

4 అర్జునా ! సర్వయోనులయందు మూర్తు
లెవ్వి సంభవమగు వానికెల్ల యోని
యగు మహద్రూపమైన బ్రహ్మంబు నేను
తలఁప బీజప్రదుఁడనగు తండ్రి నగుదు.

5 ప్రకృతి సంభూతములగు సత్త్వము రజంబు
తమము నాఁజను గుణములు క్రమముతోడ
దేహమం దవ్యయుండగు దేహధారిఁ
గట్టివేయు మహాభుజా ! కదలకుండ.

---

3 మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం.
సమ్భవస్సర్వభూతానాం తతో భవతి భారత!

4 సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయస్సమ్భవన్తి యాః,
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా.

5 సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః,
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్.

6 అందుఁ గడు నిర్మలంబైన దగుటఁ జేసి
సత్త్వము నిరామయముఁ బ్రకాశకము నగుచు
జ్ఞానసంగంబునను సుఖసంగమునను
దేహధారిని పార్థ ! బంధించుచుండు.

7 అనఘచరిత ! తృష్ణాసంగజనితమగు ర
జంబు నెఱుఁగుము రాగాత్మకంబుఁగాఁగఁ
గవ్వడీ ! విను కర్మ సంగమునఁ జేసి
దేహి నయ్యది పేర్చి బంధించుచుండు.

8 మఱియు నజ్ఞానజమగు తమంబు నెఱుఁగు
సర్వదేహులకున్ మోహజనకముగను
సత మది ప్రమాదమున నలసతను నిద్ర
దేహినిఁ గట్టివేయుఁ గౌంతేయ ! వింటె ?

---

6 తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయం,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ!

7 రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవం,
తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్.

8 తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం,
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత!

9 సత్త్వము సుఖంబునందు సంసక్తిఁజేయు
రజము సంసక్తిఁజేయుఁ గర్మంబునందు
నర్జునా! మించి జ్ఞానంబు నావరించి
తమము వెసఁగూర్చెడున్ బ్రమాదంబునందు.

10 రజముఁ దమమునుగూడఁ బరాభవించి
సత్త్వ ముత్కృష్టమగును రజంబు కూడ
నట్లె సత్త్వతమంబుల నతిశయించుఁ
దమమునుంచేర్చు సత్త్వరజముల మిగిలి.

11 అర్జునా! యీశరీరంబునందు సర్వ
ములగు ద్వారంబులఁ బ్రకాశము మఱి జ్ఞాన
మెప్పుడు జనించుచుండునో యప్పుడటఁ బ్రి
వృద్ధమయ్యె సత్త్వమ్మని యెఱుఁగఁగ నగు.

---

9 సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత!
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత.

10 రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత!
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజ స్తథా.

11 సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత.

12 భరతముఖ్య ! రజోగుణ మురవడించి
తొడరి యభ్యుదయంబుఁ జెందుడును లోభ
మును బ్రవృత్తి కర్మారంభమును నశాంతి
స్పృహాయు ననఁబడునివి జనియించుచుండు.

13 కురుకులవతంసమా ! తమోగుణము వృద్ధి
నందుటయు నప్రకాశంబు నప్రవృత్తి
యును బ్రమాదంబు మఱి మోహమనఁగఁబడెడు
నియ్యవి క్రమంబుతో జనియించుచుండు.

14 వినుము సత్త్వగుణమ్ము పరివృద్ధమగుడుఁ
దాను మృతినొందుచో దేహధారి పార్థ !
అపుడె పాయ కుత్తమ విదులైనవారి
యమలములగులోకంబుల నందుఁ జూవె.

---

12 లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణా మశమః స్పృహా,
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ!

13 అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన!

14 యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్.
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే.

15 ఫల్గున! రజోగుణమ్మునన్ బ్రళయ మొంది
జననముం బొందెడున్ గర్మసంగులందు
నట్టులె తమోగుణమ్మున నస్తమించి
యుద్భవం బందెడున్ మూఢయోనులందు.

16 సాత్త్విక సుకృతకర్మకు సాత్త్వికంబు
నిర్మలము నైనది ఫలంబని వచియింత్రు
దుఃఖము రజంబునకుఁ జెప్పుదురు ఫలముఁగఁ
గ్రమత నజ్ఞానము తమఃఫలముగ నంద్రు.

17 జ్ఞాన ముదయించు సత్త్వగుణంబువలన
నుడుగక రజోగుణంబునన్ బొడము లోభ
మట్టులె తమోగుణమ్మునఁ బుట్టుఁ గ్రమముఁ
గాఁ బ్రమాదంబు మోహ మజ్ఞానము నిటు.

---

15 రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే,
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే.

16 కర్మణస్సుకృతస్యాహుః స్సాత్త్వికం నిర్మలం ఫలం,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్.

17 సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ.

18 ఒనర సాత్వికుల్ వోవుదు రూర్ధ్వమునకు
నుండు రల రాజసులు మధ్యమందుఁ బార్థ!
ధీరత న్నికృష్టగుణవృత్తిస్థులగుచు
నేగుదురు తామసులు తా రధోగతికిని.

19 కర్త నెవ్వాడు గుణములకన్న నన్యుఁ
దాను బొడఁగాంచకుండునో ద్రష్టయగుచు
మఱి గుణంబులకంటె నాత్మం బరునిగఁ
దెలియునో యప్డు నాదుగతిం బడయును.

20 దేహసంభూతములగు నీ త్రిగుణములను
దేహధారిగడంక నతిక్రమించి
జన్మమృత్యుజరాదుఃఖచయవిముక్తుఁ
డగుచుఁ బరువడి నమృతంబు నందఁగలఁడు.

---

18 ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యేతిష్ఠన్తి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసాః.

19 నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి.

20 గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే.

అర్జునుఁడు :–

21 దేవ ! యీ త్రిగుణముల నతిక్రమించి
నట్టిఁ డే లక్షణంబుల నలరుచుండు ?
నెట్టి యాచారములుఁగలయట్టివాఁడు ?
ఎట్టు లీ మూఁడుగుణముల నెట్లతిరుగు ?

శ్రీభగవానుఁడు :–

22 విను కురూత్తంసమ ! ప్రకాశమును బ్రవృత్తి
యును బదంపడి మోహంబు ననెడువాని
బ్రాప్త మగునెడ ద్వేషభావంబుఁ గొనఁడు
రానివానిని మదిని గోరం డొకింత.

23 ఎవఁడు కదలింపఁబడఁడో తా నీ గుణముల
చే నుదాసీనుభంగి నాసీనుఁ డగుచు

---

అర్జున ఉవాచ:–

21 కైర్లిఙ్గైస్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో!
కిమాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే.

శ్రీభగవానువాచ :–

22 ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ!
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి.

23 ఉదాసీనవ దాసీనో గుణైర్యో న విచాల్యతే,

వర్తిలు గుణంబులంచు భావమ్మునందు
నెంచి యెవఁ డుండుచున్ జలియింపకుండు.

24 తుల్య దుఃఖసుఖుండు స్వస్థుండు తుల్య
రూపలోష్టాశ్మచామీకరుండు సముఁడు
ప్రియములందుఁ దలంప నప్రియములందు
ధీరుఁడున్ దుల్యనిందాస్తుతిక్రముండు.

25 సముఁడు నిచ్చ మానావమానములయందు
సముఁడు మిత్రవిద్వేషిపక్షములయందు
నెల్లయారంభములఁ ద్యజియించినట్టి
యతఁడె యెన్న గుణాతీతుఁ డనఁగఁబడును.

26 భారతోత్తమ! యవ్యభిచారభక్తి
యోగమున న న్నుపాసించుచుండు నెవ్వఁ

---

గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే.

24 సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మ కాఞ్చనః,
తుల్య ప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః.

25 మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే.

26 మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,

డాతఁ డీ మూఁడుగుణముల నతకరించి
యవల బ్రహ్మత్వమునకు సమర్థుఁడగును.
27 అమృత మవ్యయమునగు బ్రహ్మమ్మునకును
మఱియు శాశ్వతమైన ధర్మమ్మునకును
గరిమ నైకాంతికమగు సుఖమ్మునకును
నేఁ బ్రతిష్ఠను జుమ్మ కౌంతేయ ! నమ్మ.

## అ ధ్యా య ము 15.

### పురుషోత్తమ యోగము

శ్రీభగవానుఁడు :—

1 సరగ నూర్ధ్వమూలము నధశ్శాఖయునయి
యలరు నశ్వత్థమున్ జెప్పిరవ్యయముగ
దాని పత్రంబు లరయ ఛందంబు లగును
దాని నెఱిఁగినవాఁడె వేదవిదుఁడగును.

---

స గుణా న్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.
27 బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృతస్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ.

పఞ్చదశోఽధ్యాయః. (పురుషోత్తమయోగః)

శ్రీభగవానువాచ :—

1 ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం,
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్.

2 విషయపల్లవముల్ గుణవృద్ధములగు
దానిశాఖలు క్రిందమీఁద న్నిగిడెడు
మూలము లుపర్యధోభాగములకుఁ బ్రాకు
మనుజలోకంబునందుఁ గర్మములఁబట్టి.

3 దీని రూపటు లభ్యంబుకాని దిందు
నాది యంతము స్థితి దీని కరయ లేవు
దృఢమగు నసంగహేతి నుత్కృష్టమూల
మైన యశ్వత్థ వృక్షముఁ దీని నఱికి.

4 ఎవనివలనఁ బురాతనమవు ప్రవృత్తి
జరుగునయ్యాదిపురుషుఁడే శరణ మనుచు
రారెటన్ జేరుకొన్నట్టివారు మగిడి
యా పదము నాపయి న్నను కాడవలయు.

---

2 అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్యశాఖాగుణప్రవృద్ధా విషయప్రవాళాః
అధశ్చమూలాన్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే.

3 న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా, అశ్వత్థమేనం సువిరూఢమూలమసఙ్గశస్త్రేణదృఢేనఛిత్వా.

4 తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా ననివర్తన్తిభూయః.
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.

5 పార్థ! మానమోహంబులఁ బాసి సంగ
దోష ముడిగి యధ్యాత్మనిత్యులు నివృత్త
కాములున్ ద్వంద్వముక్తులై కాంతు రవ్య
యమగు నాపదమున్ విమోహంబు తొలఁగ.

6 దేని జేరినవారలు తిరిగిరారొ
యయ్యదియె నాదగు పరమమైనపదము
దాని భాసింపఁజేయ నంతయు వలఁతులు
కారు సూర్యచంద్రాగ్నులుఁ దారు తలఁప.

7 జీవలోకంబునందును జీవుఁడయ్యె
మామకీనసనాతనాంశమ్మె సుమ్ము
మానుగఁ బ్రకృతిస్థముల్ మనసుతోడ
నాఱునైనట్టి జ్ఞానేంద్రియములఁ దివియు.

---

5 నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయ
న్తత్.

6 న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః,
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ.

7 మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః.
మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి.

8 గంధముల నాశయమునుండి గంధవాహుఁ
డెట్లుకొనిపోవుచుండునో యట్లె తాను
దనువుఁబొందినయప్పుడుఁ దనువునుండి
నిష్క్రమించెడునపుడు వీనిఁగొనిపోవు.

9 పార్థ! శ్రోత్రము నేత్రమున్ స్పర్శనమును
రసనమును ఘ్రాణమును సమగ్రంబుఁగాఁగ
మానసమ్ము నధిష్ఠించి తా నితండు
విషయములనన్నిటి నుపసేవించుచుండు.

10 ఉత్క్రమించెడువాని నే నున్నవాని
నేనియు ననుభవించెడువాని నేని
గుణసమన్వితు నేని మూర్ఖులు దెలియరు
చూడనేర్తురు జ్ఞానచక్షులగువారు.

---

8 శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్.

9 శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే.

10 ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితం,
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః.

11 ఫల్గునా ! తమయందు నవస్థితుఁడగు
నితనియత్నించువారలై యతులు కంద్రు
అకృతచిత్తుల్ గతజ్ఞానులగుచుఁ గాన
లేరు సుమ్మాత్మను యతించువార లయ్యు.
12 వెలుఁగఁజేయు నెయ్యది యీ యఖిలజగంబు
నా ప్రభాకరసంబంధమైన తేజ
మమృతభానుని తేజంబు నగ్ని తేజ
మెఱుఁగుమా మామకంబని యీవు పార్థ !
13 భూమియందు నావేశించి భూతసంచ
యమును నేను ధరింతు మహౌజమునను
జూడ నేను రసాత్మకసోముఁడనయి
పోషణముఁ జేయుచుందు సర్వౌషధులను.

---

11 యతన్తో యోగినశ్చైనం పశ్య న్త్యాత్మ న్యవస్థితం,
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః.
12 యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్.
13 గామావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా,
పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః.

14 ఫల్గునా! వినునేను వైశ్వానరుండ
నగుచుఁ బ్రాణులదేహంబు నాశ్రయించి
శక్తి మెఱయఁ బ్రాణాపానయుక్తిని బచ
నమ్మొనర్తుఁ జతుర్విధాన్నమును గ్రమత.

15 సర్వ హృదయంబులందు నే సన్నిహితుఁడ
నావలన నగు స్మృతియు జ్ఞానము నపోహ
నిఖిలవేదవేద్యుండను నేను జూవె
వేదవిదుఁడ నే వేదాంతవిధికరుండ.

16 క్షరుఁడు నక్షరుఁడనఁగ లోకంబునందుఁ
బూరుషులు వీర లిద్ద్వరే పోల్చిచూడ
సర్వభూతవితానము క్షరమనఁబడు
నక్షరుండని కూటస్థుఁ డనఁగఁబడును.

---

14 అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్.

15 సర్వస్యచాహంహృదిసన్నివిష్టోమత్తస్స్మృతిర్జ్ఞానమపోహనంచ,
వేదైశ్చసర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్.

16 ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,
క్షరస్సర్వాణిభూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.

17 ఈశ్వరుం డవ్యయుండునై యెవఁడు తాను
జొచ్చిలోకత్రియమ్ముఁ దాల్చు ననువొప్ప
నట్టి యుత్తమపూరుషుఁ డన్యుఁడు పర
మాత్మయనుచు నుదాహృతుఁడగును పార్థ !
18 ఎందుచే క్షరుకంటె నతీతుఁడ మఱి
యక్షరునికంటె శ్రేష్ఠుఁడనైతిఁ బార్థ !
అందుచేతనె లోకంబునందు వేద
మునఁ బ్రసిద్ధుఁడఁ బురుషోత్తముఁడ నటంచు.
19 ఎవఁడు నన్ను నసమ్మూఢుఁ డవుచుఁ దెలియ
నేర్చుఁ బురుషోత్తమునిగాఁగ నిపుణత మెయి
సర్వవిదుఁడయి యాతఁడు సర్వభావ
ముఁన నజస్రము భక్తిమై నను భజించు.

---

17 ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః.
18 యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః.
19 యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమం,
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత!

20 ఇట్టి గుహ్యతమంబైనయట్టి శాస్త్ర
మిది వచించితి నీకు నే హితముఁ గోరి
దీని నెఱిఁగి నరుండు బుద్ధియుతుఁడుఁ జరి
తార్థుఁడునయి యొప్పారుఁ బృథాతనూజ!

---

## అధ్యాయము 16.

### దైవాసుర సంపద్విభాగయోగము.

శ్రీభగవానుఁడు :—

1 నుడివెదన్ విను మభయమున్ శుద్ధసత్త్వ
భావమున్ జ్ఞానయోగవ్యవస్థితియును
దానము దమంబు యజ్ఞమున్ దలఁచిచూడ
నటులె స్వాధ్యాయముఁ దపంబు నార్జవంబు.

---

20 ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయానఘ!
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత!

---

షోడశోఽధ్యాయః (దైవాసురసమ్పద్విభాగయోగః)

శ్రీభగవానువాచ :—

1 అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్.

2 కురువర! యహింస సత్య మక్రోధముఁ దలఁ
పంగఁ ద్యాగంబు శాంతి యపైశునంబుఁ
జాలఁగా భూతదయయు నలోలుపతయు
మృదుతయు నచాపలంబును హ్రీయు మఱియు.

3 తేజ మట్టులె క్షమయును ధృతియు శుచిత
మఱియు నద్రోహము న్నాతిమానితయును
పాండవా! దైవసంపదంబట్టి పుట్టి
నట్టివానికిఁ గలుగు సు మ్మారయంగ.

4 వినుమిటుల్ దంభమున్ దర్పము నభిమాన
మరయ నట్టులె క్రోధంబుఁ బరుషతయును
అవలయజ్ఞానమున్ గల్గు నాసురమగు
సంపదంబట్టిపుట్టిన జనములకును.

---

2 అహింసా సత్య మక్రోధ స్త్యాగశ్శాన్తి రపైశునం,
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్.

3 తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా,
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత!

4 దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపదమాసురీమ్.

5 పాండుతనూజ! దైవసంపత్తి మోక్షమునకు
నాసురంబు బంధంబున కగు నిజమ్ము
ఫల్గునా! నీవు దైవసంపత్తిఁబట్టి
పుట్టినాఁడవు వగవంగఁబోకు మెడఁద.

6 పార్థ! యీ లోకమందు దైవంబు నాసు
రమ్మనని రెండె భూతసర్గములుఁ గలవు
విస్తరించి దైవమును జెప్పితిని నీకు
నాసురమ్ముఁ జెప్పెదనిఁక నాలకింపు.

7 తెలియఁజాలరుగా ప్రవృత్తిని నివృత్తి
నర్జునా! సుంత యాసురులైన జనులు
వారియందు శౌచమ్ము నాచారనియతి
సత్యమున్ గల్గఁబోవు నిశ్చయము సుమ్ము.

---

5 దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా,
మా శుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ!

6 ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు.

7 ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే.

8 పలుకుచుందురు జగమును వా రసత్య
మప్రతిష్ఠ మనీశ్వరం బరయఁగా మి
థునజనితమును గాను హైతుకము మఱియుఁ
దదితరమగు కారణము లేనిదియు ననుచు.

9 దృష్టి సిద్ధానిబూని వినష్టచిత్తు
లల్పమతు లుగ్రకర్ములు నహితులునయి
సవ్యసాచీ! జగద్వినాశంబునకును
తారుప్రభవించుచుందురు వారు నిజము.

10 కడఁకఁ బూరింపఁగారాని కామ మూని
యూపయుని దంభమానమదాన్వితులయి
మోహమునఁ జేసి తా రసద్గ్రాహములను
జేకొని మెలంగుచుం ద్రశుచివ్రతులయి.

---

8 అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరం,
అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్.

9 ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః.

10 కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః.

11 ప్రళయమంతముకలదియుఁ బరిమితి నిడ
నలవికానిదియగుచింత నాశ్రయించి
కామభోగంబె పరమంబుఁగాఁ దలఁచుచు
'నింతమాత్రమె' యని నిశ్చయించుకొనుచు.

12 అతితరముగ నాశాపాశశతముల న్ని
బద్ధులగుచుఁ గామక్రోధపరులగుచును
కామభోగార్థ మర్థనికాయముల న
పక్రమమున గడింప నుపక్రమింత్రు.

13 పొందఁబడియె నాచేత నిపు డిది మఱియుఁ
గోరి పొందుదు నే నీ మనోరథంబు
నిదికలదునాకు మఱి ధన మిదియుఁగూడఁ
దలఁచిచూడఁగ నిఁకమీఁదఁ గలుగఁగలదు.

---

11 చింతామపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః.

12 ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థసంచయాన్.

13 ఇదమద్య మయాలబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథం,
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్.

14 శాత్రవుఁడితండు నా చేతఁజంపఁబడియె
నితరులగు శాత్రవుల వధియింపఁగలను
ఈశ్వరుఁడ నేను భోగిని నేను మఱియు
నేను సిద్ధుఁడ నేబలిష్ఠను సుఖిని.

15 నేధనాఢ్యుఁడ నభిజనాన్వితుఁడ నేన
యెంచిచూడ నాతోసముఁ డెవఁడు కలఁడు
జన్న మొనరింతు దానమొసఁగుదు ముదముఁ
బొందుదు నటంచు నజ్ఞానమోహితులయి.

16 బహుళచిత్త వికార విభ్రాంతులు ఘన
మోహజాలసమావృతాత్ములు నపార
కామభోగప్రసక్తులునై మెలంగి
కూలుదు రమేధ్యనారకకూపమునను.

---

14 అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ.

15 ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.

16 అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ.

17 అర్జునా! ధనమానమదాభ్యుపేతు
లాత్మ సంభావితులు స్తబ్ధులైనవారు
నామమాత్రములైనయజ్ఞముల దంభ
మున యజించుచుందు రవిధిపూర్వకముగ.

18 వినుము పార్థ! యహంకారమును బలమును
దర్ప మట్లె కామంబుఁ గ్రోధంబుఁగూడి
యాత్మపరశరీరంబులయందు నన్ను
నీసడించుచు వారు ద్వేషించుచుంద్రు.

19 క్రూరులు న్నన్ను ద్వేషించువారు మిగుల
నశుభులునయివర్తిలు నన్నరాధములను
సారెసారెకు ఘోరసంసారములను
నుఱక నెట్టుదు నాసురయోనులందు.

---

17 ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామ యజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్.

18 అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః.

19 తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు.

20 మూఢులగువారు ప్రతిజన్మమున నవశత
నాసురమగుయోనిం బొందినట్టివార
లగుచు నన్నునుబొందకే యర్జునా! య
నంతరముఁ బొందుచుంద్రు వా రధమగతిని.

21 నరకమునకు ద్వారంబుఁగా నాత్మనాశ
కంబునైన కామంబుఁ గ్రోధంబును మఱి
లోభమను త్రివిధమ్ముఁ జెల్లుం దలంపఁ
గాన నీమూఁడిటిఁద్యజింపఁగావలయును.

22 భారతర్షభ! యీ తమోద్వారములగు
మూఁటిచేత నరుండు విముక్తుఁడగుచుఁ
దనకునై శ్రేయమున్ గూర్చుకొనుచు మఱియుఁ
బరమమైనగతిన్ బదంపడిపడయును.

---

20 ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాంగతిమ్.

21 త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్.

22 ఏతైర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్.

23 క్రీడి ! విను శాస్త్రవిధిని బరిత్యజించి
యెవ్వఁ డిటుఁ గామపరత వర్తించుచుండు
నతఁడు సంసిద్ధినింబడయంగఁజాలఁ
డట్లె సుఖముం బరమగతి నందలేఁడు.

24 కాన పార్థ ! శాస్త్రమ్ము ప్రమాణమగును
నీకు సర్వకార్యాకార్యనిర్ణయముల
ననఘ ! శాస్త్రవిధానోక్తమైనదాని
నెఱిఁగి యిటుఁ గర్మ లొనరింప నీవుఁదగుదు.

---

23 యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.
24 తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి.

# అధ్యాయము 17.

## శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జునుఁడు :—

1 ఎవరు శాస్త్రవిధిన్ద్వ్యజియించి శ్రద్ధ
తోడఁగూడువారై యజింతురు సతంబు
వారికి న్నిష్ఠ యేదగు ? వాసుదేవ !
సాత్వికమొ ! రాజసమొ ! తామసంబొ ! చెపుమ.

శ్రీభగవానుఁడు :—

2 ఫల్గునా ! దేహులకును స్వభావజన్య
మైనయా శ్రద్ధ త్రివిధమౌ నరసిచూడ
"సాత్వికము రాజసము తామసం"బటంచుఁ
దెల్పెదను దాని యుత్పత్తి తెలియుఁగువినుము.

---

సప్తదశోఽధ్యాయః. (శ్రద్ధాత్రయ విభాగయోగః)

అర్జున ఉవాచ:—

1 యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వమాహోరజస్తమః.

శ్రీభగవా నువాచ:—

2 త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు.

3 యాఁడిఁ బార్థ ! సత్త్వాద్యనురూపమైన
శ్రద్ధయొనగూడుచుండు సర్వంబునకును
దలఁప నీ పురుషుండు శ్రద్ధామయుఁడగు
నెవ్వఁ డేశ్రద్ధవాఁడో వాఁడే యతఁ డగు.

4 దేవతలనుయజింత్రు సాత్వికులు భక్తి
రాజసులు గొల్తు జక్కుల రక్కసులను
అన్యులగు తామసజనంబు లర్థి గొల్తు
ప్రేతముల మఱి భూతసంఘాతములను.

5 దంభయుతులై యహంకారజృంభితులయి
యధికతర కామరాగబలాన్వితులయి
యొగి నశాస్త్రోక్తమును ఘోరమునగు తపము
నే జనంబులు తాఁచు గావింతురో మఱియు.

---

3 సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్సఏవ సః.
4 యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః.
5 అశాస్త్ర విహితం ఘోరం తప్యంతే యే తపో జనాః,
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః.

6 బుద్ధిమాలి శరీరస్థభూతసముద
యమ్ము నంతశ్శరీరస్థుఁడైనయట్టి
ననుఁ గృశింపఁజేయుచునుండ్రో మొనసి వారి
నీవుఁ దెలియుమా యాసురనిశ్చయులుగ.

7 క్రమత సర్వంబునకు నోగిరంబుకూడఁ
ద్రివిధమైనది ఫల్గునా! ప్రియమగుఁ జుమి
యజ్ఞము తపంబు దానంబు నట్టులెయగు
వినుము తెల్పెద నవ్వాని భేద మిట్లు.

8 ఆయువున్ సత్త్వము బలం బనామయతయు
మించు సుఖమును బ్రీతినిం బెంచునదియు
రస్యములు స్నిగ్ధములును స్థిరములు హృద్య
ములగునాహారములు సాత్వికులకుఁ బ్రియము.

---

6 కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్.

7 ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేద మిమం శృణు.

8 ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః.

9 అధికకటుక మత్యామ్లంబు నతిలవణము
నతితరోష్ణము నతితీక్ష్ణ మధికరూక్ష
మతివిదాహియు దుఃఖశోకామయదము
నైన కుడుపు రాజసులకు నగుఁ బ్రియంబు.

10 యాతయామము గతరసమైనయదియుఁ
జాలఁజెడుకంపుఁగలదియుఁ జలివడినది
యెంగిలిదియును శౌచ(?)తఁబుట్టించునదియు
నైన తిండి తామసులకు నగుఁ బ్రియంబు.

11 అర్జున! యాజింపఁదగినదేయని మనము స
మాహితముఁజేసి నిష్కాములైనవార
లరసి విధ్యుక్తమైన యే యజ్ఞమున్ య
జింత్రో యది సాత్వికంబని చెప్పఁబడును.

---

9 కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః.

10 యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్.

11 అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్యమేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః.

12 ఫలము మదినిగాంక్షించి దంభంబుకొఱకుఁ
బరఁగ నేయజ్ఞము యజింపఁబడుచునుండు
భరతముఖ్య! యాయజ్ఞము నా భావమందు
నెఱుఁగుమా రాజసంబుఁగా నీవుఁ బేర్మి.

13 అర్జున! విధిహీనం బసృష్టాన్నము మదిఁ
దలఁపఁగా మంత్రహీనం బదక్షిణంబు
శ్రద్ధలేనిదియైన యజ్ఞమును దామ
సంబుఁగాఁజెప్పుదురు విశేషజ్ఞజనులు.

14 దేవతాద్విజగురుప్రాజ్ఞసేవనంబు
సొపయిన్ శౌచనియతియు నార్జవంబు
బ్రహ్మచర్య మహింస చెప్పంగఁబడును
పార్థ! శారీరమైనతపంబుఁగాఁగ.

---

12 అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్.
13 విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే.
14 దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్,
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే.

15 ప్రియము హితము సత్యం బనుద్వేగకరము
నైన వాక్య మెయ్యదికల దదియు మఱియు
నమితశ్రద్ధస్వాధ్యాయసమభ్యసనము
వాఙ్మయతపంబుగా వచింపంగఁబడును.

16 మానసప్రసాదంబు సౌమ్యత్వము గమ
నింప మౌనంబు నాత్మవినిగ్రహంబు
భావసంశుద్ధియును నిది పార్థ! చెప్పఁ
బడును మానసమైనతపంబుగాఁగ.

17 ఫలముఁగోరక యోగయుక్తులయి నరు లు
దంచిత శ్రద్ధతోడఁగావించునట్టి
త్రివిధమగు నా తపంబు సాత్త్విక మటంచుఁ
జెప్పుచుందురు చూ తద్విశేషవిదులు.

---

15 అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియ హితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.

16 మనఃప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే.

17 శ్రద్ధయా పరయాతప్తం తప స్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభిర్యుక్తైః స్సాత్త్వికం పరిచక్షతే.

18 ఆత్మ సత్కారమానపూజార్థము కడు
డంబమునఁ జేయఁబడు నేతపంబు పార్థ!
అచల మధ్రువమ్మైనట్టి యా తపంబె
యిందు రాజసముగ వచియింపఁబడును.

19 మిగులఁగా మూఢబుద్ధి నాత్మీయమైన
కాయమున్ క్లేశపెట్టువాఁడై యొరులకు
బాధనిడుటకే నేది సల్పంగఁబడునొ
తామసంబైన తపముగ దాని నందు్రి.

20 తనకు నుపకృతి సుంతోనర్పని జనునకు
దేశకాలపాత్రంబులన్ దెలిసికొనుచుఁ
నీఁదగినదంచు నే దాన మీయఁబడునొ
దాన మది సాత్త్వికమ్ముఁగాఁ దలఁపఁబడును.

---

18 సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్.

19 మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్.

20 దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్.

21 క్లిష్టమగు నేది ప్రత్యుపకృతినిగోరి
యేని ఫలమునుద్దేశించి యేని నర్థి
కీఁబడుచునుండు నద్దాన మిం దుదాహ
రింపఁబడు రాజసంబుఁగాఁ గ్రీడి! వింటె?

22 కవ్వడి! యదేశమందు నకాలమం ద
వజ్ఞ నాదృతియిడక యపాత్రములకు
దాన మే దీఁబడునో యది తామసంబుఁ
గా నుదాహృత మగుచుండుఁ జూ నిజంబు.

23 నిశ్చయించి "ఓమ్ తత్స"త్తని యుఁ దెలిపిరి
త్రివిధముగ బ్రహ్మమునకు నిర్దేశమిట్లు
దానిచే బ్రాహ్మణులును వేదములు యజ్ఞ
ములును గల్పింపఁబడియెఁగా పూర్వమందు.

---

21 యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసంస్మృతమ్.
22 అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్.
23 ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః,
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా.

24 పార్థ! యట్లగుటన్ బ్రహ్మవాదుల కిట
'ఓమ్' అని యుదాహరించి విధ్యుక్తములగు
యజ్ఞదానతపఃక్రియ లనవరతముఁ
దగఁ బ్రవర్తిల్లుచుండు యథాతథముగ.

25 'తత్' త్తని యుదాహరించి పృథాతనూజ!
ఫలముఁగోరక యజ్ఞతపఃక్రియలును
వివిధదానక్రియలును గావింపఁబడెడు
నల ముముక్షువులైన బ్రాహ్మణులచేత.

26 పార్థ! సద్భావమున సాధుభావమునను
సమ్యగుపయుక్తమగుచుండు సత్తనునది
మఱియును ప్రశస్తమైనకర్మంబునందు
నట్లె సచ్ఛబ్ద ముపయుక్తమగుచునుండు.

---

24 తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః,
పర్వంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్.
25 తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః.
26 సద్భావే సాధుభావే చ సదిత్యేత త్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే.

27 పాండవా! యజ్ఞమందుఁ దపంబునందు
దానమం దగునేనిష్ఠ దాని బుధులు
సత్తని వచించుచుందు రీశ్వరనిమిత్త
మైనకర్మయు 'స'త్తని యనఁగఁబడును.

28 పార్థ! యశ్రద్ధచేతఁ దప్తమగు తపము
దత్తము హుతంబుఁ గృతము నేత త్సకలముఁ
జెప్పఁబడెడు నస త్తని సిద్ధ మింత
నిహపరంబుల నది ఫలియింపఁజోదు.

---

27 యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే,
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే.

28 అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్య నో ఇహ.

# అధ్యాయము 18.

## మోక్షసన్యాస యోగము.

అర్జునుఁడు :—

1 కేశిదైత్యాంతకా! హృషీకేశ! యలఘు
బాహుకలిత! సన్యాసతత్త్వంబును మఱి
త్యాగతత్త్వంబునుం దెలియంగ నిచ్ఛ
గించుచుంటి వేర్వేఱ రూపించి చెప్పుము.

శ్రీభగవానుఁడు:—

2 పొసఁగఁ గామ్యకర్మన్యాసమును దెలిసిరి
కవి వృషభులు సన్యాసముఁగాఁగఁ బార్థ!
తా రఖిలకర్మఫలపరిత్యాగము ఁ గ వ
చింత్రు త్యాగముఁగా విపశ్చిత్ప్రవరులు.

---

అష్టాదశోఽధ్యాయః (మోక్ష సన్న్యాసయోగః)

అర్జున ఉవాచ:—

1 సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుం,
త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశినిషూదన!

శ్రీభగవా నువాచ:—

2 కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః.

3 దోషయుతమగు కర్మల మనీషివరులు
కొందఱు త్యజింపఁదగ్గదియందు రరసి
యజ్ఞదానతపోరూపమైనకర్మ
నర్జున! త్యజింపరాదని యం డ్రపరులు.

4 భరతసత్తమ! యీ త్యాగసరణి నాదు
నిశ్చయమ్ము వచించెదన్ వినుము నీవు
పురుషసింహమ! త్యాగము ముత్తెఱంగు
లుగఁ బ్రకీర్తిత మగుచునుండు గమనింప.

5 యజ్ఞదానతపోవిషయమగుకర్మ
సల్పఁదగినదె కాని త్యాజ్యంబుఁగాదు
యజ్ఞమున్ దానముఁ దపంబు నారయంగ
ఫల్గున! మనీషివరులకున్ బావనములు.

---

3 త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే.

4 నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ!
త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధ స్సంప్రకీర్తితః.

5 యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవతత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్.

6 సంగము ఫలంబులున్ బోసఁగంగ సంత్య
జించి యీ కర్మములుగూడఁ జేయఁదగ్గ
వని కడున్ సువినిశ్చితమైనయట్టి
నా మతం బుత్తమం బర్జునా! ధ్రువమ్ము.

7 కవ్వడీ! విను సునియతకర్మములను
సన్న్యసించుటన్నది సమంజసముఁగాదు
మోహమునఁజేసి యా కర్మమును విడుచుట
తామసత్యాగముగఁ గీర్తిత మగుచుండు.

8 విజయ! యెవఁడు కాయక్లేశభీతిఁజేసి
దుఃఖదంబని యా కర్మఁ దొలఁగ విడుచు
రాజసత్యాగమునఁజేసి యా జనుండు
త్యాగఫలము నొకింత పొందంగలేఁడు.

---

6 ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్.
7 నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః.
8 దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్.

9 సంగము ఫలంబులున్ బెలుచన్ ద్యజించి
కార్యమిదియంచునె నియతకర్మ మెవ్వఁ
డాచరించునో యతని యా త్యాగ మొప్పు
సాత్త్విక త్యాగముఁగ సాధుసమ్మతమయి.

10 త్యాగి సత్త్వనిష్ఠుండు మేధావి చిన్న
సంశయుఁడునైన పురుషుఁ డో సవ్యసాచి !
కుశలరహిత కర్మంబునకున్ వగవఁడు
కుశలసహిత కర్మంబునకున్ మురియఁడు.

11 కర్మములను నిశ్శేషముఁగాఁ ద్యజింప
నర్జునా ! దేహధారికి నలవికాదు
ఎవఁడు కర్మఫలత్యాగియవునో వాఁడు
త్యాగిగాఁ జెప్పఁబడు నిశ్చయమ్ము సుమ్ము.

---

9 కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున !
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః.

10 న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః.

11 న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే.

12 మృతికిఁబిదప నిష్టానిష్టమిశ్రగతులఁ
త్రివిధమైకర్మఫలము వర్తిల్లుచుండుఁ
త్యాగవంతులుకాని యభాగులకును
అట్లుకాదు తలంప సన్న్యాసులకును.

13 అఖిలకర్మసిద్ధికినై కృతాంతమైన
యట్టి సాంఖ్యంబునన్ బ్రోక్తమైన యైదు
కారణములను వీనిని గ్రమముతో మ
హాభుజ! యెఱుంగు నాదువాక్యమున నీవు.

14 కవ్వడీ! యధిష్ఠానమున్ గర్తయుం బృ
థగ్విధంబగు కరణంబుఁ దలఁచిచూడ
వివిధమగు పృథక్చేష్ట యైదవదియైన
దైవమున్ గారణంబులు తగఁదెలియుము.

---

12 అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలం,
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్.
13 పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్.
14 అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధం,
వివిధా చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్.

15 కాయవాఙ్మానసంబులన్ న్యాయమొ విప
రీతమో యగు నేకర్మ క్రీడి! కడఁక
నే నరుండు ప్రారంభించు దానికెల్ల
నైదు హేతువులని తెలియంగ నగును.

16 కిరీడి! యిట్టులు కావుటన్ గేవలుఁడగు
తన్ను నెవ్వాఁడు భ్రమసి కర్తనుగఁ జూచు
పూరుషుఁడు వాఁ డసంస్కృతబుద్ధియగుటఁ
చేర్మిఁ జూడనివాఁడెయౌ దుర్మతియగుయి.

17 ఎవనిబుద్ధి విలేపసహితముఁగాదో
ఎవనిదైనభావం బహంకృతముఁగావో
పేర్చి యీ లోకముల బిల్కమార్చికూడ
కాఁడు హంత నిబద్ధుఁడున్ గాఁడు వాఁడు.

---

15 శరీరవాఙ్మనోభిర్య త్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః.
16 తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః,
పశ్య త్యకృత బుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః.
17 యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే.

18 జ్ఞానమున్ జ్ఞేయముం బరిజ్ఞాతయు నని
కర్మచోదన త్రివిధమై కానఁబడును
కరణమున్ గర్మమున్ మఱి కర్తయు నని
త్రివిధముగఁ గర్మసంగ్రహ మవును పార్థ!

19 అర్జునా! గుణసంఖ్యానమందుఁ గ్రమత
జ్ఞానమున్ గర్మమున్ మఱి కర్తయు గుణ
భేదమునఁజెప్పఁబడును ద్రివిధముఁగాఁగ
వానిగూడ యథారీతి పార్థ! వినుము.

20 అవ్యయం బవిభక్తమునైన యేక
భావమున్ బొడఁగాంచు విభక్తములగు
సర్వభూతంబులందు నే జ్ఞానమునను
తెలియు మా జ్ఞాన మీవు సాత్వికముఁగాఁగ.

---

18 జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సంగ్రహః.

19 జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి.

20 సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్వికమ్.

21 భేదభావమునన్ బృథగ్విధములైన
వివిధభావంబులన్ భూతవితతియందు
నేది తెలియుచునుండునో యీవు పార్థ!
జ్ఞానమును దాని దెలియు రాజసముఁగాఁగ.

22 అర్జునా! పరిపూర్ణంబు నందుఁబోలె
నేకకార్యసక్తంబు నిర్హేతుకంబు
నల్పతరము నతత్త్వార్థమైన దెద్ది
జ్ఞానమది చెప్పఁబడుఁ దామసంబుఁగాఁగ.

23 సవ్యసాచి! రాగంబు ద్వేషంబులేక
ఫలముఁగోరక చేయంగఁబడెడునట్టి
నియతమున్ సంగరహితముసయినకర్మ
మేదో యది సాత్వికంబని యెన్నఁబడును.

---

21 పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్.

22 యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకం,
అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్.

23 నియతం సంగరహిత మరాగద్వేషతః కృతం,
అఫల ప్రేప్సునా కర్మ యత్తత్సాత్వికముచ్యతే.

24 కామలిప్సుండో మఱి యహంకారయుతుఁడో
సలిపినది బహుళాయాసకలితమునగు
కర్మ మెయ్యదికలదో యా కర్మమే యు
దాహృతంబగు రాజసం బనుచుఁ బార్థ !

25 అర్జున ! యనుబంధంబు క్షయంబు హింస
పౌరుషంబున్ గణింపక ప్రబలమోహ
వశత నేది యారంభింపఁబడునో కర్మ
మద్ది తామసమనుచు నుదాహృతమగు.

26 పార్థ ! సంగం బుడిగి యహంవాదికాక
ధృతి సముత్సాహశక్తి సరీతుఁడగుచు
సిద్ధ్యసిద్ధులనవికారబుద్ధ్యపేతుఁ
డై పరఁగు కర్త సాత్త్వికుఁ డనఁగఁబడును.

---

24 యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహుళాయాసం తద్రాజస ముదాహృతమ్.

25 అనుబంధం క్షయంహింసా మనపేక్ష్య చ పౌరుషం,
మోహా దారభ్యతే కర్మ తత్తామస ముదాహృతమ్.

26 ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే.

27 అశుచి లుబ్ధుండు రాగహింసాత్మకుండుఁ
దివిరి కర్మఫలంబు నర్థించు వాఁడు
హర్ష శోకసమన్వితుఁడైన కర్త
పాండవా! చెప్పఁబడు రాజసుండుఁగాఁగ.

28 ప్రాకృతుండు నయుక్తుండు నైకృతికుఁడు
స్తబ్ధుఁ డలసుండు శఠుఁడు విషాదయుతుఁడు
దీర్ఘసూత్రియునగుచు వర్తించునట్టి
కర్త తామసుఁడని చెప్పఁగాఁబడియెడు.

29 బుద్ధిభేదము ధృతిభేదమున్ గుణములఁ
బట్టి మూఁడువిధంబులై పరఁగుచుండు
వేఱువేఱ ధనంజయా! విస్తరించి
నుడువఁబడెడి నవ్వాని నేర్పడఁగ వినుము.

---

27 రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః.

28 అయుక్తః ప్రాకృతః స్తబ్ధశ్శఠో నైకృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే.

29 బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ!

30 ఏదిసౌరివి ప్రవృత్తి న్నివృత్తినిన్ భ
యంబు నభయంబు నట్టి కార్యము నకార్య
మును నిబంధమున్ మఱి మోక్షమును దెలియునో
సవ్యసాచి! యా బుద్ధియే సాత్త్వికంబు.

31 భ్రమసి పురుషుఁ డెద్దాన ధర్మము నధర్మ
మును మఱియుఁ గార్యము నకార్యమును గొనకొని
తివిరి యయథాతథంబుగఁ దెలియునో ప
రంతపా! వింటె? యా బుద్ధి రాజసంబు.

32 అర్జున! తమస్సమావృత మగుచు నేది
మొనకొని యధర్మమును ధర్మముగను నెల్ల
యర్థములఁ గడు వైపరీత్యంబుఁ గాఁగఁ
దలఁచుచుండునో యా బుద్ధి తామసంబు.

---

30 ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే,
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ.
31 యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్యమేవ చ,
అయథావత్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ.
32 అధర్మం ధర్మమితి యా మన్యతే తామసావృతా,
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ.

33 సవ్యసాచీ! సమాధి నిష్ఠమయి వ్యభిచ
రింపకుండెడు నట్టి యే ధృతి కతమున
ననువుఁగా మనఃప్రాణేంద్రియ క్రియల్ ధ
రింపఁబడు నది సాత్త్వికధృతి యనఁబడు.

34 కవ్వడి! ప్రసక్తిచే ఫలాకాంక్షి యగుచుఁ
బురుషుఁ డే ధృతికతమునఁ బూని తాను
ధర్మకామార్థములఁ దగం దాల్చుచుండుఁ
దెలియు నయ్యది రాజసధృతి యనబడు.

35 అతికలుషబుద్ధియగుచు నే ధృతికతమున
స్వప్నభయములు శోక విషాదములును
మదమునున్ దాఁ బరిత్యజింపంగ లేఁడో
క్రీడి! యయ్యది తామసధృతి యనఁబడు.

---

33 ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేన్ద్రియక్రియాః,
యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ.
34 యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున!
ప్రసంగేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ! రాజసీ.
35 యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ,
న విముఞ్చతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ.

36 ఎందు నభ్యాసమునఁ జరియించుచుండి
దుఃఖపర్యవసానమొందు న్నరుండు
భరతసత్తమ! నీవు నావలన నిపుడు
త్రివిధమగు నాసుఖమ్ము నర్థిమెయి వినుము.

37 విజయ! యెయ్యదితొలుదొల్త విషముఁబోలె
నుండి పరిణామమున నమృతోపమమగు
నాత్మబుద్ధిప్రసాదజన్యమగు నా సు
ఖంబు సంప్రోక్తమగు సాత్త్వికంబుఁగాఁగ.

38 ఏది ప్రథమంబునన్ విషయేంద్రియచయ
యోగమునఁ జేసి తగ నమృతోపమమయి
యవలఁ బరిణామమున విషమట్టు లగునో
యా సుఖము పార్థ! రాజస మనఁగఁబడును.

---

36 సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి.
37 యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమం,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్.
38 విషయేన్ద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమం,
పరిణామే విషమివ తత్సుఖం రాజసంస్మృతమ్.

39 ఆదియం దనుబంధమునందుఁ గూడ
నాత్మమోహకమైనది యలసతను బ్రి
మాదమున నిద్రచేత సంభవమగు నది
యగు సుఖము తామసముగ నుదాహృతమగు.

40 వినుము భువినేని దివినేని వేల్పులందు
నేనియుఁ బ్రకృతి జన్యంబులైన యీ గు
ణముల మూఁడింటను విమోచనముఁ బడసిన
యట్టి ప్రాణి తలంప నెయ్యదియు లేదు.

41 బ్రాహ్మణులకును క్షత్రియ వైశ్యులకును
క్రమగతిన్ శూద్రులకును కర్మంబులెల్ల
ఫల్గునా! స్వభావప్రభవంబులైన
యీ గుణంబులచే విభజింపబడియె.

---

39 యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః,
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్.
40 న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః.
41 బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః.

42 సవ్యసాచి ! యాలించితే ? శమము దమముఁ
దపము నార్జవమున్ శుచిత్వంబు క్షాంతి
యన్గ్లి జ్ఞానంబు విజ్ఞాన మాస్తికతయు
ననునిది స్వభావజమగు బ్రాహ్మంబు కర్మ.

43 ధృతియు శౌర్యంబు దక్షత తేజముఁ గద
నస్థలమునుండి యపలాయనమ్ము దాన
మీశ్వరత్వము ననియెడి యిట్టికర్మ
తలఁపగ స్వభావజమగు క్షాత్రంబు కర్మ.

44 కృషియు గోరక్షయున్ వణిగ్వృత్తియు స్వ
భావసంజనితంబగు వైశ్య కర్మ
కవ్వడీ ! పరిచర్యాత్మకమ్మగునది
చూడఁగ స్వభావజంబగు శూద్ర కర్మ.

---

42 శమో దమ స్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్.

43 శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనం,
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్.

44 కృషిగోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజం,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్.

45 స్వస్వకర్మమునందు నాసక్తుఁడగుచుఁ
బూరుషుండు సంసిద్ధిని బొరయుచుండు
ఫల్గున ! స్వకర్మనిరతుఁ డేభంగి సిద్ధిఁ
బొందునో విను దాని దెల్పుదును నీకు.

46 ఎవని వలన భూతంబుల కవుఁ బ్రవృత్తి
యెవనిచేత వ్యాప్తంబయ్యె నీసకలము
నతనిని స్వకర్మచే సమభ్యర్చనంబుఁ
జేసి మానవుఁ డెంతయు సిద్ధిఁబొందు.

47 విగుణమయ్యు స్వధర్మ మఱివ్వని శుభంక
రంబగు స్వనుష్ఠిత పరధర్మంబుకన్న
నర్జున ! స్వభావ నియతమైనట్టి కర్మఁ
జేయుచుండియుఁ బురుషుండు చెందఁడఘము.

---

45 స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు.
46 యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః.
47 శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్.

48 కిరీటి ! యాలింపు దోషపరీతమయ్యు
సహజమైనట్టి కర్మత్యాజ్యంబుఁ గాదు
అరసిచూడ ధూమముచేత నగ్నివోలె
నన్నియారంభములును దోషావృతములె.

49 సర్వకర్మములందు నసక్తబుద్ధి
యును జితాత్ముండు విగతస్పృహుండునగుచు
జనుఁడు సన్న్యాసమునను నైష్కర్మ్యసిద్ధిఁ
బరమమగుదానిఁ బడపడి వడయుచుండు.

50 అర్జునా ! సిద్ధిఁబడసిన యట్టివాఁడు
బ్రిహ్మమును బొందునెట్టు లాప్రక్రియయును
పరమమగు జ్ఞాననిష్ఠ నావలన నీవు
దెలియుమిూ సంగ్రిహంబుగఁ దెలియఁబఱతు.

---

48 సహజం కర్మ కౌన్తేయ ! సదోషమపి న త్యజేత్,
సర్వారమ్భా హి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః.
49 అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి.
50 సిద్ధింప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌన్తేయ ! నిష్ఠా జ్ఞానస్య యా పరా.

51 శుద్ధిసము పేతబుద్ధి సమృద్ధి కలిగి
నియమితముఁ జేసి యాత్మమున్ ధృతికతమున
విడిచి వైచి శబ్దాదిక విషయములను
తొలఁగఁద్రోఁచి రాగ ద్వేషములను బిదప.

52 విజనమైన దేశంబు సేవించుచు లఘు
భోజియై వాక్యమున్ గాయమును మనమును
నియతముగఁ జేసి వైరాగ్యనిష్ఠుఁడగుచు
ధ్యానయోగ దీక్షాపరుండై జనుండు.

53 పాండవ ! యహంకృతియును దర్పంబు బలముఁ
గామమున్ గోధమున్ బరిగ్రహము విడిచి
నిర్మముండు శాంతుండునై నెగడి బ్రహ్మ
భావమును బొందఁగాఁ గడు వలఁతియగును.

---

51 బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ,
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ.
52 వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః.
53 అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం,
విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే.

54 బ్రహ్మభూతుండును బ్రసన్నభావుఁడగుచుఁ
జింతనముఁ జేయఁబోఁడు కాంక్షింపబోఁడు
సర్వభూతంబులందును సమతఁబరఁగి
పరమమగు నాదుభక్తిని బడయఁగల్గు.

55 ఎవఁడనో యెంతవాఁడనో యెఱుఁగఁగలఁడు
వాస్తవంబుగ నన్ను నాభక్తిచేత
నర్జునా! యయ్యనంతరమందు నన్ను
తాను బడయంగలఁడు యథార్థముగ నెఱిఁగి.

56 సర్వములగు కర్మంబుల సంతతంబు
సల్పుచున్ మఱి మద్వ్యపాశ్రయుఁడు నగుచు
నవ్యయంబును శాశ్వతమైన యట్టి
పదము మదనుగ్రహమ్మునఁ బడయఁగలఁడు.

---

54 బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి,
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్.

55 భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్.

56 సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్.

57 మత్పరుండయి సర్వకర్మములు మాన
సంబుచేతనె నాయందు సన్యసించి
బుద్ధియోగంబు నిమ్ముగఁబూని మన్మ
నస్కుఁడవు కమ్ము పార్థ! యనారతంబు.

58 సర్వదుర్గమ్ములను మత్ప్రసాదమునను
నీవు మచ్చిత్తుఁడవయి తరింపఁగలవు
ఇది యహంకారమున నాలకింపకుందు
వేని నశియింపఁగలవు పార్థా! నిజంబు.

59 అర్జునా! నీ వహంకృతి నాశ్రయించి
యుద్ధమొనరింపనంచు నీ యుల్లమందుఁ
దలఁతువేనియు నీ ప్రయత్నంబు మిథ్య
బల్మిని నియుక్తుఁ జేయును ప్రకృతి నిన్ను.

---

57 చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ.
58 మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథ చేత్త్వ మహఙ్కారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి.
59 యదహఙ్కారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి.

60 మోహమునఁ జేసి యాహవంబు నొనరింప
నిచ్ఛగింపక యున్నను నీవు పార్థ!
ప్రకృతిజన్య స్వకర్మనిబద్ధుఁడవయి
యవశతన్ జేసి పోరుఁ జేయంగఁగలవు.

61 భూరిమాయ యంత్రారూఢములగువాని
నెల్లభూతంబులన్ భ్రమియింపఁజేయు
చీశ్వరుఁడు సర్వభూతాళి హృత్ప్రదేశ
మందు నివసించుచుండుఁ దథ్యమ్ము సుమ్ము.

62 శరణముంబొందు వానినే సర్వభావ
మున భరతముఖ్య! సంతతమును విడువక
పరమమగు శాంతి శాశ్వత పదముఁగూడ
నాతని యనుగ్రహమ్మున నందఁగలవు.

---

60 స్వభావజేన కౌన్తేయ! నిబద్ధ స్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్.

61 ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.

62 తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదా త్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

63 అనఘ! గుహ్యంబుకంటె గుహ్యతరమైన
జ్ఞానమిది చెప్పఁబడె నిట్లు క్రమత నీకు
నిది సమగ్రమ్ముగా విమర్శించి నీవు
చేయుమీ పార్థ! యిచ్ఛవచ్చినవిధమ్మున.

64 సర్వ గుహ్యతమముఁ బ్రికృష్టంబునైన
నావచనమును విను మర్జునా! మఱియును
నాకుఁ గడు నిష్టుఁడవు కావునన్ హితంబు
నీకు వచియింపఁగలవాఁడ నిశ్చయముగ.

65 పార్థ! మచ్చిత్తుఁడవును మద్భక్తుఁడవును
మద్యజనశీలుఁడవునై నమస్కరింపు
నాకుఁ బొందంగలాఁడవు నను నిజము ప్రి
యుండవగుటఁ బ్రతిజ్ఞఁ జేయుదును నీకు.

---

63 ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా,
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు.

64 సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢ ఇతి తతో వక్ష్యామి తే హితమ్.

65 మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.

66 సర్వములగు ధర్మమ్ముల సంత్యజించి
నన్ను నొక్కనినే శరణంబుఁ జొరుము
నే నఖిల పాపములనుండి నిన్నును విడి
పింపఁగలవాఁడఁ జుమ్ము శోకింపబోకు.

67 ప్రకటమగుభంగి నతపస్కునకు నభక్తు
నకు నశుశ్రూషునకు మఱి నన్ను నెవ్వఁ
డీసడించునో వానికి నెన్నఁడేని
దీని జెప్పంగరాదు కౌంతేయ! నీవు.

68 అర్జునా! పరమంబు గుహ్యంబునైన
దీని మద్భక్తులందు సఃధించు నెవఁడు
పరమమగుభక్తి నాయందుఁ బఱపి వాఁడుఁ
బొందు నన్నును లేదిందు సందియంబు.

---

66 సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

67 ఇదం తే నాఽతపస్కాయ నాఽభక్తాయ కదాచన,
నచాఽశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి.

68 య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయమ్.

69 అతనికంటె మనుష్యులయందొకండు
నాకుఁ బ్రియకృత్తముండు గానంగరాఁడు
పృథివి వానికంటెను నాకుఁ బ్రియతరుం డొ
కండుఁ గాఁగల వాఁడు నన్యుండు లేఁడు.

70 అర్జునా ! యెవ్వఁ డీధర్మ్యమైన యట్టి
మనదు సంవాదమును నధ్యయనముఁ జేయు
జ్ఞానయజ్ఞంబుతోడను వానిచే య
జింపఁబడితి నటంచు భావింతు మదిని.

71 ఈసడింపక శ్రద్ధాళువై సతంబు
దీనినాలించుచుండుఁ దా నే నరుండు
వాఁడును విముక్తుఁడగుచు శుభంబులైన
పుణ్యకర్మ్మల లోకముల్ పొందు సుమ్ము.

---

69 న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః,
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి.
70 అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః,
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మే మతిః.
71 శ్రద్ధావా ననసూయశ్చ శృణుయాదపి యో నరః,
సోఽపిముక్తశ్శుభాన్లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్.

72 ఆలకించితే? దీని నేకాగ్రమైన
మానసముతోడ ఫల్గునా! పూని నీవు
ఇప్పు డజ్ఞానసమ్మోహ మెల్లనుం బ్ర
ణష్టమయ్యెనె ? నీకు ధనంజయ! తగ.

అర్జునుఁడు :—

73 అచ్యుతా! నష్టమయ్యె మోహంబు స్మృతియు
సమకురె న్నాకుఁ ద్వత్ప్రసాదమునఁ జేసి
నిల్చియుంటిని విగతసందేహుఁడనయి
నేను గావింపఁగల నింక నీవచనము.

సంజయుఁడు :—

74 భూవరా! యీగతిన్ వాసుదేవునకు మ
హాత్ముఁడగు పార్థునకునైనయదియు రోమ

---

72 కచ్చిదేత చ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్ట స్తే ధనఞ్జయ!

అర్జున ఉవాచ :—

73 నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత!
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ.

సఞ్జయ ఉవాచ :—

74 ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః,

హర్షణమ్మును మఱి పరమాద్భుతంబు
నైనయట్టి యీ సంవాద మేనువింటి.

75 ధారుణీధవ! సాక్షాత్తు తానయి వచి
యించు యోగేశ్వరుండగు కృష్ణువలన
నేను గుహ్యంబుఁ బరమంబునైన యోగ
మును వినితి దీని నా వ్యాసముని కరుణను.

76 అవనినాయక ! పుణ్యంబు నద్భుతమగు
వాసుదేవార్జునుల సుసంవాద మిద్ది
మదిని స్మరియించి స్మరియించి మాటి మాటి
కెంతయేనియు నేను హర్షించుచుంటి.

77 రాజ ! యత్యద్భుతమ్మై విరాజమాన
మైన యా హరి రూపంబునాత్మఁదలఁచి

---

సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్.

75 వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేతద్గుహ్య మహం పరం,
యోగం యోగేశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్.

76 రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతం,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః.

77 తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః,

తలఁచి ఘనవిస్మయంబు వాటిలెను నాకు
మోదమున్ సారెసారెకుఁ బొందుచుంటి.

78 ఎచట యోగేశ్వరుండగు కృష్ణుఁ డుండు
నెట ధనుర్ధరుఁడగు పార్థుఁ డెసక మెసఁగు
భూతియున్ శ్రీయు ధ్రువమైన నీతియు విజ
యంబు నటనుండు ననుచు నాదగు తలంపు.

## గద్యము

శతావధానులు, ఉభయ భాషాప్రవీణులు, శ్రీ గద్వాల సంస్థానాస్థానకవులు, శ్రీమదాంధ్ర భాగవత మహాపురాణ గ్రంథ కర్తలు, 'శ్రీరామ నృసింహమూర్తికవులు' అను గంధం శ్రీరామమూర్తి, ఇత్తింకి నరసింహమూర్తులచే
రచింపఁబడిన శ్రీ తేటగీత భగవద్గీతయందలి
పూర్వగీత సంపూర్ణము.

---

విస్మయో మే మహాన్ రాజన్ ! హృష్యామి చ పునః పునః.
78 యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతి ర్మతి ర్మమ.
ఇతి శ్రీమన్మహాభారతే శతసహస్ర సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీపూర్వభగవద్గీతా సమాప్తా.

ఓమ్

శ్రీకృష్ణ పరమాత్మనేనమః

# తేటగీత - భగవద్గీత (ఉత్తరగీత)

శ్రీరామ నృసింహమూర్తికవులు:—

శ్రీ మదంబుదగాత్రుఁడే కృష్ణవిభుఁడు
పార్థుచే నర్థితుండై పునఃప్రార్థితుఁడయి
పూర్వగీతను సవిశేషముగఁ బదపడి
దెల్పఁ బోఁచుత మా దేవదేవుఁడు మము.

## అధ్యాయము 1.

అర్జునుఁడు :—

1 బ్రహ్మరూప మేకంబు నిరంజనంబు
నంబరాతీత మప్రతర్క్యంబు నాశ
నోద్భవ వివర్జితంబు నతూర్యర్జితంబు
నిశ్చలం బవిజ్ఞేయంబు నిష్కళంబు.

---

ప్రథమోఽధ్యాయః

అర్జున ఉవాచ:—

1 యదేకం నిష్కళం బ్రహ్మ వ్యోమాతీతం నిరఞ్జనమ్,
అప్రతర్క్య మవిజ్ఞేయం వినాశోత్పత్తివర్జితమ్.

2 కేవలంబు శాంతంబు ముక్తిప్రదంబు
నిత్యశుద్ధంబు నత్యంత నిర్మలంబుఁ
బావనము హేతుసాధనవర్జితంబు
మూలహేతువు యోగనిర్ముక్తము మఱి.

3 అట్టి హృదయాబ్జమధ్యస్థ మైన యదియు
జ్ఞానవిజ్ఞేయరూపంబు నైనపరముఁ
బూని యెఱిఁగింపు కృష్ణ! యేజ్ఞానమునను
దత్క్షణము ముక్తుఁడగుఁజెప్పు దానిగూడ.

శ్రీభగవానుఁడు:—

4 ఘనభుజా! పార్థ! నీవు చక్కఁగ నడిగితి
పాండవా! కడు బుద్ధిమంతుండ వీవు
ఇపుడు నన్నేది యడిగితో యీ వశేష
మైన తత్త్వార్థమును దాని నే నుడివెద.

---

2 కైవల్యం కేవలం శాన్తం శుద్ధ మత్యన్తనిర్మలమ్,
కారణం యోగనిర్ముక్తం హేతుసాధనవర్జితమ్.

3 హృదయాంబుజమధ్యస్థం జ్ఞానజ్ఞేయస్వరూపకమ్,
తత్క్షణాదేవ ముచ్యేత యద్జ్ఞానా ద్బ్రూహి కేశవ!

శ్రీభగవా నువాచ:—

4 సాధు పృష్టం మహాబాహో! బుద్ధిమానసి పాండవ!
యన్మాం పృచ్ఛసి తత్త్వార్థ మశేషం ప్రవదామ్యహమ్.

5 ఆత్మమంత్రంబునకు మఱి హంసమునకు
నర్జున! పరస్పరసమన్వయమునఁ జేసి
విమలయోగంబుచేతను విగతకాము
లైనవారి భావన బ్రహ్మ మనఁగఁ బడును.

6 బ్రహ్మసాక్షాత్కరణము జీవత్వమునకు
నంతమైన హంసత్వము నందు టె సుమి
అజముఁ గూటస్థముఁ బ్రణవాత్మకంబు
నక్షరము నయి బ్రహ్మ మొప్పారుచుండు
పరమమైన యాబ్రహ్మమున్ బడసి బుధుఁడు
వేగ జన్మమరణములు విడిచివైచు.

7 కనఁగఁ గాకీముఖస్థకకారమునకు
నంతగతమకారంబు బ్రహ్మంబుకార

---

5 ఆత్మమన్త్రస్య హంసస్య పరస్పరసమన్వయాత్,
యోగేన గతకామానాం భావనా బ్రహ్మ చక్షతే.

6 శరీరిణా మజస్యాన్తం హంసత్వం పారదర్శనమ్,
హంసో హంసాక్షరం చైతత్ కూటస్థం యత్తదక్షరమ్.
తద్విద్వానక్షరం ప్రాప్య జహ్యాన్మరణజన్మనీ.

7 కాకీముఖ కకారాన్త మకారశ్చేతనాకృతిః,

మగును చేతనాకృతి యరయన్ మకార
లోపమున నర్ధ మేదికల్గును? దెలియఁగ.

8 చనుచు నిలుచుచుఁ దా నెల్లసమయముల వి
శేషముగ వాయుధారణఁ జేయవలయు
సర్వకాలప్రయోగంబు సల్పునేని
నరసి చూడ నరుఁడు సహస్రాయు వగును.

9 హంసరూపంబుఁ బొడగాంచు నంతదన్క
నెఱి తదాకార మాత్మఁ జింతింపవలయు
నాత్మ నాకాశమధ్యంబు నందు నాత్మ
మధ్యమందు నాకాశమున్ మఱి నిలుపుము
ఆత్మ నట్టు లాకాశమయంబుఁ జేసి
యొక్కయింతేని జింతింపకుండఁగ నగు.

---

మకారస్య తు లుప్తస్య కోఽర్థః సంప్రతిపద్యతే.

8 గచ్ఛన్ స్తిష్ఠ న్సదా కాలం వాయుస్వీకరణం పరమ్,
సర్వకాలప్రయోగేన సహస్రాయుర్భవేన్నరః.

9 యావత్పశ్యేత్ఖగాకారం తదాకారం విచింతయేత్
ఖమధ్యే కురు చాత్మాన మాత్మమధ్యే చ ఖం కురు
ఆత్మానం ఖమయం కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్.

10 మూఢతఁ ద్యజించి సుస్థిరబుద్ధి యగుచు
బ్రహ్మమున నున్నవాఁడయి బ్రహ్మవేత్త
ఎందునన్ శ్వాసము లయంబుఁ జెందుచుండు
నిష్కళంబు బాహ్యాకాశనిష్ఠితంబు
శాశ్వతంబు నాసాగ్రదేశస్థితంబు
నైన యాబ్రహ్మమున్ దెలియంగవలయు.

11 పొసఁగ నాసాపుట ద్వయముక్త మగుచు
మానుగా శ్వాస మెందు విలీనమగునో
అందు నియతిమై డెందంబుఁ బొందుపరచి
నిష్ఠ నాపరమేశు ధ్యానింపవలయు.

12 నిర్మలుండు శివుండు షడూర్మిరహితుఁ
డైన యయ్యీశ్వరుని దెలియంగ వలయు

---

10 స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః,
బహిర్వ్యోమస్థితం నిత్యం నాసాగ్రే చ వ్యవస్థితమ్
నిష్కళంకం విజానీయాత్ శ్వాసో యత్ర లయం గతః.

11 పుటద్వయవినిర్ముక్తో వాయుర్యత్ర విలీయతే,
తత్ర సంస్థమనః కృత్వా తం ధ్యాయేత్పార్థ! ఈశ్వరమ్.

12 నిర్మలం తం విజానీయాత్ షడూర్మిరహితం శివమ్

నిష్ప్రభము నిర్మనస్కము నీరుజంబు
నిస్పృహము నిరాభాసంబు నిశ్చలంబు
సర్వశూన్యంబునగు నవస్థయె మదిన్ ద
లంపఁగా సమాధిస్థుని లక్షణంబు
ముత్తెఱఁగులైన యీ శూన్యమున నెఱుంగు
నెవఁడు బంధవినిర్ముక్తుఁడవును వాఁడు.

13 స్వయముగా స్వీయ దేహ ముచ్చలితమగుచు
నుండఁగా దేహియు సమాధియోగనిష్ఠ
నిశ్చలమగు నాబ్రహ్మమున్ దెలియఁగావ
లయు నదియెకా? సమాధిస్థు లక్షణంబు.

14 పాండవా! యమాత్రంబు శబ్దరహితంబు
నూర్జితము స్వరవ్యంజన వర్జితంబు

---

ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం నిరామయమ్
సర్వశూన్యం నిరాభాసం సమాధిస్థస్య లక్షణమ్
త్రిశూన్యంయో విజానీయాత్ స తు ముచ్యేత బంధనాత్.

13 స్వయముచ్చలితే దేహే దేహీ న్యస్తసమాధినా,
నిశ్చలం తం విజానీయాత్ సమాధిస్థస్య లక్షణమ్.

14 అమాత్రం శబ్దరహితం స్వరవ్యంజనవర్జితమ్,

నజము బిందు కళాతీతమగు పరాత్మఁ
దానెఱుంగు నెవ్వండు వేదవిదుఁడతఁడు.

15 జ్ఞానమునను విజ్ఞానంబు సముపలబ్ధ
మగుడు మానసమందు జ్ఞేయంబుగూడ
సంస్థితముఁగాఁగ దేహియు శాంతి పదముఁ
గొనఁగ యోగము లేదు ధారణయు లేదు.

16 అర్జునా! యేస్వరంబు వేదాదియందుఁ
బ్రోక్తమగు మఱి వేదాంతమున ప్రతిష్ఠి
తమగు నెయ్యది ప్రకృతి లీనమగునా ప్ర
ణవమునకుఁ బరుఁడీశ్వరుఁడవును దెలియ.

17 ఎందనుక పారమున్ దాను బొందకుండు
నందనుక నావఁ గోరువాఁ డగును నరుఁడు

---

బిందునాదకళాతీతం యస్తం వేద స వేదవిత్.

15 ప్రాప్తే జ్ఞానేన విజ్ఞానే జ్ఞేయం చ హృది సంస్థితే,
లబ్ధశాన్తిపదే దేహే న యోగో నైవ ధారణా.

16 యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తే చ ప్రతిష్ఠితః,
తస్య ప్రకృతిలీనస్య యః పర స్స మహేశ్వరః.

17 నావార్థీ హి భవేత్తావత్ యావత్పారం న గచ్ఛతి,

ఘనసరిత్పారమున్ జేరికొనిన పిదప
నావతో నించుక ప్రయోజనంబు గలదె ?

18 జ్ఞానవిజ్ఞాన తత్పరుఁడైన బుద్ధి
శాలి గ్రంథముఁ దా నభ్యసనముఁ జేసి
పిదప దానిని బూర్తిగా విడిచినైచుఁ
గ్రమత ధాన్యార్థి యల పలాలమును బోలె.

19 కొఱవిదీపంబుఁ జేతనుగొని యొకండు
వస్తువుం గని కొఱవిని బాఱవైచు
నట్లె జ్ఞానంబుచేత జ్ఞేయమును గాంచి
పిదప నాజ్ఞానమునుగూడ విడిచివైచు.

20 అమృతపానము చేఁ దృప్తుఁడైనవాని
కంబువులతో నొక ప్రయోజనంబుఁ గలదె ?

---

ఉత్తీర్ణే తు సరిత్పారే నావయా కిం ప్రయోజనమ్?

18 గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః,
పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః.

19 ఉల్కాహస్తో యథాకశ్చిద్ద్రవ్యమాలోక్యతాంత్యజేత్,
జ్ఞానేన జ్ఞేయమాలోక్య జ్ఞానం పశ్చాత్పరిత్యజేత్.

20 యథాఽమృతేన తృప్తస్య పయసా కిం ప్రయోజనమ్?

ఇట్టి యీపరబ్రహ్మము నెఱిఁగెనేని
వేదములఁ బ్రయోజన మిఁక లేదు కాదె?

21 తెలిసిచూడ జ్ఞానామృత తృప్తుఁడు కృత
కృత్యుఁడునయి రాజిల్లు యోగికి నొకింత
చేయఁదగినది లేదు యోచించిచూడ
నున్నచో దత్త్వవేత్త కాఁ డన్నరుండు.

22 దీర్ఘ ఘంటారవంబురీతిన్ బ్రకృష్ట
తైలధారభాతిని ఛిన్నతంబౌరయక
యలరెడు నవాచ్యమగు ప్రణవార్థము నెవఁ
డాదట నెఱుంగునో వాఁడె వేదవిదుఁడు.

23 ఆత్మ నధరారణిగ నుత్తరారణిగను
బ్రణవమును జేసి యెవ్వఁ డభ్యాసవశత

---

ఏవం తత్పరమం జ్ఞాత్వా వేదైర్నాస్తి ప్రయోజనమ్.

21 జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
న చాస్తి కిఞ్చిత్కర్తవ్య మస్తి చే న్న స తత్త్వవిత్.

22 తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్,
అవాచ్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్.

23 ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్,

ధ్యానయోగముచే నిర్మథనముఁ జేయు
వాఁడు కను నిగూఢంబైన బ్రహ్మపదము.
24 ధూమవిరహిత పావకతుల్యుఁడున్ వి
నిర్మలుఁడునైన యా దేవునిన్ గనవలె
పాండవ ! యనన్యబుద్ధివై పరమమైన
యట్టి రూపమె స్మరియింప నగు సతంబు.
25 దూరగతుఁడయ్యు దూరగతుండు కాఁడు
పిండగతుఁడయ్యుఁ బిండగతుండుఁగాఁడు
సర్వవిధముల విమలుండు సర్వగతుఁడు
నగుచుఁ దనరారు దేహి నిరంజనుండు.
26 కాయగతుఁడయ్యునున్ గాయగతుఁడుఁ గాఁడు
కాయగతుఁడయ్యునున్ బుట్టుకం బొరయఁడు

---

ధ్యాననిర్మథనాభ్యాసాదేవం పశ్యేన్నిగూఢవత్.
24 విధూమాగ్నినిభం దేవం పశ్యేదత్యంతనిర్మలమ్,
తాదృశం పరమం రూపం స్మరేత్పార్థ! హ్యనన్యధీః.
25 దూరస్థోఽపి న దూరస్థః పిండస్థః పిండవర్జితః,
విమలస్సర్వతో దేహీ సర్వవ్యాపీ నిరంజనః.
26 కాయస్థోఽపి న కాయస్థః కాయస్థోఽపి న జాయతే,

కాయగతుఁడయ్యు నుపభోక్త కాఁడు మఱియు
కాయగతుఁడయ్యు బద్ధుండుఁగాకయుండు
కాయగతుఁడయ్యు లిప్తుఁడున్ గాఁ డొకప్డు
కాయగతుఁడయ్యు వధ్యుఁడుఁ గాఁడు చూడ.

27 నువ్వులందున నెక్కొన్న నూనెఁబోలె
క్షీర మధ్యమునందలి ఘృతముఁబోలె
పూవులందు గుబులొన్ను తావిఁబోలె
ఫలములందునగల రస ప్రసరమువలె.

28 కట్టెయల నగ్నిఁబోలెఁ బ్రకాశ మొందు
వ్యోమమందున వాయువువోలె మెలఁగు
నట్లె సర్వగతంబగునట్టి దేహి
దేహమధ్యమునందుఁ బ్రతిష్ఠితుండు.

---

కాయస్థోఽపి న భుంజానః కాయస్థోఽపి న బధ్యతే.
కాయస్థోఽపి న లిప్తస్స్యాత్కాయస్థోఽపి న వధ్యతే.

27 తిలమధ్యే యథా తైలం క్షీరమధ్యే యథాఘృతమ్,
పుష్పమధ్యే యథా గంధః ఫలమధ్యే యథారసః.

28 కాష్ఠాగ్ని వత్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్,
తథా సర్వగతో దేహీ దేహమధ్యే వ్యవస్థితః.

29 దేహుల మనంబులందుండు దేవుఁడు తలఁ
పఁగ మనోమధ్యమందు వ్యవస్థితుఁడగు
సరవిని మనస్థమున్ మనస్సాక్షి మనన
వర్జితంబు మధ్యస్థమై పరఁగునట్టి
మనమును, మనస్సుచేత నాయ్యన నెఱింగి
యోగులు స్వయంబుఁగా సిద్ధినొందుచుంద్రు.
30 మానసంబు నాకాశముగా నొనర్చి
మనమును నిరాస్పదముఁగాఁగ నొనరఁజేసి
అచలుఁడైన యాపరమాత్మ నరసి తెలియ
నగు సమాధిస్థులక్షణ మదియ సుమ్ము.
31 సతము సుఖియును వాయుభక్షకుఁడు నగుచుఁ
బ్రికటమైన యోగామృతరసము గ్రోలి

---

29 మనస్థో దేహినాం దేవో మనోమధ్యే వ్యవస్థితః
మనస్థం మనమధ్యస్థం మధ్యస్థం మనవర్జితమ్
మనసా మన ఆలోక్య స్వయం సిధ్యంతి యోగినః.
30 ఆకాశం మానసం కృత్వా మనః కృత్వా నిరాస్పదమ్,
నిశ్చలం తం విజానీయాత్ సమాధిస్థస్య లక్షణమ్.
31 యోగామృతరసం పీత్వా వాయుభక్షస్సదా సుఖీ,

నిత్య మలవర్చనగు మనోనిగ్రహంబు
మృత్యునాశకరంబుసుమీ సమాధి.

32 శూన్యమగు మీఁదఁ గ్రిందను శూన్యము మఱి
నడుమ శూన్యంబు సర్వశూన్యంబు నగుచు
నలరునేయాత్మ దానిఁ బరాత్మఁగాఁ ద
లంచుటయె సమాధిస్థుని లక్షణంబు
శూన్యభావిత భావాత్మ శోభితుండు
పుణ్యపాపచయ ప్రవిముక్తుఁడగును.

అర్జునుఁడు :-

33 భావనయె లేదదృశ్యమౌ వస్తువందు
దృశ్యమియ్యదియెల్ల నశించుచుండు
వర్ణరహిత మస్వరమగు బ్రహ్మమున్ ము
నీశ్వరులు పూని యెట్లు ధ్యానింపఁగలరు ?

---

యమమభ్యస్యతే నిత్యం సమాధిర్మృత్యునాశకృత్.

32 ఊర్ధ్వశూన్యమధశ్శూన్యం మధ్యశూన్యం యదాత్మకమ్,
సర్వశూన్యం స ఆత్మేతి సమాధిస్థస్య లక్షణమ్.
శూన్యభావితభావాత్మా పుణ్యపాపైః ప్రముచ్యతే.

అర్జున ఉవాచ:—

33 అదృశ్యే భావనా నాస్తి దృశ్యమేతద్వినశ్యతి,
అవర్ణమస్వరం బ్రహ్మ కథం ధ్యాయంతి యోగినః?

శ్రీభగవానుఁడు :—

34 పూర్ణమగు మీఁదఁ గ్రిందను పూర్ణము మఱి
నడుమ పూర్ణంబు సర్వపూర్ణంబు నగుచు
నలరు నేయాత్మ దానిఁ బరాత్మఁగాఁ ద
లంచుటయె సమాధిస్థుని లక్షణంబు.

అర్జునుఁడు :—

35 అగు ననిత్యత సాలంబమైనదాని
కటు నిరాలంబమునకు శూన్యతయుఁ గల్గ
రెంట దోషంబు ప్రాపించియుంటచే ము
నీశ్వరులు పూని యెట్లు ధ్యానింపఁగలరు?

శ్రీభగవానుఁడు :—

36 హృదయమును నిర్మలంబుఁ గావించి యపల
నల యనామయమైన బ్రహ్మముఁ దలంచి

---

శ్రీభగవానువాచ:—

34 ఊర్ధ్వపూర్ణమధఃపూర్ణం మధ్యపూర్ణం యదాత్మకమ్,
సర్వపూర్ణం తదాత్మేతి సమాధిస్థస్య లక్షణమ్.

అర్జున ఉవాచ:—

35 సాలంబస్యాప్యనిత్యత్వం నిరాలంబస్య శూన్యతా,
ఉభయోరపి దోషత్వాత్కథం ధ్యాయంతి యోగినః?

శ్రీభగవానువాచ:—

36 హృదయం నిర్మలం కృత్వాచిన్తయిత్వాప్యనామయమ్,

యీసమస్తంబుఁ బరికింప నేన యనుచు
సుఖపరుండయి పరమును జూడవలయు.

అర్జునుఁడు :-

37 అక్షరంబులు మాత్రాసమన్వితంబు
లన్నియుంగూడ బిందుసమాశ్రితములు
నాదమునను బిందు వది భిన్నమగుచుండు
దేనిచే నాద మింక భేదింపఁబడును ?

శ్రీభగవానుఁడు :-

38 విను "మనాహత"మను శబ్దమునకుగల్గు
నాదమునకును నే నిస్స్వనంబుఁగలదో
దానియంతర్గతంబయి తనరుజ్యోతి
జ్యోతి రంతర్గతంబయి యుండుమనము

---

అహమేకమిదం సర్వమితి పశ్యేత్పరం సుఖీ.

అర్జున ఉవాచ:-

37 అక్షరాణి సమాత్రాణి సర్వే బిందుసమాశ్రితా,
నాదేన భిద్యతే బిందుస్స నాదః కేన భిద్యతే?

శ్రీభగవా నువాచ:-

38 అనాహతస్య శబ్దస్య తస్య నాదస్య యో ధ్వనిః
ధ్వనే రంతర్గతం జ్యోతిః జ్యోతి రంతర్గతం మనః

ఆమనంబు నెచ్చోఁ లీనమగునో మఱియుఁ
బార్థ ! యోంకార మను ధ్వనివలననైన
నాదమున వాయుసంహరణంబు దనుక
అల నిరాలంబమైన బ్రహ్మంబునందు
నమరు నెట నాదములయంబు నందుచుండు
నదియె విష్ణుని పరమహా పదము తెలియ.

అర్జునుఁడు :—

39 పాంచభౌతిక దేహంబు భగ్నమగుడు
పంచ భూతంబులున్ గూడ పంచ ఁగనఁ
గాయమున్ బ్రాణముక్తంబుఁగాఁగ నపుడు
ధర్మము నధర్మ మెటకును దరలిపోవు ?

---

తస్మనో విలయం యాతి తద్విష్ణోః పరమం పదమ్
ఓంకారధ్వని నాదేన వాయోః సంహరణాంతికమ్
నిరాలంబం సముద్దిశ్య యత్ర నాదో లయంగతః.

అర్జున ఉవాచ:—

39 భిన్నే పంచాత్మకే దేహే గతే పంచసు పంచధా,
ప్రాణైర్విముక్తే దేహేతు ధర్మాధర్మౌ క్వ గచ్ఛతః?

శ్రీభగవానుఁడు :—

40 అలఘు చరిత ! ధర్మాధర్మములు మనంబు
పోల్చిచూడ నట్టులె పంచభూతములును
వరుస గణియింప నింద్రియ పంచకంబు
నన్యులగు పంచదేవత లట్లెకూడి
మనసుతోడుత నీసర్వమును సతంబు
మొనసి యభిమానవంతమై యునికిఁజేసి
అమలమగు తత్త్వమున్ బొందువంతదనుక
జీవుతోఁగూడుకొని లేచిపోవుచుండు.

అర్జునుఁడు :—

41 స్థావరము జంగమమునైన సకలమగు చ
రాచరాత్మక జీవచయంబులెల్ల

---

శ్రీభగవానువాచ:—

40 ధర్మాధర్మౌ మనశ్చైవ పంచభూతాని యాని చ
ఇంద్రియాణి చ పంచైవ యాశ్చాన్యాః పంచదేవతాః
తాశ్చైవ మనసా సర్వే నిత్యమేవాభిమానతః
జీవేన సహ గచ్ఛంతి యావత్తత్త్వం న విందతి.

అర్జున ఉవాచ:—

41 స్థావరం జంగమం చైవ యత్కించిత్సచరాచరమ్,

జీవునికతంబునఁ సిద్ధిఁజెందుచుండు
జీవుఁడాతఁడే తెలుఁగున సిద్ధినొందు ?

శ్రీభగవానుఁడు :-

42 ఆస్యనాసికామధ్యంబునందుఁ బ్రాణ
వాయువు చరించుచుండును పాయకుండఁ
బ్రాణవాయువున్ గ్రోలు న్నభంబు జీవుఁ
డింక నెద్దానికతన జీవించియుండు ?

అర్జునుఁడు :-

43 వ్యాపితంబు వ్యోమంబు బ్రహ్మాండమునను
విశ్వమును వ్యోమమందు సంవేష్టితంబు
ఆనభంబు సంతర్బహిర్వ్యాప్తముకద ?
దేవుఁడు నిరంజనుఁడయి వర్తిల్లుటెట్లు ?

---

జీవా జీవేన సిద్ధ్యంతి స జీవః కేన సిద్ధ్యతి?

శ్రీభగవానువాచ:-

42 ముఖనాసికయోర్మధ్యే ప్రాణస్సంచరతే సదా,
ఆకాశః పిబతి ప్రాణం స జీవః కేనజీవతి?

అర్జున ఉవాచ:-

43 బ్రహ్మాండవ్యాపితం వ్యోమ వ్యోమ్నా చావేష్టితం జగత్,
అంతర్బహిశ్చ తద్వ్యోమ కథం దేవో నిరంజనః?

## ప్రథమాధ్యాయము

శ్రీభగవానుఁడు :—

44 అరయ నాకాశ మవకాశ మన్నయదియు
వ్యాపితంబ యాకాశశబ్దంబుచేత
శబ్దము గుణంబుకా ? యాకసంబునకును
బ్రహ్మ ముక్తంబు "విగతశబ్దం" బటంచు.

అర్జునుఁడు :-

45 అరయ దంతోష్ఠతాలుజిహ్వాదికంబు
లాస్పదంబు లెవ్వానికి నగుచునుండు
నక్షరత్వము వానికి నగుటయెట్టు
లెప్పుడున్ క్షరత్వంబె వర్తించుఁగాదె ?

శ్రీభగవానుఁడు :-

46 అర్జున ! యఘోషసంజ్ఞ మవ్యంజనం బ
తాలుకంఠోష్ఠసంజనితం బరేఫ

---

శ్రీభగవా నువాచ:—

44 ఆకాశో హ్యవకాశశ్చ ఆకాశవ్యాపితం చ యత్,
ఆకాశస్య గుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే.

అర్జున ఉవాచ:—

45 దంతోష్ఠతాలుజిహ్వానా మాస్పదం యత్ర దృశ్యతే,
అక్షరత్వం కుతస్తేషాం? క్షరత్వం వర్తతే సదా.

శ్రీభగవా నువాచ:—

46 అఘోష మవ్యంజన మక్షరం చాప్యతాలుకంఠోష్ఠ మనాసికంచ,

జాతము ననాసికంబు నూష్మరహితంబు
నైన యామక్షరం బొకప్డైనఁ జెడదు.

అర్జునుఁడు :-

47 అఖిలభూతాధివాసిత మఖిలగతము
నైనయట్టి బ్రహ్మంబు నొయ్యన నెఱింగి
ఇంద్రియనిరోధమునఁజేసి యెట్లు యోగి
జనులు సంసిద్ధి లాభంబుఁ గనుచునుంద్రు ?

శ్రీభగవానుఁడు :-

48 దేహమందునఁ గంచు రింద్రియనిరోధ
మునను బరమాత్మనున్ మానవులు తమంత
దేహము నశించియుండ బుద్ధి యిఁక యేది ?
జ్ఞానమెక్కడ? బుద్ధినాశంబుఁ గలుగ.

---

అశేషజాతం పరమాత్మవర్జితంతదక్షరం న క్షరతే కథంచిత్

అర్జున ఉవాచ:—

47 జ్ఞాత్వా సర్వగతం బ్రహ్మ సర్వభూతాధివాసితమ్,
ఇంద్రియాణాం నిరోధేన కథం సిద్ధ్యన్తి యోగినః?

శ్రీభగవానువాచ:—

48 ఇంద్రియాణాం నిరోధేన దేహే పశ్యన్తి మానవాః,
దేహే నష్టే కుతో బుద్ధి? ర్బుద్ధినాశే కుతో జ్ఞాతా?

49 ఎంతపర్యంతమున్ దత్త్వ మెఱుఁగకుండు
నర్జున! నిరోధ మంతపర్యంతమె యగుఁ
బరమ తత్త్వంబుఁ దెలియంగఁ బడినయంత
నేకమైన బ్రహ్మము నె వీక్షించుచుండు.

50 గళికలుంబోలె నవరంధ్ర కలితములగు
తనువులు స్రవించెడున్ జ్ఞానమును విడువక
కాన నరుఁడు బ్రహ్మము నెఱుఁగంగ లేఁడు
ఏకమగు బ్రహ్మ మమలంబుఁ గాకపోదు.

51 ముఱికియైనది యత్యంతమున్ దనువు గ
ణింపఁగా దేహి యత్యంతనిర్మలుండు
తెలిసి యీరెంటిభేదమున్ దేనికి నిఁక
శౌచము విధింపఁబడును ? యోచనముఁ జేయు.

---

49 తావదేవ నిరోధస్స్యాద్యావత్తత్త్వం న విందతి,
విదితే తు పరే తత్త్వే ఏక మేవానుపశ్యతి.

50 నవచ్ఛిద్రాన్వితా దేహాః స్రవంతి గళికా ఇవ,
నైవ బ్రహ్మ న శుద్ధః స్యాత్పుమాన్ బ్రహ్మ న విందతి.

51 అత్యంతమలినో దేహో దేహీ చాత్యంతనిర్మలః,
ఉభయోరంతరం జ్ఞాత్వా కస్య శౌచం విధీయతే?

# అధ్యాయము 2.

అర్జునుఁడు :-

1 బ్రహ్మమున్ సర్వగతము సర్వజ్ఞము పర
మేశ్వరముఁగాఁగ దా జీవుఁ డెఱిఁగి "నేను
బ్రహ్మము" నటంచు నిర్దిష్టభావ మంద
నందును బ్రమాణమెయ్యదియగును? జెప్పుమ.

శ్రీభగవానుఁడు :-

2 తోయమునఁ దోయము ఘృతమందును ఘృతంబు
క్షీరమునందు క్షీరమ్ము నిక్షిప్తమగుచు
నెట్టు లవిశేష మగునో యూహింపనట్లె
పొసఁగు జీవాత్మ పరమాత్మములకుఁగూడ.

---

ద్వితీయోఽధ్యాయః.

అర్జున ఉవాచః—

1 జ్ఞాత్వా సర్వగతం బ్రహ్మ సర్వజ్ఞం పరమేశ్వరమ్,
అహం బ్రహ్మేతి నిర్దేష్టుం ప్రమాణం తత్ర కింభవేత్ ?

శ్రీభగవా నువాచః—

2 యథా జలం జలే క్షిప్తం క్షీరం క్షీరే ఘృతే ఘృతమ్.
అవిశేషో భవేత్తద్వజ్జీవాత్మ పరమాత్మనోః.

3 తాన యేకాగ్రవిదుఁడు ప్రమాణ లక్ష
ణముల నెఱుఁగ నా జ్యోతిర్మయమును సర్వ
గతము నీశ్వరభావ సంకలితమునయి
యలరు పరమాత్మతోడి జీవైక్యము తగ.

అర్జునుఁడు :-

4 జ్ఞేయమును దాని జ్ఞానంబుచేతన విశ
దంబుఁగా సాధకుఁడెఱింగి తత్క్షణంబ
జ్ఞానమాత్రముచే ముచ్యమానుఁ డగును
యోగధారణ నేమి ప్రయోజన మిఁక ?

శ్రీభగవానుఁడు :-

5 దేహమిది జ్ఞానయుక్తిం ప్రదీపితమయి
బుద్ధి బ్రహ్మసమన్వితంబునయి యుండఁ

---

3 జీవే పరేణ తాదాత్మ్యం సర్వగం జ్యోతిరీశ్వరమ్,
పరిమాణలక్షణైః జ్ఞేయం స్వయమేకాగ్రవేదినా.

అర్జున ఉవాచ:-

4 జ్ఞానాదేవ భవేద్జ్ఞేయం విదిత్వా తత్క్షణేన తు,
జ్ఞానమాత్రేణ ముచ్యేత కిం పున ర్యోగధారణా.

శ్రీభగవానువాచ:-

5 జ్ఞానేన దీపితే దేహే బుద్ధిః బ్రహ్మసమన్వితా,

బండితుండు బ్రహ్మజ్ఞాన పావకమునఁ
గర్మబంధనములను దగ్ధంబుఁ జేయు.

6 అంతటన్ బరమేశ్వరాఖ్యముఁ బవిత్ర
మంబరాభ మద్వైత రూపంబును నిరు
పాధికంబగు నాత్మరూపమ్మునందుఁ
గలియు జీవుండు జలమందు జలముపోలె.

7 అనిల మట్లు లంతర్యామి యభ్రమట్లు
సూక్ష్మమగుచు నీయాత్మ తాఁ జూడఁబడదు
జ్ఞానదీపిక బాహ్యాంతరవినిర్మ
లాత్ముఁ డంతర్ముఖుఁడు గను నరసి దాని.

8 జ్ఞాని యేదేని మిత్తిచేఁ దాను నెందు
నెందు మ్రందినవాఁడగు నెంచిచూడ

---

బ్రహ్మజ్ఞానాగ్నినా విద్వాన్నిర్దహేత్కర్మబంధనమ్.

6 తతః పవిత్రం పరమేశ్వరాఖ్యమద్వైతరూపం విమలాంబరాభమ్,
యథోదకే తోయమనుప్రవిష్టం తథాత్మరూపో నిరుపాధిసంస్థః.

7 ఆకాశవత్సూక్ష్మశరీర ఆత్మా న దృశ్యతే వాయువదంతరాత్మా,
స బాహ్యమభ్యంతరనిర్మలాత్మా జ్ఞానోల్కయా పశ్యతి
చాంతరాత్మా.

8 యత్ర యత్ర మృతో జ్ఞానీ యేన కేనాపి మృత్యునా,

సర్వగతమగు నంతరిక్షమ్ముగతి ల
యంబు నొందినవాఁడగు నందునందు.

9 నిండియుండును దనువున నిండియున్న
వ్యోమ మట్లు చతుర్దశ భువనములను
అట్లచల మమలంబు నిరంజనంబు
నైన దేహి సర్వవ్యాపియగుచునుండు.

10 నాసికాగ్రమునందు మనంబుతో ము
హూర్త మేనియుఁ జరియించుచుండు నేని
దాను జన్మశతార్జితమైన సర్వ
పాపమును దరియించెడివాఁడు వాఁడు.

11 కుడిదెసన్ వహ్నిమండలగోచరమయి
అనువుమై పుణ్యకర్మల ననుసరించి

---

యథా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయం గతః.

9 శరీరవ్యాపితం వ్యోమ భువనాని చతుర్దశ,
నిశ్చలో నిర్మలో దేహీ సర్వవ్యాపీ నిరంజనః.

10 ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ,
సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్.

11 దక్షిణే పింగళా నాడీ వహ్నిమండలగోచరా,

తనరుచుండెడి పింగళయనెడు నాడి
దేవయానం బటంచును దెలియఁగ నగు.

12 వామనిశ్వాసకలితమై సోమమండ
లమున గోచరించుచును జెలంగెడు నిడ
యనెడు నాడిని పితృయాన మం చెఱుఁగఁగ
నగు నదియునుండు వామంబు నాశ్రయించి.

13 వల్లకీదండతుల్య రూపంబునై గు
దంబు పృష్ఠభాగమున మూర్ధంబుదనుక
వ్యాప్తమై మేనుఁ దాల్చు దీర్ఘాస్థియష్టి
"బ్రహ్మదండి" యటంచుఁ జెప్పంగఁబడును.

14 దానితుదినున్న సూక్ష్మరంధ్రమును బుధజ
నంబు వాక్రుచ్చెదరు "బ్రహ్మనాడి" యనుచు

---

దేవయానమితి జ్ఞేయం పుణ్యకర్మానుసారిణీ.

12 ఇడా చ వామనిశ్వాసా సోమమండలగోచరా,
పితృయానమితి జ్ఞేయం వామమాశ్రిత్య తిష్ఠతి.

13 గుదస్య పృష్ఠభాగేఽస్మిన్ వీణాదండస్య దేహభృత్,
దీర్ఘాస్థిమూర్ధ్నిపర్యంతం బ్రహ్మదండీతి కథ్యతే.

14 తస్యాంతే సుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతి సూరిభిః

నిడకుఁ బింగళానాడికిన్ నడుమనుండు
సూక్ష్మరూపిణియైన సుషుమ్న నాడి
సర్వతోముఖమును మఱి సర్వగతము
నగు సకలముఁ బ్రతిష్ఠితమైన దందు.

15 దానినడుమ సూర్యుండుఁ జంద్రముఁడును బర
మేశ్వరుఁడు పంచభూతమ్ము లెల్ల లోక
ములు దిశల్ క్షేత్రములును సముద్రములును
పర్వతములు నానావిధోపలచయములు.

16 ద్వీపములును దరంగిణుల్ వేదములును
శాస్త్రవిద్యలుఁ గళలు నక్షరములున్ స్వ
రంబులున్ మంత్రములును బురాణములును
గుణములనునవి యెల్లను గూడియుండు.

---

ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ
సర్వం ప్రతిష్ఠితం తస్మిన్ సర్వగం సర్వతోముఖమ్.

15 తస్య మధ్యగతా స్సూర్యసోమాగ్ని పరమేశ్వరాః,
భూతలోకా దిశః క్షేత్రాః సముద్రాః పర్వతా శ్శిలాః.

16 ద్వీపాశ్చ నిమ్నగా వేదాః శాస్త్రవిద్యా కలాక్షరాః,
స్వరమన్త్రపురాణాని గుణాశ్చైతే చ సర్వశః.

17 అగ్ని మఱియు బీజంబు బీజాత్మకులయి
పరగు క్షేత్రజ్ఞులును వారి ప్రాణమారు
తంబులును సుషుమ్నాంతర్గతమ్ములగును
దీనియం దెల్లజగముఁ బ్రతిష్ఠితంబు.

18 సర్వనాడీసముద్భవ స్థానమగుచు
నఖిలభూతాంతరాత్మయం దలరెడు వని
శంబు నూర్ధ్వమూలము నధశ్శాఖము నయి
అనిలగతి సర్వగతమగు నా సుషుమ్న.

19 వాయుగోచరములు ద్విసప్తతిసహస్ర
నాడులున్ గర్మమార్గమునన్ సుషిరము
లగుచు వర్తిల్లెడున్ సుషిరాత్మకంబు
లగుచుఁ దిర్యగ్గతిన్ దనరారుచుండు.

---

17 బీజం బీజాత్మకస్తేషాం క్షేత్రజ్ఞాః ప్రాణవాయవః,
సుషుమ్నాంతర్గతం విశ్వం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్.

18 నానానాడీప్రసవకం సర్వభూతాంతరాత్మని,
ఊర్ధ్వమూలమధశ్శాఖం వాయుమార్గేణ సర్వగమ్.

19 ద్విసప్తతిసహస్రాణి నాడ్యస్స్యుర్వాయుగోచరాః,
కర్మమార్గేణ సుషిరా స్తిర్యక్ చ సుషిరాత్మికాః.

20 క్రిందికిన్ మీఁదికిన్ బ్రసరించుచుండు
వానియందు జీవుఁడు నవద్వారములను
దివిరి వాయువుతోడ శోధించుచుండగఁ
బడయు మోక్ష మూర్ధ్వజ్ఞానవంతుఁ డగుచు.

21 ఇందు నాసాగ్రమునఁ దూర్పునందు నింద్ర
లోక మమరావతియు నగ్నిలోకమైన
యట్టి తేజోవతీనామ పట్టణంబు
హృదిని జక్షువునందు వర్తిలుచునుండు.

22 యామ్యకర్ణమ్మునందు "సంయమి"యనియెడు
యమపురంబు ప్రతిష్ఠితమై తనర్చుఁ
గ్రమతఁ దద్వామకర్ణపార్శ్వంబునందు
నైరృతమగు నైరృత భువనంబుఁ దనరు.

---

20 అధశ్చోర్ధ్వగతాస్తాసు నవద్వారాణి శోధయన్,
వాయునాసహ జీవోర్ధ్వజ్ఞానీ మోక్షమవాప్నుయాత్.

21 అమరావతీంద్రలోకోఽస్మిన్ నాసాగ్రే పూర్వతో దిశి,
అగ్నిలోకో హృది జ్ఞేయశ్చక్షు స్తేజోవతీ పురీ,

22 యామ్యాం సంయమినీశ్రోత్రే యమలోకః ప్రతిష్ఠితః,
నైరృతో హ్యథ తత్పార్శ్వే నైరృతో లోక ఆశ్రితః.

23 వరుణసంబంధినియగు "విభావతి"యను
పురి ప్రతీచిపృష్ఠంబునఁ బొదలుచుండుఁ
గర్ణపార్శ్వస్థమైన భాగంబునందు
వాయుదేవు లోకము గంధవతి పరంగు.

24 ఉత్తరదిశను కంఠమునుండి యెడను
చెవిదనుక దేహ మాశ్రయించియుఁ గుబేరు
పట్టణము పుష్పవతిపేరఁ బరఁగు సోమ
లోకము ప్రతిష్ఠితంబై వెలుంగుచుండు.

25 అలరుచుండెడు నీశానియగు "మనోన్మ
ని"యను శివలోక మల వామనేత్రమందు
మూర్ధభాగమ్మునన్ బ్రహ్మపురియు నుండు
నఖిల బ్రహ్మాండమును మేని నాశ్రయించు.

---

23 విభావతీ ప్రతీచ్యాంతు పృష్ఠే వారుణికా పురీ,
వాయోర్గంధవతీ కర్ణపార్శ్వే లోకః ప్రతిష్ఠితః.

24 సౌమ్యా పుష్పవతీ సౌమ్యే సోమలోకస్తు కంఠతః,
వామకర్ణే తు విజ్ఞేయో దేహమాశ్రిత్య తిష్ఠతి.

25 వామే చక్షుషి ఈశానీ శివలోకో మనోన్మనీ,
మూర్ధ్ని బ్రహ్మపురీ జ్ఞేయా బ్రహ్మాండం దేహమాశ్రితమ్.

26 పాదములక్రింద శివుఁడును బ్రళయరూప
కుం డనంతుండుఁ గాలాగ్ని యుండుఁ జూవె
క్రింద మీఁదను మధ్యమునందు లోను
వెలి ననామయ శివరూపవిభవ మొప్పు.

27 పాదతల మతలం బగుఁ బాదమున్ వి
తలముగఁ దెలియుదురు తారు తత్త్వవిదులు
నితలముగఁ బాదసంధియు సుతలముగను
దెల్పఁబడుచుండు జంఘప్రదేశ మల్లె.

28 అల్లె జానుతలమ్ము మహాతలముగ
సుంగ నూరుదేశంబు రసాతలముగఁ
గటియును దలాతలముగఁ బ్రోక్తంబులయ్యె
"సప్తపాతాళము"లనెడు సంజ్ఞతోడ.

---

26 పాదాధస్స్యాదనంతః కాలాగ్నిః ప్రళయాత్మకః,
అనామయః శివశ్చోర్ధ్వం మధ్యమం తు బహిశ్శివమ్.

27 అధః పదోఽతలం విద్యాత్పాదం చ వితలం విదుః,
నితలం పాదసంధిశ్చ సుతలం జంఘముచ్యతే.

28 మహాతలం తు జానుస్స్యా దూరుదేశో రసాతలమ్,
కటిస్తలాతలం ప్రోక్తం సప్తపాతాళసంజ్ఞయా.

29 నాభిక్రిందను కాలాగ్ని నరక మతిభ
యంకరము మహాపాతాళ మనెడి పేరఁ
బరగు పాతాళలోక మొప్పారుచుండు
భోగిరాట్ఫణామండల భూషితమయి
అందు జీవసంజ్ఞకుఁడై యనంతభోగి
యంతటన్ జుట్టుకొని చెలువారుచుండు.

30 నాభితలము భూలోకమనంగఁబడును
కుక్షియును భువర్లోక మగును దెలియఁగఁ
దలఁప సూర్యాదిక గ్రహతారకా స
మేతమగు స్వర్గలోకంబు హృదయమగును.

31 సూర్యుఁడును తారకాన్వితసోముఁడు బుధుఁ
డంగిరుండును శుక్రుండు మంగళుండు

---

29 కాలాగ్నినరకం ఘోరం మహాపాతాళసంజ్ఞయా
పాతాళం నాభ్యధో భాగః భోగింద్రఫణిమండలమ్
వేష్టిత స్సర్వతోఽనంతః సంబిభ్రజ్జీవసంజ్ఞకః.

30 భూలోకో నాభిదేశస్తు భువర్లోకస్తు కుక్షితః,
హృదయం స్వర్గలోకస్తు సూర్యాదిగ్రహతారకాః.

31 సూర్య స్సోమ స్సనక్షత్రో బుధశ్శుక్ర కుజోఽంగిరాః,

సప్తముండైన శనియును స్వర్గలోక
మునకు నంతంబునందు ధ్రువుఁడని తెలియు.
32 హృదయమున నిట్లు తాను గల్పించుకొనఁగ
వలయు సర్వసుఖంబును బడయుఁ దాన
హృదయమందు మహర్లోక మెన్నఁబడును
కలిగెడున్ జనోలోకంబు కంఠమందు
బొమలనడుమఁ దపోలోకమును దనరును
మూర్ధమున సత్యముఁ బ్రతిష్ఠఁ బొందుచుండు.
33 అణఁగు బ్రహ్మాండరూపిణియైన పృథ్వి
తోయమధ్యంబునందు నాతోయమును బ
చింపఁబడు నగ్నిహోత్రముచేత నగ్ని
వాయుదేవునిచే గ్రసింపంగఁబడును.

---

మందశ్చ సప్తమో జ్ఞేయః ధ్రువోంత స్స్వర్గలోకతః.
32 హృదయే కల్పయేత్ యోగీ తస్మిన్ సర్వసుఖం లభేత్
హృదయేచ మహర్లోకం జనోలోకంతు కంఠతః
తపోలోకం భ్రువోర్మధ్యే మూర్ధ్నిసత్యం ప్రతిష్ఠితమ్.
33 బ్రహ్మాండరూపిణీ పృథ్వీ తోయమధ్యే విలీయతే,
అగ్నినా పచ్యతే తోయం వాయునా గ్రస్యతేఽనలః.

34 వాయువును గ్రోలు నభము నభంబు నట్లె
మానసమునందు లీనమై మణఁగిపోవు
బుద్ధియు నహంకృతియుఁ జిత్తమును విలీన
మగును క్షేత్రజ్ఞుఁడగు పరమాత్మునందు.

35 నేను బ్రహ్మమునను చు ధ్యానింపవలె నొ
కప్పుడేనియు నన్ను నేకాగ్రబుద్ధి
కల్పకోటి శతార్జితాఘంబు నెల్ల
నాతఁడు క్షణంబులోనఁ బాపుంగలండు.

36 ఘటసమావృతమైనయాకాశ మెట్లు
ఘటము విధ్వస్తమైన నాఘటముతోడ
నాశనముఁబొందకుండు నెన్నంగ నట్లె
యైక్యమగు జీవుఁడున్ బరమాత్మయందు.

---

34 ఆకాశస్తు పిబేద్వాయుం మనస్యాకాశమేవ చ,
బుద్ధ్యాహంకారచిత్తం చ క్షేత్రజ్ఞే పరమాత్మని.
35 అహం బ్రహ్మేతి మాం ధ్యాయేదేకాగ్రమనసా సకృత్,
సర్వం తరతి పాప్మానం కల్పకోటిశతైః కృతమ్.
36 ఘటసంవృతమాకాశం లీయమానే యథా ఘటే,
ఘటో నశ్యతి నాకాశం తద్వజ్జీవః పరాత్మని.

37 అల ఘటాకాశమునుబోలె నాత్మ నెవఁడు
తగ నెఱుంగు నైక్యమ్ము వాస్తవముగాఁగ
నతఁడుఁ బొందు నిరాలంబమైన జ్ఞాన
లోకమున్ సంశయంబుఁ గలుగ దొకింత.

38 ఏకపాదస్థుఁడగుచు వేయేండ్లు నరుఁడు
భీకరంబగు తపముఁ గావించెనేని
నొక్క ధ్యానయోగమ్మున నొప్పెడు పదు
నాఱవదియైన కళకుఁ దుల్యంబుఁ గాదు.

39 ఆరయన్ బ్రహ్మహత్యాసహస్రములును
భ్రూణహత్యా దురితశతంబులనుగూడ
నింధనసముత్కరమును వహ్నియును బోలెఁ
గాల్చివైచును ధ్యానయోగం బొకటియు.

---

37 ఘటాకాశమివాత్మానం విలయం వేత్తితత్త్వతః,
స గచ్ఛతి నిరాలంబం జ్ఞానలోకం న సంశయః.

38 తపేద్వర్ష సహస్రాణి ఏకపాదస్థితో నరః,
ఏకస్య ధ్యానయోగస్య కళాం నార్హతి షోడశీమ్.

39 బ్రహ్మహత్యాసహస్రాణి భ్రూణహత్యాశతానిచ,
ఏకో హి ధ్యానయోగశ్చ దహత్యగ్నిరివేంధనమ్.

40 చలముమీఱ మర్త్యుడు ధర్మశాస్త్రములును
నాల్గువేదంబు లధ్యయనంబుఁ జేసి
లేశమున్ బ్రహ్మము నెఱుంగ లేకయుండుఁ
బాకసారమ్మునున్ దెడ్డుపగిది జడిమ.

41 భారమె యెఱుఁగుఁ జందన సారమేమి
యెఱుఁగు ? చందన భారవాహియగు ఖరము
అట్లె పెక్కు శాస్త్రంబుల నధ్యయనము
సలిపి సారమెఱుంగక జనుఁడుఁ దాల్చు.

42 ఎంతదనుకఁ దత్త్వంబుఁ దా నెఱుఁగకుండు
నంతదనుక ననంతకర్మాభిరతియు
శౌచజపయజ్ఞములు నతి శ్రద్ధతోడి
తీర్థయాత్రాను గమనంబుఁ దెలియఁగనగు.

---

40 అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణి మానవః,
యో వై బ్రహ్మ న జానాతి దర్వీ పాకరసం యథా.

41 యథా ఖరశ్చందనభారవాహీ భారస్య వేత్తా న తు చన్దనస్య.
తథైవశాస్త్రాణిబాహూన్యధీత్యసారంనజానన్ఖరవద్వహేత్సః.

42 అనంతకర్మశౌచం చ జపయజ్ఞస్తథైవ చ,
తీర్థయాత్రానుగమనం యావత్తత్త్వం న విందతి.

43 అరయఁగ ననేకవర్ణములగు మొదవుల
పాలు భాసిల్లుఁగద యేకవర్ణకమయి
గోగణంబులపాలులాగున నెరయొప్ప
దేహతతుల విజ్ఞానంబుఁ దెలిసిచూడ

44 నేను బ్రహ్మమననుచును నియతితోడఁ
దలఁచుటయె మోక్షహేతువు తత్జ్ఞులకును
బంధమోక్షములకు రెండె పదము లగును
నాదికాదిదియనియును నాదియనియు.
నాదనిన జంతు వస్థై బంధమును బొందు
నాదికాదనిన విమోచనంబుఁ బడయు.

45 ఉన్మనీభావమునఁ జేసి యుల్లమునకు
ద్వైతభావం బొకింత లభ్యంబుకాదు

---

43 గవా మనేకవర్ణానాం క్షీరంస్యా దేకవర్ణకమ్,
క్షీరవద్భాతి విజ్ఞానం దేహినాంచ గవాం యథా.

44 అహంబ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మభిః,
ద్వే పదే బంధమోక్షాయ న మమేతి మమేతి చ
మమేతి బధ్యతే జంతుర్న మమేతి విముచ్యతే.

45 మనసో హ్యున్మనీభావాద్ద్వైతం నైవోపలభ్యతే.

ఉన్మనీభావమును బొందుచుండు నెప్పు
డాపరమమగు పదముఁ దా నపుడె పొందు.

46 పొల్లుదంచిన పిడికిటి పోట్ల మిన్ను
నొంచినన్ క్షుధార్తునకు లాభించు నొక్కొ
"నేను బ్రహ్మము" ననుబుద్ధి లేనివాని
కెన్ని జేసియు ముక్తి లాభించ దల్లె.

---

## అధ్యాయము 3.

శ్రీభగవానుఁడు :-

1 వినుము శాస్త్రము సనంతమ్ము వేద్యమొ యధి
కంబు కాల మల్పంబు విఘ్నములు పెక్కు

---

యదా యా త్యున్మనీభావం తదా తత్పరమం పదమ్.

46 హన్యాన్ముష్టిభి రాకాశం క్షుధార్తః ఖండయేత్తుషమ్,
నాహం బ్రహ్మేతి జానాతి తస్య ముక్తిర్న జాయతే.

---

తృతీయోఽధ్యాయః.

శ్రీభగవా నువాచ:—

1 అనంతశాస్త్రం బహువేదితవ్య మల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః,

లగుట సారంబుసేవింపనగును హంస
మంబుసమ్మిశ్రమైన క్షీరంబునుబలె.

2 వివిధములగు శాస్త్రమ్ములు వేదముల్ పు
రాణముల్ భారతంబు నిరంతరమగు
పుత్రదారాది సంసారములును విఘ్న
జనకములగు యోగాభ్యాసమునకు ధ్రువము.

3 జ్ఞానమిది జ్ఞేయమిది యని సర్వము నెవఁ
డిచ్ఛగించునో తనయంత నెఱుఁగుటకయి
హాయన సహస్రకమ్ములనైనను బడ
యంగఁజాలఁడు వాఁడు శాస్త్రార్థములను.

4 ఎఱిమి నక్షరతన్మాత్రి తెలియఁదగ్గ
దెంచఁగా జీవితం బతిచంచలంబు

యత్సారభూతం తదుపాసితవ్యం హంసో యథా క్షీరమివాంబుమిశ్రిమ్.

2 పురాణం భారతం వేదశ్శాస్త్రాణి వివిధాని చ,
పుత్రదారాదిసంసారో యోగాభ్యాసస్య విఘ్నకృత్.

3 ఇదం జ్ఞాన మిదం జ్ఞేయం యస్సర్వం జ్ఞాతుమిచ్ఛతి,
అపి వర్షసహస్రాణి శాస్త్రాన్తం నాధిగచ్ఛతి.

4 విజ్ఞేయోఽక్షరతన్మాత్రో జీవితం చాపి చంచలమ్,

కావునన్ శాస్త్రజాలమ్ముఁ బోవిడిచియు
నేది సత్యమొ యది యుపాసింపఁగనగు.

5 పృథివియందలి యీ భూతవితతియెల్ల
నెంచిచూడ జిహ్వోపస్థహేతుకంబ
కడఁగి జిహ్వా నుపస్థమున్ విడిచినైన
నున్నదే పృథ్విలోఁ బ్రయోజనంబు?

6 తివిరి తోయరూపములైన తీర్థములను
మిగిలి పాషాణమయములున్ మృణ్మయములు
నైనయట్టి దేవతల నుపాసన సలు
పంగ నొల్ల రాత్మధ్యానపరులు యతులు.

7 ద్విజులకును వీతిహోత్రుండు దేవుఁడగును
హృదిని దైవత ముండు మునీశ్వరులకు

---

విహాయ శాస్త్రజాలాని యత్సత్యం తదుపాస్యతామ్.
5 పృథివ్యాం యాని భూతాని జిహ్వోపస్థనిమిత్తకమ్,
జిహ్వోపస్థపరిత్యాగే పృథివ్యాం కిం ప్రయోజనమ్?
6 తీర్థాని తోయరూపాణి దేవాః పాషాణమృణ్మయాః,
యోగినో న ప్రపద్యంతే ఆత్మధ్యానపరాయణాః.
7 అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతమ్,

ప్రతిమ దైవతమగు స్వల్పమతులకు సమ
దర్శులకు నెల్లచో నుండు దైవతంబు.
8 జ్ఞాన మనియెడు నేత్రంబు లేనికతన
నంతటఁ జెలంగువాఁడును శాంతుఁడునగు
వాసుదేవుని గనలేఁడు పామరజనుఁ
డుదితుఁడగు సూర్యు నంధుపగిది నిజంబు.
9 ఎచ్చటెచ్చట మనము ప్రయాణించుచుండుఁ
బరఁగు నచ్చట నచ్చటన్ బరమపదము
అంతటన్ సమవస్థితమైన ఘట్టి
పరమమగు బ్రహ్మ మందందుఁ బరగుచుండు.
10 దృశ్యమునన్ రూపములు నిరీక్షింపఁబడును
అంబరంబు విరాజిల్లు నమలమగుచు

---

ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శినామ్.
8 సర్వత్రావస్థితం శాన్తం న పశ్యేజ్జనార్దనమ్,
జ్ఞానచక్షుర్విహీనత్వాదంధ స్సూర్యమివోదితమ్.
9 యత్రయత్ర మనో యాతి తత్ర తత్ర పరంపదమ్,
తత్రతత్ర పరంబ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్.
10 దృశ్యంతే దృశి రూపాణి గగనం భాతి నిర్మలమ్,

వ్యాపకంబు పరబ్రహ్మ మవ్యయంబు
నక్షరము నయి 'నే' ననునది పరంబు.

11 హంసరూపజీవాకృతి నరసి కాంచఁ
గల్గె నేని నాపంబు ఖగాకారయుతము
సకలము న్నిష్కలంబు సూక్ష్మంబు నతి వి
నిర్మలంబు మోక్షద్వార నిర్గతంబు.

12 వ్యాపకం బపవర్గనిర్వాణరూప
భాగ్యసంధాయకంబును పరమ మవ్య
యంబు వ్యోమరూపంబు స్వయంప్రకాశ
మఖిలభూతాధివాసిత మత్యమలము
నవ్యయంబును పరమంబునైన యా ప
రాత్మఁ జింతింపవలయు బ్రహ్మత్మఁడగుచు.

---

అహ మిత్యక్షరం బ్రహ్మ పరమం విష్ణు మవ్యయమ్.

11 దృశ్యతేచే త్ఖగాకారం ఖగాకారం విచింతయేత్,
సకలం నిష్కలం సూక్ష్మం మోక్షద్వారేణ నిర్గతమ్.

12 అపవర్గస్య నిర్వాణం పరమం విష్ణుమవ్యయమ్
సర్వాత్మ జ్యోతిరాకాశం సర్వభూతాధివాసితమ్,
సర్వత్రపరమాత్మానం బ్రహ్మత్మా పరమవ్యయమ్.

13 "నేను బ్రహ్మంబ"ననుచును నిరత మేన
రుండు సర్వంబుఁ దెలియుచునుండు వాఁడు
వివిధదివ్యాశియున్ సర్వవిక్రియునయి
తాన యీకామములను హతంబుఁ జేయు.

14 నిమిష మే న్నిమిషార్ధ మేనియును నిశ్చ
తముగ శీతోష్ణ పరిభృతిక ద్వంద్వములను
సైచి కేశవునందు నచంచలముగు
భక్తి యబ్బిన నిఁక వైభవముల నేమి ?

15 భైక్షమగునన్నమును దేహరక్షకొఱకు
బొంత శీతార్తి రూపుమాపుటకొఱకును
దా నపేక్షించు నశ్మజాంబూనదముల
నత్తెఱఁగున నె శాకశాల్యన్నములను.

---

13. అహం బ్రహ్మేతి యస్సర్వం విజానాతి నరస్సదా,
హన్యాత్స్వయ మిమాన్ కామాన్ సర్వాశీ సర్వవిక్రియీ.

14. నిమిషం నిమిషార్ధం వా శీతాశీతనివారణమ్,
అచలా కేశవే భక్తి ర్విభవైః కిం ప్రయోజనమ్?

15. భిక్షాన్నం దేహరక్షార్థం కంథాశీతనివారణమ్,
అశ్మానం చ హిరణ్యం చ శాకం శాల్యోదనం తథా.

16 యోగి సమముగ భావించుచుండు మఱియుఁ
చింత్యమగు పదార్థం బపేక్షింపుచుండి
భూతవస్తువుకై కుందఁబోక మెఁలఁగు
నట్టివాఁడు పునర్జన్మ నందఁబోఁడు.

గద్యము

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, శ్రీగద్వాల
సంస్థానాస్థాన కవులు, శ్రీమదాంధ్రభాగవత మహా
పురాణ గ్రంథకర్తలు "శ్రీరామ నృసింహమూర్తి
కవులు" అను గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి
నరసింహమూర్తులచే రచింపఁబడిన
శ్రీ తేటగీత భగవద్గీతయందలి ఉత్తరగీత
సంపూర్ణము.

---

16 సమానం చింతయేద్యోగీ యది చింతామపేక్షతే,
భూతవస్తున్యశోచిత్వే పునర్జన్మ న విద్యతే.
ఇతి శ్రీమన్మహాభారతే శతసహస్రి సంహితాయాం వైయాసిక్యాం
అశ్వమేధపర్వణి శ్రీ ఉత్తరభగవద్గీతా సమాప్తా.

# సవరణ.

| పుట. | పంక్తి. | |
|---|---|---|
| 4 | 5 | పెక్కులు - పెక్కురు. |
| 43 | 1 | కామములజయించి - కామములఁద్యజించి. |
| 45 | 4 | మిథ్యాచార్యుఁడు - మిథ్యాచారుఁడు. |
| 54 | 1 | జ్ఞానియైనసీప్ర - జ్ఞానియుండినఁబ్ర. |
| 66 | 9 | యజ్ఞముల్ - యజ్ఞమున్. |
| 67 | 2 | యింద్రియాం - నింద్రియా. |
| 72 | 5 | భిన్నము - ఛిన్నము. |
| 73 | 9 | సాంఖ్యయోగములను - సాంఖ్యమును యోగమును. |
| 74 | 3 | సాంఖ్యంబు - సాంఖ్యమున్. |
| 76 | 1 | కేవలమునైన - కేవలములైన. |
| 121 | 6 | బ్రికృతిన్ - ప్రకృతిని. |
| 136 | 7 | నాదివ్యములయి - వా దివ్యములయి. |
| | 8 | బూర్ణమగును - బూర్ణముగను. |
| 151 | 8 | నప్రమేయునిన్ - నప్రమేయు నిన్. |
| 154 | 16 | భీష్మద్రోణ - భీష్మద్రోణ |
| 158 | | పూర్యగీత - పూర్వగీత. |
| 161 | 17 | లోకతమే - లోకత్రమే. |

| పుట. | పంక్తి. | |
|---|---|---|
| 163 | 3 | ఆత్మయోగంబుచేత-ఆత్మయోగాన నీకు. |
| | 13 | యత్రైత్వదన్యేన - యన్మేత్వదన్యేస. |
| 183 | 7 | నాత్మహింస - నాత్మ హింస. |
| 189 | 8 | దమమునుంచేస్చు - దమమునుంబేర్చు. |
| 195 | 7 | నధశ్శాఖయునయి - నధశ్శాఖమునయి. |
| 196 | 2 | నిగెడెడు - నిగిడెడు. |
| 197 | 3 | రత్య - రవ్య. |
| 213 | 10 | బెంచునదియు - బెంచునవియు. |
| 215 | 6 | మత్రహీనం - మంత్రహీనం. |
| | 12 | తపంబుఁగాఁగ - తపంబుగాఁగ. |
| 216 | 4 | తపంబుఁగా - తపంబుగా. |
| 222 | 10 | త్యాజ్యంబుఁగాదు - త్యాజ్యంబుగాదు. |
| 226 | 17 | బుద్ధిరస్య - బుద్ధిర్యస్య. |
| 237 | 18 | విభకేషు - విభక్తేషు. |
| 244 | 5 | ధర్మమైన - ధర్మ్యమైన. |
| 252 | 14 | గచ్ఛన్నిత్తిష్ఠ - గచ్ఛంతిష్ఠ. |
| 257 | 5 | యోచించిచూడ - కాంతేయ!ఏంటె? |
| | 6 | నున్నచో - యున్నచో. |

# శ్రీరామ నృసింహమూర్తి కవుల గ్రంథములు.

1 శతావధానము:-(నూఱు గడ్డు ప్రశ్నలు, సమాధానములు) రు. 0-50
2 మణిరత్నమాల:-(నూఱు వేదాంతప్రశ్నలు, సమాధానములు, పద్యములు) రు. 0-50
3 చాటువులు:- లోకస్వభావము నెఱిఁగించుపద్యములు. రు. 0-50
4 ఆంధ్రపుష్పబాణవిలాసము:- రు. 0-50
5 తేటగీత-భగవద్గీత (పూర్వగీత & ఉత్తరగీత) రు. 2-0
6 శ్రీమదాంధ్రభాగవతము (వ్యాసకృత సంస్కృతమూలమునకు సరియైన ఆంధ్రానువాదము; పద్యకావ్యము) రాయల్ సైజున సుమారు 1500 పుటలు 10 వేల పద్యములతో 5 సంపుటములుగ ప్రచురింపఁ బడినది. గ్రంథాలయములకు ప్రభుత్వమువారిచే అప్రూవు కాఁబడినది. 1,2,3 స్కం॥ ప్రథమ. 4,5,6 స్కం॥ ద్వితీయ. 7, 8, 9 స్కం॥ తృతీయ. 10వ స్కం॥ చతుర్థ. 11,12 స్కం॥ పంచమ సంపుటములు.

5 సంపుటముల పూర్తి సెట్టు (క్యాలికో బైండింగ్) రు. 25-0
విడిసంపుటము (కట్ బైండింగ్) రు. 5-0

వలయువారు:—

గంధం శ్రీరామమూర్తి, ఉండి. ప॥గో॥జిల్లా. (లేదా)
ఇణ్ణింకి నరసింహమూర్తి, తోలేరు(వయా)వీరవాసరం. ప॥గో॥ల్లా.
ఆంధ్రప్రదేశ్ అని వ్రాయవలెను.

☞ శ్రీరామ నృసింహమూర్తికవికృత శ్రీమదాంధ్ర భాగవత మునుగూర్చిన పత్రికాభిప్రాయ మొకటి గమనింపుఁడు.

వేమూరి ఆంజనేయశర్మ, సి. నారాయణరెడ్డిగార్ల సంపాదకత్వమున హైదరాబాదునుండి వెలువడు "స్రవంతి" అను సాహిత్య మాసపత్రిక 1958 సం॥ జూన్ సంచిక పుస్తకపరిచయము. శ్రీమదాంధ్రభాగవతము. రచయితలు: శ్రీరామ నృసింహమూర్తి కవులు, గద్వాల సంస్థానాస్థానకవులు.

భాగవతము తత్త్వశాస్త్రము నిముడ్చుకొనిన పురాణము. తత్త్వశాస్త్రాధ్యయనానుష్ఠానమువలనిఫల మానందము. అది కావ్యానందముకంటె భిన్నము. కావ్యానందము రసానందము. అది బ్రహ్మానందము. భారతభాగవతములు క్రమముగా రసానంద బ్రహ్మానంద ప్రతిపాదకములు. అవి రెండును వ్యాసకృతములుగా సంస్కృతమున ప్రసిద్ధములు. భాగవతము నింతకుపూర్వము తెనుగుచేసిన వారిలో పోతన్నగారే ముఖ్యులు. (గంగన, సింగన, నారయ) హరిభట్టు ఏకాదశ ద్వాదశ స్కంధములు, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు. వీరందఱును చంపూపద్ధతిని చేసినవారు. పూర్తిగానైన భాగవతానువాదములలో ఈ శ్రీరామ నృసింహమూర్తికవుల ఈ గ్రంథమే మొదటిది. వీ రిరువురును శతావధానులు, ఉభయభాషా ప్రవీణులు. ఇందొకరు శ్రీ గంధం శ్రీరామమూర్తి. రెండవవారు శ్రీ ఇట్టింకి నరసింహమూర్తి కలిసి శ్రీరామ నృసింహమూర్తికవులు.

"వ్యాసమునిప్రోక్త భాగవతపురాణ మాంధ్రీకృతంబుమున్నె సంగాని। సురవాణిపైఁగల్గు సురుచిరభక్తి భావంబె యీ యాంధ్రాను వాదమునకుఁ। జేర్చి రేచె" అనియు, లక్షణయుతంబుఁగాఁగ మూలంబు కంటె। న్యూన మధికంబుఁగాని-సముచితపరణి। నింపెసఁగు నుడి కారంపు సొంపు పెంపు। నింపు తెల్గింపుఁజేసి నిలింపవినుత! సిద్ధని గండు" అనియు కవు లవతారికలో చెప్పుకొనియున్నారు. ఈవీరు చెప్పికొన్న విషయము గ్రంథపఠనమున స్పష్టపడును. ఈఅనువాద మునందున్న ఒక క్రొత్తగుణము ఏఅధ్యాయమున కాఅధ్యాయము తద్గత విషయసూచికగా నొకశ్లోకము ముందుంచి శుక, సూత, విదుర, మైత్రేయాదివ్యక్తు లెవ రెవరు ఏమేమి మాట్లాడినదియును నాటకము నందువలె సూచించుచు మూలమును యథాతథముగ నాంధ్రీకరించుట ఈఅనువాదము పోల్చుకొనుటకును సులువు చేసినది.

ఇట్టిగ్రంథము విమర్శించుట అనగా, మూలమునకును అను వాదమునకును గల దగ్గరతనము నిరూపించుటతో పాటు ఉచితానుచి తముల విచారించుట ఒకటి. పద్యములనడక ననుగూర్చి చెప్పుట రెండు. శతావధానులపద్యములనడక ననుగూర్చి యేమియుఁజెప్పరాదు. ఏమన? పద్యముల నడకలలోని కీలకములన్నియు వారికిఁదెలియును.

ఆ వెసులుబాటు చిక్కించుకొన్నదే శతావధానము. అసలు ఆశుకవిత్వమునకే అదికావలయును. ఒకటి రెం డనువాదముల నుదాహరించిన పద్యములనడక, మూలమునకుగల దగ్గరతనము అదే

తెలిసివచ్చును. 1 ప్రథమస్కంధమునందు భీష్మకృత శ్రీకృష్ణస్తవమున శ్లో॥ "సపది సఖివచో నిశమ్య మధ్యే । నిజపరయో ర్బలయో రథం పరివేశ్య । స్థితవతి పరసైనికాయురక్ష్ణా । హృతవతి పార్థసఖే రతి ర్మమాఽస్తు॥" అని ఉన్నమూలమును శ్రీరామకృష్ణసింహాద్రి కవులు:—

చ॥ చెలువునిమాటచే నుభయసేనలమధ్యను దక్షిణంబ తే
ర్నిలిపి విరోధిసైనికవరేణ్యుల యాయువులెల్ల వాడిచూ
పులహరియించుచున్ విజయమున్ వడిఁ గ్రీడికిఁ గల్గఁజేయు నా
హాలఁ జెలువారు పార్థసఖునందు సదారతి నాకుఁ గల్గెడున్.

అని తెన్గించినారు. దీనిని పోతన్న.

"నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యము జొచ్చి తాఁ
బరులీక్షింప రథంబునిల్పి పరభూపాలావళిం జూపుచున్
పరభూపాయువులెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు న
ప్పరమేశుండు వెలుంగుచుండెడు సుహృద్పద్మాసనాసీనుఁడై॥"

అని తెన్గించెను. మూలకర్తచేఁ బార్థసఖుఁడుగఁ జెప్పఁబడిన శ్రీకృష్ణుఁడు పోతన్నగారిచేతిలో పరమేశ్వరుఁడని వాచ్యముఁ జేయఁబడెను. మూలమునలేనివిన్నియు పోతన్న శ్రీకృష్ణునికంటఁగట్టెను. సపది (ఉభయోః సేనయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత! అన్న తత్క్షణము) ఇట్టివి వదలెను. పరభూపావళిం జూపుచున్, శుంభత్కేళి, పరమేశుండు వెలుంగుచుండెడు సుహృత్పద్మాసనాసీనుఁడై. ఇట్టివి

చేర్చెను. మూలమునకేదియెంతదగ్గరగానున్నదియు ప్రయోజనమును గమనింపుడు.

2 నవమస్కంధమందలి అంబరీషోపాఖ్యానమున-

శ్లో॥ గృహేషు దారేషు సుతేషు బంధుషు ద్విపోత్తమస్యందన వాజిపంక్తిషు। అక్షయ్యరత్నాభరణాయుధాది ష్వనంతకోశే ష్వకరో దసన్మతిమ్॥ అను మూలమునకు శ్రీరామ నృసింహమూర్తికవులు—

దారసుతాదులం దవసథంబులయందు రథంబులందుఁ బె
న్వారణవాజులందు వసనాభరణాయుధరాజులందు భం
డారములందు బాంధవగణంబులయందును నంబరీషధా
త్రీరమణాగ్రగణ్యుఁడొనరించె నసన్మతి సంయతాత్ముఁడై.

అని వ్రాసిరి గా పోతన్నగారు.

"అతని కీహామాసె హరులందుఁ గరులందు ధనములందుఁ గేళి వనములందు। పుత్రులందు బంధుమిత్రులయందును పురమునందు నంతిపురమునందు" అని తెన్గించిరి.

మూలశ్లోకము కూర్పులోనున్న అందము, సప్తమీ బహువచనములు వ్యాసునితో పోటీపడినట్లు శ్రీరామ నృసింహమూర్తికవులెంత అలవోకగా తెనుగునకు తెచ్చినదియు తెలియుచున్నది. పోతన్నగారి పద్యమున కొన్నియే రాఁగల్గినవి. గమనింపుడు.

3 దశమస్కంధమున కాళియఫణిమర్దనానంతరము వానిభార్యలైన నాగాంగనలు శ్రీకృష్ణుని నుతించుఘట్టమున

శ్లో॥ "నమోఽనంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే
నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే నమః
ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే॥"

అనియున్న మూలమును శ్రీరామ నృసింహమూర్తి కవులు అనంతుఁడవు, సూక్ష్ముఁడవు, కూటస్థుఁడవు, కోవిదుఁడవు, నానావాదానురోధుండవు, వాచ్యవాచకశక్తిసంపన్నుఁడవు నగు నీకు జోహార్లు. ప్రమాణమూలుఁడవు, కవివి, శాస్త్రయోనివి ఇత్యాదిగా ననువదించిరి. పోతన్నగారు "కలండు, లేడు, సర్వంబు నెఱుంగు, ఇంచుకయు నెఱుంగు, బద్ధుండు, విముక్తుఁడు, ఒకండు, అనేకుండు అనునవి మొదలుగాఁ గల వాదంబుల మాయవలన నానావాదానురోధకుండవయ్యును" అని యొక నానావాదానురోధకుఁడ ననుదానికే వ్యాఖ్యానాను సారము వ్రాసిరి. మిగిలినవి వదలిరి. శ్రీరామ నృసింహమూర్తి కవులు ఏదియు విడువక తెనుగు విభక్తులఁ జేర్చి మూలమును యథార్థముగ తెలియఁజేసిరి. గమనింపుఁడు. పోతన్నగారి రచనయందలి వివరణము శ్రీధరుని వ్యాఖ్యానము ననుసరించియున్నది. శ్రీరామ నృసింహమూర్తి కవులు పోతన్నవలె మూలమును వదలక క్రొత్తవి చేర్చక వ్యాఖ్యానములనుపట్టుకొని రచన సాగింపక మూలమునను సరించినట్లు సాధ్యమైనంత స్పష్టముగ పురాణమును ననువదింపవలెనో యట్లే భాగవత పురాణ మనువదించినారు.

శ్రీ కె. శ్రీరామమూర్తి, శ్రీ జి. భోగేశ్వరరావు, శ్రీమాన్ ముడుంబై కృష్ణాచార్యులు, శ్రీ గంధం రామారావు గారలు వ్రాసిన

సమీక్షలతో ఏసంపుటమున కాసంపుటమునందలి కథాసంగ్రహ ముతో నిండుగనున్న యీ శ్రీ మదాంధ్రభాగవతము తప్పక చదివి తీరవలసినగ్రంథము. కవులదీక్ష, దక్షత అభినందింపఁదగినదిగా నున్నది.

"క్షేమేంద్ర"

——

